శ్రీరస్తు.

1827.

# శ్రీరామ పట్టాభిషేక నాటకము.





స్వర్గీయ

పాతాళభేది సుబ్రహ్మణ్యకవిచే

రచియింపఁబడి

బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య, బి, ఏ,

గారిచేఁ బరిష్కరింపఁబడినది.



 [ వెల. రూ 2-00.

1929

శ్రీః.

శ్రీత్రిపురసుందర్యై నమః.

# శుభోదంతము.

శ్రీరామపట్టాభిషేకనాటకము:— ఈయది తిరుపతి వాస్తవ్యులగు బ్ర॥ శ్రీ॥ పాతాళభేది సుబ్రహ్మణ్యశర్మచే రచింపఁబడినది. అధునాతనాచారము ననుసరించి యుపోద్ఘాతము వ్రాయునవకాశము నాకు గ్రంథకర్తగారిచేఁ గల్పింపఁబడినది. కొన్ని నెలలకు మును పీ యీనాటకమునఁ గొన్ని యంకములు కవివలనే చదువఁగా వినియున్నవాఁడ. కనుక ముద్రితమగు దీని సందంపు మరలఁ బఠించితిని. ఇక్కాలమున గ్రంథరచనయందుఁ బుట్టుకల యెంత యుండవలయునో యుపోద్ఘాతము వ్రాయ బతిమాలుటయందును నంత పొందవలసిన స్థితి యేర్పడినది. కాని యీకష్టము మీఁ కవివర్యులకుఁ దప్పినది. వారడుగఁగనే నే నంగీకరించితిని. ప్రాయశః నన్నుపోద్ఘాతము వ్రాసియిమ్మని యడుగువా రత్యల్పతమసంఖ్యాకులు. అడిగినఁ జాలు నన్నవాఁడను నేను. కావున నీకార్యమునఁ బరిశ్రమము చాలఁ దక్కువయైనది. ఇదియే యీగ్రంథకర్తగారికిఁ గల కృతార్థ్యస్పృష్ట మనవలయు.

ఇది శ్రీరామచంద్రునిపట్టాభిషేకమహోత్సవకథను దెలుపు దృశ్యప్రబంధము. పూర్వమహాకవులు కావ్యములు రెండువిధము లని స్పష్టముగ నేర్పఱచిరి. శ్రవ్యమని దృశ్యమని యావిభేదములు. కవికల్పితమే కావ్యమనఁబడును. కాని శాస్త్రనియమముల ననుసరించి యుచితరీతిఁ గవి గ్రంథమును రచింపవలయునే కాని తనకుఁ దోఁచినట్లు నిర్మింపరాదు. "నిరంకుశాః కవయః" అనుమాట కర్థమే మని యడుగువా రుందురు. కవికిఁ గొన్ని యధికారములు గలవని శాస్త్రమే విధించెడిని. కాని యాయధికారమును గవి దుర్వ్యయము చేయరాదు. సద్వ్యయము చేసిననే కవి యగును. కావ్యకరణమునఁ గవి ధర్మార్థకామమోక్షము లను చతుర్విధపురుషార్థముల నొందఁగలఁడని శాస్త్రము ఘోషించుచున్నది. ఆఫలములఁ గోరువాఁడు శాస్త్రనియమముల ననుసరింపక తప్పదు. కావ్యనిర్మాణము సామాన్యకార్యము గాదు. ధర్మము నుపదేశింపఁజాలి యర్థార్జనమునకు సాయపడి సుఖము నొసంగఁదగి ముక్తి నొసంగ సమర్థము గావలయును. తపోయోగాదిమహాకార్యములవలనఁ గలుగఁదగు ముక్తి కావ్యనిర్మాణమునఁ గలుగవలయు నన్న నది లోకులకుఁ గర్తకు నెట్టిధర్మములఁ గఱపునదిగా నుండవలయునో వేఱుగఁ జెప్పవలయునా? కావ్యమును బఠించినవారు నీతి నెఱింగి ధర్మకార్యములఁ జేయవలయు నన్న యూహ గలవారు గావలయును. అట్టి యుత్కృష్టకార్యమును జేయించునదియే కావ్యమనఁబడు నని శాస్త్రకర్తలయుద్దేశము. ఆయుద్దేశము నుల్లంఘించి కావ్యమును నిర్మిం

చిన నది సత్కావ్య మనఁబడదు. చతుర్వర్గఫలములు మాకు ఫలదన్న నా గ్రంథము నకుఁ గావ్యమనుపేరు సార్థకము కాదు. కవి శాస్త్రపద్ధతిఁ బ్రవర్తించువాఁడే కావలయు నని దీనిసారము.

శ్లో॥ "చతుర్వర్గఫలప్రాప్తి స్సుఖాదల్పధియామపి ।
కావ్యాదేవ యతస్తేన తత్స్వరూపం నిరూప్యతే ॥
వాక్యం రసాత్మకం కావ్యం దోషాస్తదపకర్షకాః ।
ఉత్కర్షహేతవః ప్రోక్తా గుణాలంకారరీతయః॥"

అని సాహిత్యదర్పణము తెలుపుచున్నది. కావున నట్టి కావ్యనిర్మాణమునకుం గడంగుట సాహసమే యనవలయును. ఇఁక నీచర్చకు విశేషించి ప్రయత్నింపక యధికప్రసంగిత్వదోషభయమునఁ బ్రకృతవిషయమునకుం గడంగెదను.

శ్లో॥ దృశ్యశ్రవ్యత్వభేదేన పునః కావ్యం ద్విధా మతమ్ ।
దృశ్యం తత్రాభినేయం తద్రూపారోపాత్తు రూపకమ్ ।
భవే దభినయోఽవస్థానుకారస్స చతుర్విధః ।
ఆంగికో వాచికశ్చైవ మాహార్య స్సాత్త్వికస్తథా॥

అని మహాకవి విశ్వనాథుఁ డనువదించెను.

దృశ్యకావ్యమని శ్రవ్యకావ్యమని రెండుభేదములుగాఁ గావ్యము చెప్పంబడును. దృశ్యకావ్యమే నాటక మనఁబడును. అభినయయోగ్యముగా నది యుండుటంబట్టి యాపేరు గలిగెను. భారతభాగవతరామాయణాదులు శ్రవ్యకావ్యములు. అందుఁగలకథ వినఁదగినదై యుండును. అందుఁ జూడఁదగినభాగ మేదియు నుండదు. అందలి యితివృత్తము మనోవేద్యమే. నాటకములఁ గలకథ చక్షుర్వేద్యముకూడ నగుచుండును. నటులయందు రామాద్యాకారము లారోపింపఁబడును గాన రూపకమని పేరు గలిగెను. నటుఁడు రామాదులవేష మూని వారివలెనే నటించును. ఆకాలమున నానటుని రామునిగా నే ప్రేక్షకులు భావింతురు. ఆరామునిసంతోషము తమసంతోషముగను రామునిచింత తమచింతగా నే వారు భావింతురు. అట్లుభావించుట నటునియనల్పాభినయచాతుర్యముననే కదా కలుగును? తాఁ జదువుచున్న పద్యమునుగాని చెప్పుచున్నమాటనుగాని యభినయపూర్వకముగాఁ బ్రేక్షకులకుం దెలుపక పాషాణస్తంభమువలె నిలువంబడి పఠించినచో నం దేమి పాఠకులు గ్రహింతురు. అది పురాణపఠన మని తలంతురు. కావుననే యభినయప్రధానము నాటకమని తేలెను. అది శాస్త్రవిహితముగాక నటునియిచ్ఛాధీన మగుచో నంతకంటె నసత్ఫలదాయకము వేఱొకటి కాదు. నటుఁడు తననటనముమూలమునఁ బ్రాచీనకాలకథ యప్పుడు జరిగినదానినిగాఁ బ్రేక్షకులు తలంచునట్లు చేయవలయును. అట్టి నాటకమును జూచునపుడు ప్రేక్షకులు సంతోషమును శోకమును దమ రనుభవింతురు. దాన దుష్కార్యము లని సత్కార్యము లని చెప్పఁబడున వేవని తమంతన

గ్రహింతురు. అట్లు గ్రహించునట్లు చేయుట నటకునికర్తవ్యము. అట్లు చేయఁబడినదే నాటకము. తక్కినది బూటక మనంబడును.

ఈకాలమున నీనియమము లన్నియుఁ దాఱుమాఱు చేయఁబడుచున్నవి. నక్కను జూచినవాఁ డెల్ల వేఁటకాఁడేయన్నట్లు నాటకమును వ్రాయువారే పెక్కండ్రు కనఁబడుచున్నవారు. నాటకమున లోకులు నీత్యవినీతులలక్షణము తెలియుగునట్లు వ్రాయువారు పెక్కండ్రున్నచో దేశమున కంతకంటెఁ గలుగవలసిన మహాలాభమేమి యుండును? కాఁబట్టియే నాటకనిర్మాణ మసామాన్యమని చెప్పుదురు. "నాటకాంతం హి సాహిత్య"మ్మను ప్రాచీనసూక్తియుఁ జూపట్టెడిని. ఇఁక నాటకమున నుండక తప్పని కొన్నివిధులు గలవు. నాందీపద్యము కథను సూచింప వలయునే కాని కవియొక్కయుఁ దన్మహిమముయొక్కయుఁ బ్రఖ్యాతిని దెల్పునదిగా నుండరాదు. అంకములు నియమము ననుసరించియుండవలయును. అనఁగాఁ దొలుతటియంకము నిస్తృతిం గాంచి వరుసగా నవ్వలివి యల్పములై తుదియంకము పెద్దదిగా నుండవలయు నను నియమము గలదు. గోవాలాకృతిన్యాయమని దానికిం బేరు. పాత్రప్రవేశనిష్క్రమణములు యుక్తములుగా నుండవలయును. వీనిచేఁ గథ తాఱుమాఱు కాదు. ప్రదర్శనార్హములుగాని భోజనవిహారాదులు ప్రదర్శింపరాదు. అనఁగాఁ బ్రేక్షకులకు విసుఁగుగాని విషాదముగాని కల్గింపరాదని యీనియమము తాత్పర్యము.

ఈనాటకమున నాందీపద్యమునఁ బదనియమము పాటింపఁబడుటయే కాక నాటకకథను సూచించునియమము పాటింపఁబడినది. సుపర్వావనచణుఁడు, రావణశాసనుఁడు, శ్రీవసుధాతనయాపతి యనువానిమూలమున రావణసంహారమును జేసి దేవతలఁ గాపాడి సీతాపతి యానందము నందె నను భావము సూచింపఁబడుచున్నది. వసుధాతనయాపతి యనుచోట వసుధకుఁ దత్తనయకును బతి యనునర్థము తోఁచును గానఁ గావ్యదోష మనరాదు. అట్టియన్వయము ప్రాయశః సజ్జనాదృతిం గాంచనేరదు. రమణం బ్రోచుఁగా అనుదానింబట్టి తనయవతారఫలమును దేవతలు మునులు పొంది రను నానందమున నున్న రామచంద్రుఁడు రక్షించు నన్నయర్థము పట్టాభిషేకమహోత్సవ మిందుఁగల కథాసార మని తెలుపుచున్నది. ప్రస్తావనాంతమున రాఁగల పాత్రప్రవేశము సూచింపఁబడుటచేఁ బ్రయోగాతిశయ మను నంగము గలదని యెఱుంగఁదగు. ప్రథమాంకమున సీత రామచంద్రునిఁ గూర్చి విచారించుఘట్టము మిక్కిలి చక్కఁగా రచింపఁబడినది. పతివ్రతాయగు నారీమణి కష్టస్థితియం దెట్లు పరితపించునో యను విషయ మెంతయో మనోహరముగా వర్ణింపఁబడినది. రావణుఁడు సీతం గాంచి స్వాభిప్రాయమును దెలుపుచోఁ గవి యుంచిన పద్యము హృద్యతమమై సందర్భోచితపదభూయిష్ఠమై యొప్పారుచున్నది. కంజనేత్ర, కలనినాద, మధురవాణి, సితకరాస్య, కమలపాణి, వలపులాఁడి యను విశేష్యముల రావణుఁడు సీతను సంబోధించుట యుచితముగ నగియున్నది. కాముకునినోట రాఁ

దగిన యీపద్యములనే మాతృభావ మూనఁదగిన శారదాప్రభృతులవిషయమున నుపయోగించినకవి యేటి కవియో పెద్ద లూహింతురుగాక.

మ॥ పడఁతీ తండ్రి త్యజించె, రాజ్యమునకుం బాసెన్, మహైశ్వర్యముల్
విడిపోయెం, దినఁ గూడు సున్న, లలియున్ లేదయ్యె, భోగంబులుం
జెడ ఘోరాటవి బమ్మరించు నరునిం జింతింతు వేమందునే
యడవిం గాసిన వెన్నె లాయెఁ గదె నీయందంబు చంద్రాననా.

యని రావణునోటఁ గవి చెప్పించెను. దీనియర్థము సహృదయహృదయాహ్లాదకరముగా నుంట నించుక వివరింతును. రావణుఁడు కామాతిరేకమునఁ గన్నుమిన్నెఱుఁగక యున్నవాఁడు. భూజాతయో భర్తృదైవతయై నిరంతరచింతాసాగరనిమగ్నయై పతియాగమనమునే ప్రతీక్షించుచున్నది. అట్టి తావున నిట్టి పడఁతి నిట్టి పురుషుఁడు మాటలాడించుచున్నాఁడు. సందర్భ మిది. ఇట్టితావునఁ గేవలకామాతురుండగు పురుషుఁడు కాంతామణిబుద్ధి మరల్ప నెట్లు ప్రయత్నించునో యూహింపవలయును. పడఁతీ యని తొలుదొల్త సంబోధించెను. అంత చాలక చంద్రాననా యని మఱియు సంబోధించెను. మొదటిది—వయస్స్ఫురితయగుటఁ దెలుపును. రెండవది—కాంతయందుఁగల లావణ్యాతిశయమును వెల్లడించును. చంద్రునివలె పరితాపమార్చు నోకులుకులాఁడీ యని రావణునిభావము. వయస్సున విఱ్ఱవీఁగుచు సుఖముల ననుభవించు నాసగల నీ వారామునిఁ దలంచుచు నింకనుండ నేల? ఆ రామునిఁ దండ్రియే వదలిపెట్టెను. రాజ్యము తనంతటనే విడిపోయెను. మిక్కిలి సుఖయశస్సులం గల్గించు నైశ్వర్యములు తొలఁగినవి. తుదకుఁ దిన నన్నము లేదు. ఇన్నింటికిఁ దోడుగా సౌందర్యము పోయినది. భోగము లింక నెక్కడివి? ఇంత చాలక మహారణ్యములలో దిక్కులేక తిరుగుచున్న ప్రాణేశ్వరు నేల చింతించెదవు! నీ తెలివితక్కువను గుఱించి నే నే మందును? తుదకు నీసౌందర్య మంతయు నడవిలోని వెన్నెలవలె నిష్ఫలమయ్యెఁగదా. అను భావ మీ పద్యరత్నమున నిమిడియున్నది. ఇది సమయానుగుణముగా రసమును బోషించుచు నెంత చర్చించినను విశేషార్థముల నిచ్చుచు ముద్దులు మూటగట్టుచున్నది ఇట్లే యిందుఁగల పద్యములఁ జర్చించిన నిది యే గ్రంథమును మించును. కాన నాపని మానితిని.

ఇందుఁ గలకొన్ని విశేషములం దడవెదను. అతికాయుఁడు రామభక్తుఁడని కవి సూచించెను. ఇది యెంతయుఁ దగియున్నది. ఈవిషయమున రంగనాథరామాయణ మీ నాటకము ననుసరించుచున్నది. భగవద్దర్శనమున దుష్టాత్ములమానసములు మాఱి భక్తిరసపూర్ణము లగు ననుట యొక వింత కాదు. రాక్షసు లనఁగా మహాక్రూరు లనుభావము సామాన్యముగా నెల్లరకుం గలదు. కాని యది సమంజసము కాదని యిక్కవి స్పష్టపఱచెను. ఈఘట్టమునఁగల సీసపద్యము, మత్తేభవిక్రీడితము విశేషించి శ్లాఘాపాత్రములుగ నున్నవి. రావణునకు హితము నుపదేశింపఁబూనిన వారలలో నతికాయుఁడు నొక్కఁడు జ్ఞానముగలవా రెల్లరు 'సీతాదేవి నిచ్చి రామచం

ద్రము నాశ్రయింపు’మని యే రావణున కుపదేశించిరి; అం దతికాయుఁడు మిన్నయనఁ దగియున్నవాఁ డని గ్రంథకర్తభావమైనట్లు కనుపట్టును. (రావణునిపుత్త్రులలో నొక్కఁడగు త్రిశిరుఁడు తమ్ముఁ యుద్ధమునకుఁ బంప వేఁడునప్పుడును, అతికాయుఁడు దా నానందించినట్లు పాత్రభావమును గవి పోషించెను.) ఏలాగో యిక్కవి కొన్ని పద్యములను భోజచంపునుండి పరివర్తన మొనరించెను.

శ్లో॥ యద్బాహురాహుఃరసనాయితశస్త్రధారా
దిక్పాలకీర్తిమయచంద్రమసం గ్రసస్తే।
తద్వైరిణాం రణముఖే శరణప్రదాయీ
నైవాస్తి కశ్చిదముమన్తకమన్తరేణ॥ భోజచంపు.

మ॥ అనిఁ ద్వద్బాహువిధుంతుదు ల్సెలఁగి ఘోరాస్త్రంపుజిహ్వావళిన్।
ఘనదిక్పాలయశోమయామృతకరుం గాఱ్ఱొంచు మ్రింగంగ నాఁ।
గన నీవైరుల కంతకుం డొకఁడు తక్కన్ లేఁ డొకం డేనియున్।
రణసీమన్ శరణిచ్చి నెవ్వగలు దీర్పన్ రాక్షసాధీశ్వరా॥

ఈ పరివర్తనము మూలార్థమునకు మెఱుఁగుపెట్టుచున్నది. దీనింబట్టి యించుక యోజింపఁ బ్రాచీనులభావములయందుఁ జక్కని యభిమాన మిక్కవివరున కున్నయట్లు కన్పట్టెడి. ఇదికాక మఱికొన్ని తావుల నిట్లు వరివర్తన మొనరించిన పద్యములు హృదయంగమములై యెసంగుచున్నయవి.

కొన్ని తావులఁ దిక్కనసోమయాజిపోకడలఁ గొన్ని పద్యము లల్లినట్లు స్పష్టమగుచున్నది.

ఉ॥ పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁడున్ రణంబునన్
దొట్టినమంట లాకొలఁది యోధుల సాత్యకియున్ విరాటుఁడున్,
జుట్టపుమేగు పుగ్రరణ శోభితుఁ డీద్రుపదుండు నిన్ను ని
ట్టట్టన వచ్చునే సురల కైనను నొల్లవు గాక చివ్వకున్
భారతము, ఉద్యోగపర్వము.

ఉ॥ పెట్టనికోట రామునకు భీమబలుం డగు సూర్యసూతి దా
నొట్టిన మంట లక్ష్మణుఁడు యుద్ధతలంబున యోధవర్యులై,
నట్టిరు జాంబవంతుఁడును నంజనపట్టియు నంగదుండు ని
ట్టట్టన నౌనె రాముని మహాగుణధాముని వైరిభీమునిన్॥
౧ అంకము.

తిక్కయజ్వశైలి నాటకరచనకుఁగూడ ననుకూలించు నని యిక్కవిభావమైనట్లు తోఁచెడిని. నాటకముచివరభాగమునఁ గల

గీ॥ భూరిసారప్రసవలయి పొల్చు నిర్వారకును, సదృశక్షమలకును రమణ మెరయ
ధారుణీజాతకును భూతధారణికిని జెలువు( డగుచును జిరము వర్ధిలఁగదయ్యా

అనుపద్యము.

శ్లో॥ భూరిసారప్రసవయో స్సదృశక్షమయోర్ద్వయోః
ధారుణీభూతధారిణ్యో ర్భవ భర్తా శరచ్ఛతమ్॥

అను కాళిదాసకృతమాళవికాగ్నిమిత్రమునఁ గల శ్లోకమును స్ఫురింపఁ జేయుచున్నది.

మఱికొన్ని యుదాహరణము లిట్టివి చూడ నగు.

శ్లో॥ దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః,
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః॥ అని వాల్మీకి.

ఆ॥ భార్య లెల్ల యెడలఁ బడయుంగఁ బడుచుండ్రు
బంధు లెల్లయెడలఁ బరగుచుండ్రు,
కూడఁబుట్టి తోడునీడగాఁ జరియించు
తమ్ముఁ డబ్బునీమ తనర డెందు॥ ౨ అంకము.

శ్లో॥ ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది,
పౌరుషే చాప్రతిద్వంద్వ శ్శరైనం జహి రావణిమ్.

అని వాల్మీకి.

తే॥ గీ॥ బాణమా! రామచంద్రుఁడు పౌరుషమున
నప్రతిద్వంద్వియేని ధర్మాత్ముఁ డేని,
దాశరథి యేని సత్యతత్పరుఁడు నేనిఁ
జంపుమువుగాక రావణి సమరమునను.

౬ అంకము.

ఇట్టి పోకడ లనేకములు గలవు.

మండోదరి రామావతారతత్త్వ మెఱుంగు నని పంచమాంకమునఁ గల్పించెను.

భరతునకుఁ గల భ్రాతృభక్తి చతుర్థాంకమున నత్యద్భుతముగా వర్ణింపఁ బడినది.

ఇఁక రావణపాత్రమును గవి యెట్లు పోషించెనో యించుక తడవెదను.
పంచమాంకమున రావణుఁడు మండోదరి నూఱడించుభాగమునందు.—

చం॥ ఎఱుఁగుదు మున్న రామవిభుఁ డెన్నఁగ వెన్నుఁ డటంచు నిర్జరు
ల్మఱిమఱి నన్నుఁ జంప బతిమాలఁగ నీగతి వచ్చె నంచు న,
ద్దెఱఁ గది యెల్ల నా విభువిదేవిని దొంగిలి తెచ్చినాఁడ ని
త్తఱి ననుఁ జంప వేగముగఁ దాఁ జనుదెంచు నటంచుఁ గాంత నే!

కాంతామణీ! నేను బుట్టినదాదిగాఁ జేసిన పాపకార్యము లెన్నియో కలవు. అవి యెల్ల నన్నలయించి పొలియింపకుండునా?

చం॥ చెఱచితి జన్మముల్ విబుధశేఖరపాళిని భంగపెట్టితిన్
జెఱఁగొనితిం బతివ్రతలఁ జేడ్పడఁ జేసితి మానులన్ సతీ,
యెఱుక దొఱంగి పేర్చి యలయించితి లోకము లెల్ల వేళ ని
త్తెఱఁగున హింసలే సలిపితిన్ మఱి మే లెటు నాకుఁ జేకురున్.

అని కవి మార్చెను. దీనింబట్టి పరికింప రావణుఁడు కపిలమునితోఁ బోరాడినప్పు డామహాత్ముఁ డొనరించిన యుపదేశము, సనత్కుమారునియుపదేశము మనసునఁ బట్టి శ్రీరామచంద్రునామమున నవతరించిన శ్రీమహావిష్ణువుచేతిలోఁ దనకు మృతి గలుగుట ధ్రువమని నమ్మియే దానికై త్వరపడి సీతాపహరణాదికృత్యములు గావించె నని కవి యవనిక నలంకరించి ధన్యుఁ డయ్యె నని తలంచుచున్నాఁడను. ఇది యెంతయుఁ దగియున్న దని సంతసించుచున్నాఁడను. ఇట్టిఘట్టముల నెన్నింటినో పరిశీలింప గ్రంథమం దంతటను రామప్రభావము నిండింపఁబడి వక్తలకు శ్రోతలకు నీతిని గఱపునదిగా నాటక మున్నదని నాభావము. ఏయేపాత్రము నేయేరీతిగాఁ బోషించిన బాగో యట్లే నాటకమున మెలఁకువ గలిగి యాకవి పోషించె నని నే నెంచు చున్నాఁడను. తక్కిన నాటకలక్షణములఁ బ్రధానభాగములు స్పష్టముగాఁ గనఁబడునట్లు వ్రాయకున్నను సంధిపంచకమునకు నిందుఁ జోటు లేకపోలేదు. వాని నన్నింటిని గనఁబఱచుట యధికప్రసంగమునఁ జేయు నని వెఱచి వదలితిని.

మొత్తముమీఁద నాటకము ప్రశంసార్హముగా నున్నది. ఆయాపాత్రములకు నుండఁదగిన భావము చక్కఁగా బోషింపఁబడినది. ప్రదర్శనానర్హములగు విషయములకు నిందుఁ దావు లేదు. కావున నీనాటకము ప్రదర్శనార్హంబై ప్రశంసార్హంబై యున్న దని నొక్కి వక్కాణించుచున్నాఁడను. మంచి మంచి నానుడులుగల పద్యము లిందుఁ గలవు. అవి కంఠపాఠము చేయఁదగినవి; నీతిబోధకములు. ఇంకను దెలుపఁదగిన విశేషాంశములు పెక్కులు గలవు. కాని గ్రంథవిస్తరభీతి వాని మానితిని. ఈ నాటకము తెలుఁగుదేశమున నెల్లయెడల వ్యాపించి గ్రంథకర్తకు నిర్మలయశస్సును సంపాదించి చిరకాలము వర్ధిల్లుఁగాక యని వారక కోరుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు సాధుజనవిధేయుఁడు
జనమంచి, శేషాద్రిశర్మ.

శ్రీ-శ్రీ-శ్రీ.

## (గ్రంథముపైఁ గతిపయ పండితాభిప్రాయములు.)

"KALAPRAPURNA"
VEDAMU VENKATRAYA SASTRY,
4, Mallikesvaran Street
G. T. MADRAS, 5-4-29'

పాతాళభేది సుబ్రహ్మణ్యకవిగారు శ్రీరామపట్టాభిషేక మను స్వవిరచితాంధ్రనాటకమును నాకొసంగినారు. వీరు తిరుపతిలో కోర్టు వకీలగు శ్రీ నాగపూడి కుప్పుసామిఅయ్యరు బి, ఎ. గారిచేత ఆంధ్రగీర్వాణములయందు సుశిక్షితులైన సాహిత్యవంతులు. వీరియాగురువుగారు గొప్పవిద్వాంసులు మంచిలాక్షణికులును. తదనుసారముగ శిష్యులు వీరును మంచి లాక్షణికులుగానే యున్నారు. అందులకు ఈ నాటకమే తార్కాణము. ఈ గ్రంథము ప్రాచీనోత్తమకావ్యములసరణిం బొరసియున్నది.

గ్రంథమున వీరే చదివి వినిపించిన కతిపయభాగములను వింటిని; సంతసించితిని. దానంజేసి గ్రంథమంతయు వినం గుతూహల మగుచున్నది.

వేదము - వేంకటరాయశాస్త్రి.



శ్రీ

బ్రహ్మశ్రీ పాతాళభేది సుబ్రహ్మణ్యకవిగారిచే గ్రథితమైన శ్రీరామపట్టాభిషేకనాటకమును జదివి యమందానందము నొందితిని. శ్రీరామపరములైన రూపకము లనేకము లుండఁగా, మరల నియ్యుపక్రమ మేల? యను ప్రశ్నము మురారిజయదేవకవులచే నీవఱకే దత్తోత్తరము. వానియందుంబోలె నిందుఁ గల్పన బహుళము లేకయున్నను, ఉన్నది సైత ముచితమై కవిలోకజ్ఞతకుఁ దార్కాణముగా నున్నది. నాయకునియుత్కర్షము సర్వత్ర నిపుణముగా నిర్వహింపఁబడినది. పద్యములు తొలికవులపోకడలఁ దలంపించుచున్నవి. గద్యములు దీర్ఘములయ్యు దురన్వయదూరములై హృద్యములుగా నున్నవి. విద్వన్మణులైన బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుసామయ్యగారియొజ్జతనమున నాఱితేఱిన వీరిరచన నిర్దుష్టమై యుపాదేయముగా నున్నదన్న వింత యేమి?

నెల్లూరు.
22-6-1929

దుర్భా - సుబ్రహ్మణ్యశర్మ,
ప్రధానాంధ్రపండితుఁడు,
వేంకటగిరిమహారాజాగారి కళాశాల.

మ. రా. రా. శ్రీ బ్రహ్మశ్రీ పాతాళభేది సుబ్రహ్మణ్యకవిచే రచియింపఁబడిన శ్రీరామపట్టాభిషేకనాటకమునఁ జాలభాగము చదివి యానందించితిని. దానిలో యుద్ధకాండకథయంతయు నాంగ్లేయనాటకసరణి ననుసరించి యంకపంచకమున ముప్పదిమూఁడు రంగములలో రసోచితవిభాగముగా నిర్ణయింపఁబడి హృదయరంజకముగాఁ గథాసంవిధానచాతుర్యము మెఱయునట్లు రచియింపఁబడియె. దీనిలో నీరససంభాషణములును, అప్రకృతములగు వర్ణనాంశములును జాగ్రత్తతోఁ బరిహరింపఁబడినందున సంస్కృతనాటకములలోని రససంగ్రహనైపుణి యుచితముగా వెలయుచున్నది. భావములు ప్రఘట్టోచితములై పాత్రశాతాచితిని బోధించుచున్నవి. శైలియు సమధారావిలసితమై యశిథిలబంధమై యున్నది. కవి యీ గ్రంథరచనమునఁ జాల శ్రమించి యాంధ్రనాటకసమితిలో మేలైనపదవి చెందఁజాలిన మంచికృతిని లోకమున కొసంగెనని తలంచుచుఁ జిరపరిచితుఁడైనను గ్రంథకర్త యిట్టి రసవత్కృతిఁ బ్రచురింపఁగలఁడని యూహించి యుండకున్నను బరమమోదము కలిగించిన యితనిమహోభ్యుదయమును శ్రేయమును మనఃపూర్వకముగాఁ గోరుచున్నాఁడను.

9—8—29
చెన్నపురి.

(సం) మా. రామకృష్ణకవి.



# FOREWORD.

I have great pleasure in responding to the wish of Mr. Patalabhedi Subrahmanyam that I should write an introduction to the new play with which he is now appearing before the Telugu Literary world. As I proceed to do so, I recall with great vividness, the very attractive impressions he formed on my mind about fifteen years ago, when he was my student at Pachaiyappa's College, Madras. Keenly interested in Telugu Literature, and giving promise of literary composition of great value even at such an early age, young Subrahmanym was always a welcome visitor at my house and I used to enjoy immensely listening to the Telugu stanzas with which he regaled my ears with his inimitably sweet voice. Many things have happened to him and to me during this interval of years; we have gone our different ways and we have had our own shares of the joy and sorrows of life. But I am glad to realise we are united still in some of our literary interests and it is a matter of real satisfaction to me to welcome him as a Telugu Dramatist.

One of the reasons for the wide popular appeal of the Dramatic Literature of Greece was its constant choice of themes from the ancient mythology of the people, and Mr. Subrahmanym has followed in the wake of that excellent example, by weaving this plot round the activities of the great hero of the *Ramayan*. His triumphs over Ravana; the devoted services of his lieutenants; his return to his capital from his exile of years and the culminating episode of his coronation are all incidents which evoke the most tender sentiments in all Hindu hearts and a good reception is therefore assured for this play even by the nature of this subject. His treatment is worthy of the theme and his composition is full, not merely of exciting dramatic incidents, but also of delicate touches of feeling and character. Gifted with an eloquent command of vocabulary, he has imparted considerable energy and spirit to his verses which make very pleasant reading indeed. Being still youthful in years he excels particularly in the treatment of scenes of battle, but it is not difficult to discern ability in his works in various other directions also. No writer of any incident connected with the life of the hero of the *Ramayan* can afford to depart very much from the classic version of Valmiki's epic, but it is clear that Mr. Subrahmanym has thought much about his subject and he has had the courage to introduce a few things of his own. While congratulating him on this production, it only remains for me to express the hope that he will have more literary successes in the future and he will have the good fortune of enriching this branch of Telugu Literature which, undoubtedly, stands in need of further achievements.

Sanatana Dharma College,<br>CAWNPORE,<br>12th July, 1929.

P. SESHADRI,<br>*Principal and Senior Professor of English.*

# ధన్యవాదము.

---

శ్రీరామపట్టాభిషేకనాటక మను నీగ్రంథము నారచియించిన నాటకములలో మూఁడవది. కాని ముద్రణము గాంచినవానిలోఁ దొల్తటిది. శ్రీ తిరుపతిపురంబున వెలసియుండు శ్రీ సరస్వతీవిలాససభవారు "విభీషణపట్టాభిషేక"మను నాటకము ప్రదర్శించి యప్పట్టున నింకను సీతాదేవి శ్రీరాముని జేరక లంకలోనే తపస్విని నా నున్నదని యాడినమాట యేను విని వారిమూఁకకొలంతి దీర్పను, "రామాయణయుద్ధము నాటకముగ వ్రాయఁగలవా" యని యొకానొకరు నన్నడిగినపోటు మాటకు సమాధానముగ నుండను మది నెంచి రసవంతముగ రచియింపఁగల్గుదునో యన్న శంక యొక్కవంక మది నొక్కుచున్నను నస్మత్కృతకిల్బిషపంకంబుఁ బోఁగడిగికొన రామనామామృతధారయే సాధనమని యెంచి యీనాటకరచనకుఁ గడఁగితిని. పూర్వపునాటకపక్కికిని నిప్పటిప్పుడు పాశ్చాత్యసంసర్గమున దానిలోఁ గలుగుచుండు మార్పులకును నొక్కసమ్మేళనము గలిగిన నొక్కచొప్పుగ నుండు నని యందందు నీగ్రంథమున నా యిచ్చవచ్చినపోకలఁ బోయియున్నవాఁడను. కార్యము గొప్పది. నాకుఁగల శక్తి మిక్కిలి యు నలంతి. శాస్త్రమెఱుంగను. వశ్యవాక్కును గాను. అట్లగుటం బండితప్రకాండులయుల్లంబుల కెక్క రచియింప నలంతిని గాను. ఈవిధముగ శ్రీరామార్చనము చేయ నెంచి నాకావించిన యీసాహసమునకై నన్ను మన్నింప నెల్లర వేడుచున్నాఁడ.

ఈగ్రంథము నెట్లును ముద్రింప నే వలయు నను పట్టు వట్టి రచనము త్వరమ్మై నాచే రచియింపఁజేసి "పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నారాయణు"నట్లు ముద్రణాంతము దనుక నొక్కటే నాపూనిక నూఁడి యీకార్యము శ్లాఘ్యంబుగ నిర్వహించిన యస్మన్మిత్రవతంసులగు బ్రహ్మశ్రీ తూశా విశ్వనాథశాస్త్రిలగారియెడలను, నా కాంధ్రకవిత్వంబు నేర్పుగు దెలిపి నాచేఁ బద్యములు రచియింపఁజేసి వానిని బరిశీలించుచు నాంధ్రభాషామహావార్ధి దాఁట నాపాలిటి తేఁప్పమై యీగ్రంథమును సైతము నాయెడఁ గల శిష్యవాత్సల్యాతిశయమునఁ బరిశీలించి మచ్ఛ్రేముషీమూలంబై తనరిన మస్తుపవస్యలను నఖిలాంధ్రకవిలోకచిరపరిచితులును నాంధ్రగీర్వాణసద్వ్యశపాండితీవిలాసభాసురులును నగు బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారియెడలను, నా చిన్ననాఁటినుండి యొజ్జనము వహించి నాయెడఁగలికుఁర్మి పేర్మి నారచియించిన యీగ్రంథము నెంతయు

నోపికతో ముద్రణం బొనరింప ననువుగ నెత్తి వ్రాసియిచ్చిన శ్రీయుత కందికట్టి వేంకటసుబ్బరాయలునాయుఁడుగారియెడలను, నాంధ్రగీర్వాణముల నా కొజ్జయై, నన్ను నిరతముఁ బ్రోత్సహించుచు గ్రంధము రచింపఁజేసిన శ్రీమాన్ మాడభూషి మఠం వేంకటాచార్యులుగారియెడలను, బ్రహ్మశ్రీ బండేపల్లి శేషశాస్త్రులుగారి యెడలను, ముద్రణంబును సవరించుచు నీరూపు గ్రంథమునకుఁ గల్గఁజేసిన విద్వాన్, బ్రహ్మశ్రీ సరస్వతి వేంకటసుబ్బరామశాస్త్రులగారియెడలను, నా వేఁడి నంతన మిగుల నాదరంబున నుపోద్ఘాతము వ్రాసియిచ్చిన కావ్యపురాణతీర్థులు, నభినవాంధ్రవాల్మీకిబిరుదాంకితులును నగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి యెడలను, నాకళాశాలావిద్యాభ్యాసమునాఁడాదిగ నాయందలి వాత్సల్యవిశేషం బున వ్యక్తిదూరమయ్యును ననురక్తి నాయెడ సక్తము గావించి యీగ్రంథమునకు నాంగ్లభాషలో భూమిక (Foreward) వ్రాసియిచ్చిన శ్రీమాన్ పూండి శేషాద్రి (M. A) గారియెడలను, నాటకకర్తలకు సులువుగ నలవడని గౌరవమును బ్రస్తావన వ్రాసియిచ్చి నా కలవరిచిన కావ్యపురాణస్మృతితీర్థ విద్వాన్ బ్రహ్మశ్రీ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారియెడలను నన్నెల్ల వెంటలఁ బ్రోత్సహించుచు మత్పురోవృద్ధికి సాహాయ్యము సూపుచుండు నస్మన్మిత్రబృందము నెడలను గరము కృతజ్ఞుఁడనని యొక్కమాఱు కేలు మోడ్చి తలవాంచి నతి యొనర్చుకంటె నే నేమి నొచేయఁగలవాఁడను. “చంద్రున కొక్క నూలిపోఁ” గన్నట్లు నాయీవందనంబుల ల్లరును డెందంబులఁ గైకొని నన్ను మన్నింతు రని కడుంగడు నర్థిఁ బ్రార్థించువాఁడ.

మాకథానాయకుఁడగు శ్రీరామచంద్రమూర్తి యెల్లరకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యపరంపరల ననుగ్రహించుత మని యమ్మహనీయునిపాదపద్మముల కెఱఁగువాఁడ.

ఇట్లు

విపశ్చిజ్జనవిధేయుఁడు,

గ్రంథకర్త.

శ్రీరామపట్టాభిషేకనాటకమునందు వచ్చుపాత్రములు.

# పురుషులు.

| | |
|---|---|
| సూత్రధారుఁడు | ప్రధాననటుఁడు |
| కుశీలవుఁడు | ఒకనటుఁడు |
| శ్రీరాముఁడు | కథానాయకుఁడు |
| భరతుఁడు | శ్రీరాముని మొదటితమ్ముఁడు |
| లక్ష్మణుఁడు | శ్రీరాముని రెండవతమ్ముఁడు |
| శత్రుఘ్నుఁడు | శ్రీరామునికడగొట్టుతమ్ముఁడు |
| వసిష్ఠుఁడు | ఇక్ష్వాకులగురువు |
| దశరథుఁడు | శ్రీరామునితండ్రి |
| సుగ్రీవుఁడు | వానరరాజు |
| అంగదుఁడు | వానరయువరాజు |
| జాంబవంతుఁడు | సుగ్రీవునిమంత్రులు. |
| హనుమంతుఁడు | |
| సుషేణుఁడు | వానరసైన్యాధిపతులు. |
| నీలుఁడు | |
| నలుఁడు | |
| గుహుఁడు | నిషాదనాయకుఁడు శ్రీరామునియాప్తమిత్రుఁడు. |
| అగస్త్యుఁడు | ఒకమునీశ్వరుఁడు. |
| సూర్యుఁడు | శ్రీరాముని వంశకర్త, లోకబాంధవుఁడు. |
| బ్రహ్మ | సత్యలోకాధిపతి. |
| శంకరుఁడు | కైలాసనాయకుఁడు. |
| ఇంద్రుఁడు | దిక్పాలకులు |
| అగ్ని | |
| యముఁడు | |
| వరుణుఁడు | |
| వాయువు | |
| నలకూబరుఁడు | కుబేరుని పుత్రుఁడు |
| మాతలి | ఇంద్రుని సారథి |
| గరుడుఁడు | ఖగరాజు |
| సుమంత్రుఁడు | దశరథుని మంత్రి, సారథి |

| | |
|---|---|
| రావణుఁడు | రాక్షసచక్రవర్తి |
| మాల్యవంతుఁడు | రావణునిమాతామహుఁడు |
| ఇంద్రజిత్తు<br>అతికాయుఁడు<br>దేవాంతకుఁడు<br>నరాంతకుఁడు<br>త్రిశిరుఁడు | రావణుని కొడుకులు. |
| కుంభకర్ణుఁడు | రావణుని పెద్దతమ్ముఁడు |
| విభీషణుఁడు | రావణుని పిన్నతమ్ముఁడు, రావణుననంతరము రాక్షసచక్రవర్తి |
| ప్రహస్తుఁడు<br>మహోదరుఁడు<br>మహాపార్శ్వుఁడు<br>యూపాక్షుఁడు | రావణునిమంత్రులు. |
| జ్వాలాజిహ్వుఁడు | రావణునాస్థానపుదౌవారికుఁడు |
| శార్దూలుఁడు | రావణుని వేగులవాఁడు |
| విద్యుజ్జిహ్వుఁడు | రావణునిబంటు |
| రక్తనాసుఁడు | ఒక రాక్షసుఁడు |
| కాలనేమి | మారీచునికొడుకు, ఒక రాక్షసుఁడు |
| మకరాక్షుఁడు | ఖరునికొడుకు, ఒక రాక్షసుఁడు |

## స్త్రీలు.

| | |
|---|---|
| సీత | శ్రీరాముని ధర్మపత్ని, కథానాయిక |
| రంభ | ఒక యప్సరోఽంగన |
| ధాన్యమాలిని | ఒక యప్సరోఽంగన |
| మండోదరి | రావణునిపట్టమహిషి |
| సులోచన | ఆదిశేషునికూఁతురు, ఇంద్రజిత్తుభార్య. |
| సరమ | విభీషణునిభార్య |
| త్రిజట | విభీషణునికూఁతురు |
| శూర్పకర్ణ<br>దీర్ఘనాస | రాక్షసస్త్రీలు. |

సమయోచితముగ నింకఁ గొందఱును వత్తురు.

శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీరామపట్టాభిషేకనాటకము.



## ప్రస్తావన.



వసుధాతనయాపతి
పావనరఘువంశజలధిశ్రీభవ్యశశి సుప
ర్వావనచణుఁ డా రాముఁడు
రావణశాసనుఁడు మిమ్ము శ్రీ రమణం బ్రోచున్.

[నాంద్యంతమున]

సూత్రధారుఁడు:—(పుష్పాంజలిం జల్లి,) (తనలో) ఏటికి నటుఁ డింత తడవు సేయుచున్నవాఁడు! కార్యభారనిమగ్నుఁడయి యుండనోపు. పిలిచెద. (తెరవంకఁ గాంచి) కుశీలవా, ఒక్కమా టిటు రమ్ము.

[నటుఁడు ప్రవేశించుచున్నాఁడు]

నటుఁడు:—ఆర్యోత్తమా! యేమి యాజ్ఞ?

సూత్రధారుఁడు:—మఱచితివా భక్తజనపోషకుఁడును, దుష్టరాక్షసశోషకుఁడును, నపారకరుణాసముద్రుఁడును నగు శ్రీరామభద్రుని వాసంతనవరాత్రమహోత్సవసందర్భమున శ్రీరామచంద్రపట్టాభిషేకము నభినయింప రసికావతంసు లగు నీసభ్యు లాజ్ఞాపించిరిగదా. నేపథ్యసంవిధానము సిద్ధముగ నున్నదిగదా?

నటుఁడు:—చిత్తము! మహాభాగ్యము. ఎవరిచే రచింపఁబడిన నాటకమును బ్రదర్శింప వలయు నని యానతిత్తురో?

సూత్రధారుఁడు:—అన్నివిషయంబులును దెలియనివానిపగిది నడుగుచున్నాఁడవు. నీయూహ శ్రీరామచంద్రుని సైన్యంబులు లంకను ముట్టడింప, రావణుఁడు దిక్కుదోఁపక యుక్కిరిబిక్కిరియై తనవారిమాటలనే తా నమ్మఁజాలనివాఁడయి పరిపరివిధముల నూహించిన యూహారీతి నున్నది. వినుము.

సీ. ఏమాన్యువసతి యా శ్రీమనోరమణున,
కలితతృప్తి నొనఁగూర్పనగు తిరుపతి
ఏసూరి యుదయించె నెలమిఁ గాశ్యపసగో
త్రమునకు మణిభూషణమువిధమున
ఏవిజ్ఞునభిజనం బెసఁగుఁ బాతాళభే
ది యనునామంబున దీప్తి మిగుల
ఏమనీషికిఁ దండ్రి యిందిరాపతిభక్తుఁ
డై మీఱునట్టి శ్రీరామసూరి
తే. ఏగుణజ్ఞునిగురుఁడు శ్రీనాగపూడి
వంశమౌళి కుప్పుస్వామి వరగుణమణి
ఏమహాకవి తెల్గున నింగిలీషు
సంస్కృతములందు నిపుణుఁడై సభల వెలయు.

నటుఁడు:—ఓహో!

క. బ్రాహ్మణకులవర్ధిష్ణుఁ డ
జిహ్మరసజ్ఞుఁడు బుధోపసేవితుఁ డగు సు
బ్రహ్మణ్యసుకవి నెఱుఁగనె
బ్రహ్మణ్యుం డతఁ డుదాత్తపండితుఁ డరయన్.

పూర్వులగు మహాకవులచే రచింపఁబడిన నాటకంబు లెన్ని యేని యు నుండఁగా నిప్పటి వాఁడగు నీతనినాటకము నెట్లు శ్రేష్ఠం బని పరిగణింతువు?

సూత్రధారుఁడు:—పండితప్రకాండులమన్ననం బడసినవాఁడు పూర్వకవులమార్గంబు ననుసరించి జిగిగఁ గైత చెప్పునట్టి యీకవీంద్రుఁ బ్రోత్సాహించుట మనధర్మము. ఇంతకంటె భాగ్యంబు గలదా! అంతియ గాక మహాకవి కాళిదాసు కంఠోక్తిగ నుడివినమాట విననై లివా?

"పురాణమిత్యేవ న సాధు సర్వం, న చాపి కావ్యం నవ మిత్యవద్యం
సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే, మూఢః పరప్రత్యయనేయబుద్ధిః"

కాఁబట్టి యిన్నియు నెఱింగిన నీయూహ శుకసారణులు తెలియనివారని వారిమాటల నమ్మక, శార్దూలుఁడు వృద్ధుఁడు తగినవాఁడు కాఁడా యని శ్రీరామసైన్యం బరయఁ బంపిన రావణుని తెలివిని మించుచున్నదే.

నటుఁడు:—చిత్తము. (ఆలకించి) మననటులపుడే సంసిద్ధు లయినట్లు కన్పట్టుచున్నది. భావికార్యంబునకుఁ బూనుదము.

సూత్రధారుఁడు:—నామాటలే కథాభాగమున కుపక్రమణిక యని నమ్మిరి కాఁబోలు. ఇదె రావణుఁడు చింతాయత్తుఁడై వచ్చుచున్నాఁడు. ఇఁక మనము పోదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

శ్రీ ర స్తు.

# శ్రీ రామ పట్టాభిషేకనాటకము.

---

## ప్ర థ మా ం క ము.

### ప్ర థ మ స్థ ల క ము.

[ప్రదేశము (లంకాపట్టణము) రావణునాలోచనామందిరము.]

[రావణుఁడు చింతాయత్తుఁడై ప్రవేశించుచున్నాఁడు.]

రావణుఁడు:—ఆహా! ఏమన వచ్చు నీరాముని సామర్థ్యము! నిల్చినచోట నిలువక యితఁడు చెట్టులను గుట్టలను ద్రిమ్మరుక్రోఁతిమూఁకలను గూర్చుకొని నామీఁద నెత్తి వచ్చియున్నవాఁడు. వారిసాహాయ్యమున సర్వమును సాధింతు నని వచ్చినవాఁడు. ఇక్కపులును నంతకుఁ జాలిన వారలే. కాకున్న దుష్కరమగు సముద్రలంఘనకార్యము పోతమాత్రుఁడగు వానరుఁ డొక్కఁడే చేయునా! అంతటఁ బోక యాకీశాధముఁడు నాకెంతయుఁ బ్రీతిగొలుపునశోకవన మెల్లఁ బెకలించి పాడుచేయునా? అక్షకుమారాదివీరుల నెల్లరఁ బొలియించునా? తాను వృక్షశాఖలు దక్క లాంగూలముఁ బెంచు నెవ్వియును బూనక యస్త్రశస్త్రధారుల నిర్జరారివీరుల లెక్కకు మిక్కిలిఁగ నెక్కండ్ర నొక్కుమ్మడిఁ జక్కాడివైచునే. అక్కటా! కాలవైపరీత్యము నిది సహింపఁగలవాఁడ. నరవానరులు చెలరేఁగి నరాశనుల మీఁది కెత్తి వచ్చిరి.

ఆ. వె. బెండు లొకట మునిఁగి గుండులు దేలిన
ట్లగ్గి చల్లనయి సుధాంశుఁ డేర్చు
నట్లు నరులు రేఁగి యసురులఁ జెనకంగ
నెట్టివేళ యయ్యెరా నే మనంగ.

ఆహా! ఈ సుగ్రీవుఁ డేమనవలయు. అన్నను మోసమునఁ జంపించి యతనిసతిని రాజ్యమును జేకొని తాను నొక్క బిరుదుమగఁడువోలె రామునకు బాసటయై వచ్చియున్నవాఁడు. వాలి నట్లే తన్ను నారాముఁ డేల చంపక విడిచిపుచ్చు నని ధైర్యమున నెన్నకున్నాఁడు. రామునికి బాసటగ వచ్చినకపివీరు లందఱును నమోఘవీర్యు లని శుకసారణులు తెలిపిన మాటలు నిక్కము లగునా! నిక్కమున కారసిచూడ శాఖామృగపాళి కంతటిబీరము లెక్కడివి! అవి యతిశయోక్తులుగా నోపు. అందఱు నొక్కతలయంట. ఆరాముఁ డొక్కఁడే యొక్కతల యంట. అది యతిశయోక్తి యనుటకుఁ గాకున్నది. ఆరాముఁడు జనస్థానయాతుధానులఁ బదునాల్గువేవుర వీరవరేణ్యుల నొక్కముహూర్తమున నెక్కటి కయ్యంబున నేలకుఁ దెచ్చినవాఁడు మారీచాదిమాయావులఁ బెక్కండ్ర మాయముచేసినవాఁడు. అట్టి శూరశిఖామణికిఁ బౌలస్త్యకులపాంసనుఁడగు విభీషణుఁ డొక్కఁడు తోడ్పడెనె. అక్కటా! తరువునఁ బుట్టినయగ్గి తరువునే యేర్చునట్లు పులస్త్యవంశమునఁ బుట్టి పౌలస్త్యులవినాశమే కోరుచున్నాఁడీ విభీషణహతకుఁడు. కానిమ్ము. ఈరామాగ్ని నార్ప రావణాభ్రము శరవర్షము గురియించుఁగాక. ఆరాముఁడు నాకోపాగ్నికిఁ దొలిహవిస్సు. విభీషణుఁడు రెండవహవిస్సు. అంతలో నాకులము నిష్కలంకం బగును. ఆహా!

ఉ. హీరమరాళగాంగసికతేందుమహేశ్వరశైలమల్లికా
వారిజపారిజాతఖసురద్విపవారణశుభ్రమగాఁ జెలంగు నీ
వీపులస్త్యవంశమున భీకరవిభీషణుఁ డన్నమచ్చ నేఁ
డారయ సంభవించె నకటా! కులగౌరవ మంతరింపఁగన్.

[దౌవారికుఁడగు జ్వాలాజిహ్వుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దౌవారికుఁడు:—జయము జయము దానవేశ్వరునకు. దేవా! ద్వారమున శార్దూలుఁడు వచ్చియున్నాఁడు.

రావణుఁడు:—రానిమ్ము.

దౌవారికుఁడు:—చిత్తము.

(నిష్క్రమించును.)

రావణుఁడు:—శుకసారణులు భీరువులని నీతివిశారదుఁడగు మహోదరునితోఁ జెప్పి యిప్పుడీశార్దూలుని రాముఁడు దండుతో విడిసియుండు సువేలాద్రికి రామాదుల తెఱఁగు లారయఁ బంపితిని. వీనికథ యేమో కనుఁగొందుఁ గాక.

[శార్దూలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

శార్దూలుఁడు—జయము జయము రాక్షసేశ్వరునకు. దేవా! అదె వాఁడను. (నమస్కరించి లేచి నిలుచును.)

రావణుఁడు—శార్దూలా! పోయివచ్చితివా? అక్కడివృత్తాంత మేమి? ఏపాటి కోట్లు సైన్యమున విస్తృతమై యున్నది?

శార్దూలుఁడు—దేవా! క్షమింపుము. ఆభయ మింకను దీఱలేదు. (వడఁకును.)

రావణుఁడు—ఏభయము? నీకేమైనది? ఊరక యేల యిట్లు వడఁకెదవు?

శార్దూలుఁడు—దేవర ముద్రలఁ దలఁదాల్చి సువేలాద్రిని వనచరవేషుఁడనై ప్రాకితిని. అక్కడఁ గూడిన యాబలఁగ మేమందును. దానవసార్వభౌమా! వా రెంతటి ధైర్యవంతులు! తలఁచిన డెందమునఁ దలఁకు పుట్టుచున్నది. తొలితొలిగఁ గొండ్రుముచ్చులు సేనను బరివేష్టించియుండు నది గని యేము కోఁతిరూపులమై తిన్నగ లోనికిఁ జొచ్చితిమి. వారికి లోపలివైపున భల్లూకముల మూఁకలు గూడి యుండెను. అన్నియు నారయుచు నేము లోనికేగితిమి. అక్కడ వానరసైన్యములు చుట్టును బలసియుండెను. ఇన్ని సైన్యములకు నడుమ యున్న నడిమిప్రదేశంబున సుగ్రీవహనూమదంగదాదు లగు కపివీరులు కొలుచుచుండ సానుజుండగు రాముఁ డుత్సాహియై సుఖాసీనుఁడై యుండఁ గంటిమి. ఆరాముని తేజమే మన చెప్పవచ్చును! అది యిట్టిదని చెప్పరాదు. అయ్యపారతేజము మాకు వెక్కసపాటు గల్గింపఁ గొండొక వేళ కడు గిడి యొకసరిలి యటఁ జేరిన బలంబులకొలందుల నారయుచుంటిమి. వానరరూపంబుల నాసైన్యమునఁ దిరుగాడు మాజాడ యెఱిఁగి దేవరయనుజుఁ డగు విభీషణరాజు....

రావణుఁడు—ఆ! ఆదురాత్ముని నాయనుజుఁ డనకుము. ఆద్రోహిపేరెత్తిన నాసర్వావయవములును నిప్పులఁ బొరలిన ట్లగును.

శార్దూలుఁడు—చిత్తము. క్షమింప వలయును.

రావణుఁడు—ఇంక వానిని నాతమ్ముఁ డనకుము. ఆవంశద్రోహి మనినంతకాలము నా కూటట గలుగదు. నిష్కళంకంబై నెగడిన పులస్త్యవంశమునకు నీనికృష్టాత్ముని కారణంబున నేఁడు కళంకంబు పొరసెను. కానిమ్ము. అటుతర్వాత నేమి యయ్యె? ఆ కులద్రోహి ని న్నేమనెను?

శార్దూలుఁడు—అతఁడు మాసడి యెఱింగి వానరులకుఁ గనుసన్న చేసెను. వారును నాతనిసన్న యెఱింగి మమ్మెల్లరఁ జుట్టుముట్టి చెట్లలు పట్టి విఱిచికట్టి మాయొడళ్లు దవదవలగునట్లు పిడికిళుల బలిమి కొలఁది గ్రుద్దుచు దయారాశియగు రామునెదుటకు నెట్టుకొనివచ్చిరి. విభీషణుచేత నప్పటికే యేను దేవర వేగులవార మని యెఱిఁగియుండుటకతనఁ గన్నుల నిప్పులు రాల సుగ్రీవుఁడు మ మ్మందఱఁ గడతేర్ప నాజ్ఞ యిమ్మని రాముని వేఁడెను. అప్పట్టున నేను జేయునది లేక యా రామునే శరణువేఁడితిని. నాయనుచరులును నాయట్లే చేసిరి. రాముఁడును కృపార్ద్రదృష్టుల మమ్ముఁ దిలకించి మాబంధముల సడలింపఁజేసి నిజబలం బెల్లఁ జూపించి పంపుఁ డని వానరవీరుల కానతియిచ్చెను. వారును నాతనిమాట శిరసావహించి యట్లు చేసిరి. వారికడ వీడుకోలు వడసి బ్రదికితిఁగదా యని పాఱుతెంచి యిక్కడి కేఁతెంచితిని. నాతోడివారును నింతకు వచ్చుచుందురు. ఇదె చూడు నాసంధబంధముల నెట్లు పట్టులు దప్పె నొప్పులు వట్టెనో.

రావణుఁడు—పాపము! నాకతమునఁ జాలఁ గీడ్పడితివి. నీవు చూచివచ్చితి వంటివిగదా. ఆరాముని బలములకును మన బలములకును దారతమ్యంబును గంటివా? ఇం దేవి బలవత్తరంబు లగునో యింత తెలియఁ జెప్పుము.

శార్దూలుఁడు—దానవచక్రవర్తీ! ఉభయబలంబులు నమోఘంబులు.

రావణుఁడు—నిక్కము వచించితివి! నిక్కము వచించితివి! మనబలంబులే యమోఘంబులు. రామునిబలములు సత్త్వహీనములు. నీయభిప్రాయ మేమి?

శార్దూలుఁడు—అట్లనుటకుఁ గాదు దేవా! రామునిబలములసత్త్వము నా కనుభవవేద్యమే కదా. ఆబలములవీర్యధైర్యము లప్రమేయములు. రామధర్మపాలితంబులై భీమాకారత విజయంబు గోన నుత్సాహించుచు నెదురులేనిక నకులోరగన్యాయమున నాదేవబలంబు లయినట్లు కయ్యంబునకుఁ గాలుద్రువ్వుచున్నయవి. నాయభిప్రాయ మదిగదా.

చ. తడ వొనరింపకుండ వసుధాంతనయన్ నృపసూతి కిచ్చి నే
ర్పడ శరణంచు రాఘవుని పాదములం బడి వేఁడుకొంటయో
యుడుగక వీర్యముం బలముఁ యుద్ధమొనర్చి యరాతి గెల్చుటో
పడుటయొ తత్ప్రియుక్తపటుభల్లములన్ వడి నిశ్చయింపుమా.

రావణుఁడు—ఏమీ! నీవు నిచ్చుచున్నావా! చాలింపుము నీ హితోపదేశము.

ఉ. బుద్ధులు చెప్ప నెల్ల నటుపో విడు మింకను నాకు నియ్యసం
బద్ధపుమాట లెన్నఁడును వాకొనకుండుము రామునిన్ వెసన్
యుద్ధమునందుఁ జంపుటయొ తద్ధనుగతిఁ జచ్చుటయో కాక సీత నే
సిద్ధర వీడ దీనుఁడయి యోగతి రాముఁడె వచ్చి వేఁడినన్.

ఇది నానిశ్చయము. అక్కడఁ జేరినవారెవ్వరు? రాముని బలములో ప్రధానులెవ్వరు? మనల నెదుర్కొన నిశ్చయించిరి? ఎవ్వ రెవ్వరికొడుకులు? ఎవ్వరు వారి కుత్సాహం బొనరించువారు? మారక చెప్పుము.

శార్దూలుఁడు:——దానవేంద్రా! వినుము. ఆవానరబలమున కెల్లఁ బ్రభాకరుని కుమారుఁడు సుగ్రీవుఁడు ఱేఁడు. ఇంద్రుని మనుమఁడును వాలిపుత్రుఁడును నగు నంగదుఁడు యువరాజు. సుగ్రీవాదికపీశ్వరుల కెల్ల రక్షకుఁడు లంక నెల్లఁ గాల్చినవాఁడు మరున్నందనుఁడు హనుమంతుఁడు. అగ్నిసుతుండగు నీలుఁడు సర్వవానరచమూనాయకుఁడు. బ్రహ్మదేవునివలనఁ బొడమినవాఁడు నతివృద్ధుఁడును జిరజీవియును నగు జాంబవంతుఁడు వారందఱకుఁ గర్తవ్యంబున వెర వెఱింగించువాఁడు. ఇంకను నా సైన్యమునఁ జేయఁగలవారు హనుమంతునియయ్య కేసరి. సురలకాచార్యుఁ డగుబృహస్పతిపట్టి ధర్మవిదుం డగు సుషేణుఁడు. యమునికొడుకు దధిముఖుఁడు. చంద్రునితనయుఁడు సుముఖుఁడు. సముద్రము తరింప వానరుల కను వయిన సేతువు ఘటించిన నలుఁడు. విశ్వకర్మసూతి దుర్ధరుఁడు. మృత్యుతుల్యరూపులుగ విరించి సృజియించిన దుర్ముఖుఁడు. వరుణునితనూజుఁడు వేగదర్శి యను వీరవానరశ్రేష్ఠులును. దేవా యెంద ఱని యెన్నుదును. వీ రెల్లరు దేవాంశసంభూతులు. ఒక్కొక్కఁడును దశకోటివానరసైన్యాధిపతులకు నాయకుఁడు. యుద్ధకాంక్షులగు వీ రెల్లరును గర్తవ్యమున రామునకై నిన్ను మార్కొనఁగలవారు. ఆరామునకై యగ్నినైనఁ బిడికిలింత మని మున్నీటినైన నీఁది పారంబు ముట్టుద మని నిశ్చలోత్సాహమునఁ బేర్చినవారు. ఆరామునిమాటఁ బ్రాణములైన నర్పించి నెఱవేర్చువారు.

ఉ. పెట్టనికోట రామునకు భీమబలుం డగు సూర్యసూతి దా
నొట్టినమంట లక్ష్మణుఁడు యుద్ధతలంబున యోధవర్యులై
నట్టిరు జాంబవంతుఁడు ను నంజనపట్టియు నంగదుండు ని
ట్టట్టన నౌనె రాముని మహాగుణధాముని వైరిభీమునిన్.

రావణుఁడు:——చాలు నీపొగడికలు. రిపుని వందివలెఁ బొగడి పొగడి యలసితివి. ఈపాటి కింక విశ్రమింపుము.

[దౌవారికుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

దౌవారికుఁడు:——జయము జయము త్రైలోక్యవల్లభునకు. దేవా! దేవరయాజ్ఞ మయిని విద్యుజ్జిహ్వుఁడు వచ్చియున్నవాఁడు. సన్నిధికి రా నాజ్ఞ కెదురుచూచుచున్నవాఁడు.

రావణుఁడు:——వానిని దోడ్కొని రమ్ము.

దౌవారికుఁడు:——భాగ్యము.

(నిష్క్రమించును.)

రావణుఁడు:——శార్దూలా! ఇంక నీ వేగుము.

శార్దూలుఁడు:——భాగ్యము.

(నిష్క్రమించును.)

రావణుఁడు:——(తనలో) సీత నిప్పుడు పరిపూర్ణముగ మోసగించి వశపఱచుకొందుఁగాక.

[దౌవారికుఁడు విద్యుజ్జిహ్వుని వెంట నిడికొని ప్రవేశించు చున్నాఁడు.]

దౌవారికుఁడు:——అతఁడే లంకేశ్వరుఁడు.

విద్యుజ్జిహ్వుఁడు:——దానవసార్వభౌమా! విజయివి గమ్ము. (నమస్కరించును.)

రావణుఁడు:—విద్యుజ్జిహ్వా! రమ్ము; నీసాయ మించు కంత నాకు వలసియున్నది. కావున నిన్నుఁ బిలిపించితిని.

విద్యుజ్జిహ్వుఁడు:—భృత్యుఁ డెల్లప్పుడును నేలినవారి కాజ్ఞాబద్ధుఁడు. ఆనతిండు. ప్రాణము లయిన నొడ్డి పనిచేయువాఁడు.

రావణుఁడు:—అయిన నిటురమ్ము. (అని వానిచెవిలో నేమియో చెప్పి) నీమాయ నేఁడు చూడవలయును. తడయక పొమ్ము. నే నిప్పుడే యట కేఁగువాఁడ.

విద్యుజ్జిహ్వుఁడు:—మీయాజ్ఞ యగు నంత కక్కడ సిద్ధముగ నుండెదను.

రావణుఁడు:—పొమ్ము. పొమ్ము. తడయకుము.

(విద్యుజ్జిహ్వుఁడు నిష్క్రమించును.)

జ్వాలాజిహ్వా! ప్రహస్తాదిమంత్రుల నెల్ల నాస్థానమునకు నేను దక్షణమే రమ్మంటి నని చెప్పి రమ్ము.

దౌవారికుఁడు:—చిత్తము. (నిష్క్రమించును.)

రావణుఁడు:—(తనలో) చూడవలయు నింక సీత యెట్లు సమ్మతింప కుండునో. ఈయెత్తితోలున సర్వమును నెఱవేఱఁగలదు గాక. (నిష్క్రమించును.)

---

## ద్వితీయస్థలకము.

[ప్రదేశము: లంకలోనియశోకవనము.]

[సీత, సరమ, రాక్షసస్త్రీలు ప్రవేశించుచున్నారు.]

సీత:—

ఉ. ఎన్నఁడు వత్తువో రఘుకులేశ్వర యిచ్చటి కీవు రావణుం
జెన్నఱ యుద్ధరంగమున జీవముగొందు వ దెన్నఁడో నను
మన్ననచేసి యేలికొని మక్కువ లాలన చేయు టెన్నఁడో
యెన్నఁడు గందునో యకట యింపగు నీవద నేందుబింబమున్.

ఉ. పావని చేరఁ గల్గెనొకొ భర్తృసకాశము నబ్ధి దాఁటుచో
నేవిధి విఘ్నముం గనెనొ యేఁగెనొ రాముఁడు నాదు దుస్థితిం
దా వినెనో సమస్తమును దానవనాయకుఁ జంప వచ్చునో
జీవము నిల్వఁగల్గెడినొ శ్రీహరి యేగతి నిశ్చయించెనో.

హా! రామచంద్రా! (ఏడ్చును.)

సరమ:—సీతా! ఊర కేల యిట్లు వాపోయెదవు. రాముఁడు వానరసైన్యములతో సువేలాచలంబున విడిసియున్నవాఁడు. నేఁడో రేపో వచ్చి రక్కసులఁ జక్కాడి నిన్నుఁ గొనిపోఁగలఁడు. నామాట నమ్ముము.

ఒకరాక్షసి:—ఓసీ! శూర్పకర్ణా! ఈ సీత కెంత తెగులే. ముల్లోకములకుఁ బ్రభుఁడును దానవచక్రవర్తియును నగురావణుని గాదని కేవలమర్త్యుఁడగు రామునిమీఁద మనస్సు నిలిపియున్నది. ఈపిచ్చి కేదియే మందు?

శూర్పకర్ణ:—ఈపిచ్చి కొక్కటే మందే దీర్ఘనాసా! మనరాక్షసనాథుఁ డామం దిచ్చుటకు నాఁడాక్రోతి వచ్చినయప్పుడు గడువు పెట్టెనే. ఇంకఁ గొన్నాళ్లకా గడువు తీఱిన నప్పుడు దీనిని జీల్చి కత్తి కొక కండగాఁ గోసి మన మందఱము దీనిఁ గసి దీఱఁ గొఱికి నజ్జుగ నములి మ్రింగి వేయుదము. అప్పటికిఁగాని దీనిపిచ్చి మానదు.

దీర్ఘనాస:—ఏమే సీతా! ఏమి చెప్పెదవు? మారాక్షసేశ్వరుఁ డిడిన గడువు కడచన వచ్చెను. ఇంకను నీవేమో యూరక రామా రామా యని కలవరించు చున్నావు.

శూర్పకర్ణ:—ఆ దోమ వచ్చి యీాలేమను బ్రేమతో సీమఁ జేర్చునఁట. వీారాముఁడు మానిగ్గరభీముని సీమలో నొక్కచీమయుఁ గాఁడు. నీ వేమో మాప్రభువుతో మెండొడ్డినదానవు. ఇంక నాతఁడు నేఁడో రేపో నిన్నుఁ గండలు కండలుగఁ జెండి కానులను గ్రద్దలను వేయును.

దీర్ఘనాస:—ఊరకేల యిటు చింతించెదవు. నీయదృష్టము పండినది సుమా. రంభాదులను నచ్చరపూఁబోఁడుల సైతము గాల నెట్టివైచు మారాజు నీయెడ నేమో మక్కువపడినాఁడు. అతని కోర్కె దీర్పుము. ఊరక చెడకుము.

సీత:—రామచంద్రా! సద్గుణసాంద్రా! ఈ పాపోక్తు లింకెన్నాళ్లు వినవలయును. రమ్ము. దయాసీమా! దానవభీమా! రమ్ము. రక్షింప రమ్ము.

ఉ॥ అక్కట! రామచంద్ర! దనుజావళి కాఱియపెట్టుచుండ నే
నెక్కరణిన్ భరింతు నని యెన్నితివో పతు లూర కుండినన్
దిక్కఱినట్టి కాంతలకుఁ దేఱుచు రక్షకు లెవ్వరయ్య యీ
ముక్కిడిరావణాధమునిఁ ద్రుంపఁగదే నను నేల రాఁగదే.

దీర్ఘనాస:—వచ్చుచున్నాఁడే నిన్నేలువాఁడు.

సీత:—ఏఁడీ! ఏఁడే! నానాథుఁడు రాముఁడు.

శూర్పకర్ణ:—రాముఁడు కాఁడు. ఇప్పుడు నిన్నేలువాఁడు మమ్మేలువాఁడు ఆమేలువాఁడు వాఁడే చూడుము. వచ్చుచున్నవాఁడై రావణదంతభంజనుఁడగు రావణేశ్వరుఁడు.

దీర్ఘనాస:—సీతా! బ్రదుకఁ గోరితివా, నీ యేడ్పులు చాలించి కిలకిల నవ్వుచు దైత్యనాథున కెదురేగి మోహము దొలుకాడఁ జూచుచుఁ బాదములఁ బడుము. అతఁడు నిన్నెత్తి కౌఁగిలించి లంకారాజ్యమున కెల్లఁ బట్టపురాణిగాఁ జేయును.

శూర్పకర్ణ:—అప్పుడు మూఁడు లోకములు నీపాదములకడఁ బరిచరించుచు నీపంపు తలఁ దాల్చి చేయుచుండును.

దీర్ఘనాస:—అదె వచ్చుచున్నాఁడు. ఏడ్పులు చాలించి నవ్వుమొగము చూపుము. ఊరక చావకుము.

[రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

రావణుఁడు:—ఏ మనుచున్నది సీత! ఇంకను నానరబ్రువునిచింత మాన లేదా సీత?-నే నిడినగడువు తీఱిపోవచ్చినది. ఏదీ సీతా! నీముద్దుమో మెత్తి నన్నుఁ జూడుము.

సీ. తెలిదామరలకు నెచ్చెలు లైన కన్నులఁ
గాంచవే యొకమాఱు । కంజనేత్ర !
చిలుకలఁ బలికించు లలితంపుఁబలుకులఁ
బలుకవే యొకమాటు । కలనినాద !
వీణియలకు రహి వెలయించుపాటల
మన్నింపు మొకసారి । మధురవాణి !
వెన్నెలకందేర్చి । విలసిల్లునగవులఁ
జెలఁగింపు మొకసారి । సితకరాస్య !
తే. గీ. బిసములకుఁ జెల్వమును నేర్పు । నెసఁగు కేలఁ
గౌఁగిలింపవె యొకపరి । కమలపాణి !
మూఁడు లోకంబులందును । బొసఁగనట్టి
కలిమి గలిగింతు నన్నేలు । నలవులాఁడి!

సీత: —హా ! రామ! రామ! రామభద్రా ! ఈఖలనిశాటాధము నెన్నఁడు తునుమాడుదువో. ఎన్నఁడు నన్నిబాధకుఁ దప్పింతువో. (తృణముఁ జేపట్టి) తృణమా! ఈనృశంసుఁడు నీకంటె లాఘవమువాఁడు. లోకమున నందఱచేతను దిట్టులు వడి నడపీనుఁగైనవాఁడు. ఈకట్టిఁడిపలలాశి యెన్నఁడు నిక్కంపుఁ బీనుఁగగునో. రామభద్రా! నీరామకు భద్రంబుఁ గూర్పరాదా. ఎన్నాళ్లని యీదుష్టునిచెఱ నుండుదాన! రామభద్రా!

రావణుఁడు:—అకటా! కోమలాంగీ! ఊరకేల యిట్లు రాముఁడు రాముఁడని వాపోయెదవు! మద్విలాసైశ్వర్యంబులఁ జూచియుఁ బౌరుషహీనుఁడగు నారాముని దలంచుట మానకున్నదానవు. నీ కన్నింటను నేన తగువాఁడను. బంగరుబొమ్మా! ఏదీ! ఒక్కసారి నీవదనేందుచంద్రికలఁ బఱపి మన్మానసేందీవరము నలరింపఁజేయుము. ఆరాము నింకఁ దలంపకుము.

మ. పడఁతీ! తండ్రి త్యజించె; రాజ్యమునకుం । బాసెన్; మహైశ్వర్యముల్
విడిపోయెం; దినఁ గూడు సున్న; లలి యుక్ । లేదయ్యె; భోగంబులుం;
జెడ ఘోరాటవి బమ్మరించునరునిం । జింతింతు; వేమందు నే;
యడవిం గాసినవెన్నెలాయెఁగదె నీ । యందంబు చంద్రాననా.

సీత:—ఛీ దురాత్మా! ఊరక కలుషోక్తు లాడకుము. నానాథుఁ డెదుటనె యుండినయెడల, నీపౌరుషము తెలిసియుండును. ఆపురుషవరుఁడు చెంత లేనితఱిఁ గపటపుసన్న్యాసివై వచ్చి నన్ను దొంగిలించి కొనితెచ్చితివి. ఇంకనైన బ్రదుకఁ దలంచితివా, నానాథునకు నన్నుఁ సమర్పించి యతనియడుగులఁ బడుము. అతఁడు నీయపరాధములు క్షమించును. కాకున్న నావీరవరేణ్యుని శరవ్యాళములు నీప్రాణానిలములఁ గ్రోలఁగలవు. అప్పుడైన నీ వతనిమహత్త్వ మెఱుఁగఁగలవు.

రావణుఁడు:—వానికి మహత్త్వ మున్నఁ గదా యెఱుఁగుట. ఆ పౌరుషహీనునిమహత్త్వము మాప్రహస్తుఁ డెఱిఁగియే యున్నాఁడు. రామునిశరవ్యాళములు నాప్రాణానిలములఁ గ్రోలఁగలవో!

నీ బెదరింపుమాటలకు నాకు నవ్వు వచ్చుచున్నది. మా ప్రహస్తగరుత్మానుఁడా రామవ్యాళము తల గఱుక్కునఁ ద్రుంచివైచినాఁడు. గతరాత్రమున నస్మత్సైన్యాధీశ్వరుఁ డగు ప్రహస్తుఁడు సబలుండయి యేగి వానరులతోడ సుప్తుండయి యున్న రాముని వధించి వానిశిరంబును శరాసనంబును గానుకయంపినవాఁడు.

సీత:—రాక్షసాధమా! ఊరక మాయలు పచరింపకుము. రాముఁ డిట్టిపలుగాకులచేఁ బడువాఁడు గాఁడు.

రావణుఁడు:—ఓసీ! శూర్పకర్ణా! ఉద్యానద్వారంబున నాభృత్యుఁడు విద్యుజ్జిహ్వుఁడు రామకీటంబు తలయును విల్లును గొని వచ్చియున్నవాఁడు. వాని నల్లే యిక్కడకుఁ బిలుచుకొని రమ్ము.

శూర్పకర్ణ:—భాగ్యము ! (నిష్క్రమించును.)

రావణుఁడు.—సీతా! ఇఁక నీమఱఁది యగులక్ష్మణుఁడు హతశేషు లగు కతిపయవానరులతోడఁ బలాయితుండయ్యె. అతనిని సైతము నాయనుచరులు పట్టితేరఁ బోయియున్నారు. వానిని సజీవునిగాఁ బట్టితెప్పించి నా ముద్దుచెలియ యగు శూర్పణఖచేత దానికసిదీఱ వానిముక్కు చెవులు గోయించి నాలుక వెడలించి తల గిల్లింతును. సుగ్రీవుఁడు భగ్నగ్రీవుఁ డయ్యె. హనుమ తునుమఁబడియె. అంగదునిప్రాణముల కంగద గలిగె. నీలుఁడు కాలునిఁ జేరె. వలీముఖుఁడు శిలీముఖంబుల నవసె. ఇట్లు నిశాచరోలూకములు నరవానరకాకంబులఁ బొదివి చిరిమిరిసె.

[విద్యుజ్జిహ్వుఁడు మాయాకల్పితరామశిరశ్శరాసనములు గొని శూర్పకర్ణతోడఁ బ్రవేశించుచున్నాఁడు.]

రావణుఁడు:—విద్యుజ్జిహ్వా! రణరంగమునుండి ప్రహస్తుఁడు నీచే నంపిన యారామునితలయును ధనువును సీతముందట నిడుము. (విద్యుజ్జిహ్వుఁ డట్లు చేయును)—సీతా ! ఇవె చూడుము రక్తసిక్తంబగునీరామునితలయును వానిధనువును. ఇంకనైన నామాటఁబట్టి నన్నుఁ జేపట్టుము.

సీత:—(చూచి) హా నాథా ! (మూర్ఛిల్లును.)

రావణుఁడు:—సీతా! ఇంకను నెక్కడి నాథుఁడు! చచ్చినవానిమీఁద మోహ మూని యేమి చేయఁగలవు ! రామచంద్రుని వీడి యింక నీరాక్షసేంద్రునెడ మోహము నూపుము. సుఖింపఁగలవు. లెమ్ము. మదీయాంతఃపురయువతీజనంబుల కవతంసంబ వగుదువు గాని రమ్ము.

సీత:—(మూర్ఛనుండి లేచి) హా! నాథా! (శిరము మూరొ్కని దువ్వుచు)

**సీ.** నీలమేఘచ్ఛాయ నెగడిసొంపారు నీ
యలకలా యివి యెట్లు కలఁగఁబడియె
సింహలలాటంబు చెలువు దీపించు నీ
ఫాలమా యిది యెట్లు వాడిపోయెఁ
గమ్మనితావులు గమగమ వలచు నీ
తిలకమా యిది యెట్లు తెలివి దక్కె

నెక్కువెట్టినవిండ్ల యెలమి దీపించు నీ
బొమ్మలా యివి యెట్లు పోలుపు దొఱఁగెఁ
దెలిదమ్మిరేకుల తెలివి వహించు నీ
కన్నులా యివి యెట్లు కాంతి దఱిఁగె
శ్రీకారములయట్లు చెన్నారుచుండు నీ
వీనులా యివి యెట్లు వ్రేల నయ్యెఁ
బూర్ణసుధానిధి పోలుపున వెలుఁగు నీ
నెమ్మోమె యిది యెట్లు సొమ్మసిల్లెఁ
జంపకకుసుమంబు సరవి సొంపైన నీ
నాసయా యిది యెట్లు నవక మేద
నిద్దంపుటద్దాలయుద్దిని నెసఁగు నీ
చెక్కులా యివి యెట్లు చెన్ను మాలె
శంఖంబువడువున జానొప్పుచుండు నీ
గ్రీవమా యిది యెట్లు కీడు పొరసె

తే. గీ. సజ్జనస్తవనీయసం చారణంబు
భవ్యనీతిసంయుతసాధు భాషణంబుఁ
దనరు నీదగు మస్తంబు ధరణి నిట్లు
దొరలఁ జేసిన విధి నెట్లు దూఱుదాన.

హా ! దుర్విధీ ! కైకేయిదేవీ ! నిపన్నాగము నేఁటికిఁ గుసిముట్టెనా! నీకన్నులు నేఁడుచల్లవడెనా! నీకోర్కులన్నియు నిప్పుడు నెఱవేఱెనా ! హా ! రామచంద్రా !

ఉ. అల్ల వివాహవేళ నను నల్లన కేల్గ్రహియించునప్పు నా
యుల్లము ప్రీతిగా హుతవహుం డటుసాక్షిగ నొప్పుచుండ నే
నెల్లవిధంబులన్ విడువ నెప్పుడు సీత నటన్నవాక్యముల్
పొల్లుగ నన్ను వీడి సురలోకము నేగతిఁ జేర నెంచితో.

నిత్యసత్యవ్రతుండ వగు నీవే యిట్లు సత్యభంగంబు నొనర్చిన నింక నితరుల నేమనవలయును! పితృవాక్యముల కసత్యతాకల్బిషంబు పొరయనుండఁ జేయఁ గాదా రాజ్యైశ్వర్యంబుల నన్నింటిని డిగనాడి యడవుల వసియింప వచ్చితివి. ఇట్లగుటకా! సీత యఖండసౌభాగ్యవతి యన్ననుడి నేఁటికి భంగము నొందెనా. శ్రీరామచంద్రుఁడు దీర్ఘాయుష్మంతుఁడును నిక్ష్వాకువంశోద్ధారకుఁడు నన్నవాసి యెల్ల నేఁటికి మాసిపోయెనా!

తే. గీ. వల్లభా! నామపూర్వభవమున నెట్టి
కన్యకాదానకార్యభంగము ఘటింపఁ

జేసితినో యిప్పు డివ్విధిఁ ॥ జెందె నన్నుఁ
బతివిరహాబాధ యక్కటా ! ॥ వసుధయందు.

క. పతివిరహ మోర్వరానిది
సతికిం బత్యనుగమనమె ॥ చక్కని తెరువౌ
గతి వేగము తగ్గింపుము
జతఁగూడఁగ వత్తు నిన్ను ॥ సరగన్ నాథా !

రావణుఁడు:—సీతా ! ఊర కేటి కిట్లు విలపించెదవు! ఊఅడి సుఖమార్గము వట్టి నా కానందముఁ జేకూరఁజేయుము. సౌఖ్యశ్రీ గలిగింతు రమ్ము.

సీత:—రావణా !

క. ఏగతికి రాముఁ డేగెనొ
యాగతికే యేను బోదు ॥ నతనికిఁ ద్రోహ్వై
వేగమె చంపుము సౌఖ్య
శ్రీ గలుగఁగనిమ్ము నీకుఁ ॥ జిరపుణ్య మగున్.

రావణుఁడు:—సీతా! శోకింపకుము. నామాట యింత వినుము.

[జ్వాలాజిహ్వుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

జ్వాలాజిహ్వుడు:—జయము జయము దానవచక్రవర్తికి. ఆస్థానంబున దేవర సేనాధిపతి ప్రహస్తుఁడును సమాత్యశ్రేష్ఠులును నవశ్యకార్యంబులకై యాలోచింపఁ జక్రవర్తిరాకకై యెదురు సూచుచున్నారు.

రావణుఁడు:—ఇదే వచ్చితిని!

(అని వానితోడ నిష్క్రమించును.) (విద్యుజ్జిహ్వుఁడును వారివెంటనే నిష్క్రమించును.)
(మాయాశిరోధనువులు మాయము లగును.)

సరమ:—సీతా! సీతా! ఈమాయ చూచితివా? ఇప్పుడైన గ్రహింపలేక పోయితివా! ఈకార్యము నిక్క మని నమ్మితివా ! రాక్షసమాయఁ గాంచితివా? రామున కొక్క కీడును గలుగదు. ఊరకేల యిట్లు దుఃఖింతువు.

సీత:—సరమా ! ఇం కెట్టికీడు రాఁగలదే. రామచంద్రునిశిరమే చూచితినే.— ఏదీ ! ఏదీ నాజీవితేశ్వరునియుత్తమాంగము! హా! నాహృదయేశ్వరుని మోముఁదమ్మిఁ దిలకించుచుండు భాగ్యమైన నాకుఁ గలుగదు గా హా ! రామచంద్రా !

సరమ:—జానకీదేవీ! రాముఁడు నెమ్మదిగ సువేలాద్రియం దున్నవాఁడు. అమంగళ మేల శంకించెదవు! ఆశిరము నిక్కముగ రామునిదిగా నెంచితివా? అది మాబావగారిమాయాకల్పితము. మాయాకల్పితములు గానవే యాశిరస్సును ధనుస్సును కానిపని గాఁగానే వా రటుబడలిపోఁ

గానే మాయమైపోయె. ఇం కొక్కటియు నరసి చూడుము. నిక్కముగ రాముఁడు చంపఁబడి యుండు నేని నిన్ను లోఁజేసికొనుటయే రావణునకు ముఖ్యకార్యమయి యుండును గాని వేఱుకార్య మవశ్యమయినట్టి దేది యుండును? ఇప్పు డాతఁడు రాము నెట్లు మార్కొన నగు నని మంత్రులతోఁ గార్యాలోచన మొనరింపఁ బోయియున్నాఁడు. నీచింత యిప్పు డతనికిఁ బట్టినది గాదు. లంకారక్షణమును రామమారణమును నిప్పు డతనికి మది నాక్రమించిన కార్యములు. చింతింపకుము. నామాటలు నమ్ముము.

సీత:—అయిన నిప్పు డీపని యేల చేసియున్నాఁడు?

సరమ:—ఇంత యూరయఁజాల వయితివా! నీకు రామునిశిరమును జూపినయెడల నీవు రామునిమరణము నిక్కమని నమ్ముదు వనియు, నామీఁద నీవు నిన్ను రక్షించు దిక్కెవ్వరు ను లేరని యెంచి వేఱుమార్గము లేకుండుటచేతఁ దనబుద్ధి మెయిఁ దన్ననువర్తింతు వనియు, నట్లు నీకుఁబాతివ్రత్యభంగము పొరసు నేని నీవు చేసినదోషంబున నీకుఁ బతి యగు రాముఁడు బృందపాతివ్రత్యభంగమునఁ దత్పతి యగు జలంధరుఁడను రాక్షసుఁడు చంపఁబడినట్లు సుకరంబుగఁ జంపఁబడవచ్చు ననియు నతనియెన్నిక. రామునిమరణమున నీ కెట్టిసందియము దోఁపకుండుటకై మాయామయం బగు నాతనిధనువును జూపియున్నాఁడు. అగ్నిశిఖమాడ్కిఁ జేరరాని నిన్నుఁ బుంజికస్థలావిషయమున బ్రహ్మ యిచ్చినశాపంబును, రంభావిషయంబున నలకూబరుం డిడినశాపంబును గారణంబులుగ బలవంతముగ నెనయ రాఁజాలమి నీయూహ వెదకి దీనిచే నెట్టు లేని నిన్నుఁ జెఱచుటకై రావణుఁడు నిన్ను మోసగింప నెంచి పన్నినట్టి పన్నుగడ యిది. ఊరక మోసపోయి మోహ మందకుము. నామాట నమ్ముము.

సీత:—నీమాటలవలన నిప్పుడు నాకుఁ గొంత యూఱట గలుగుచున్నయది. సరమా, మా రామభద్రుని మంగళాంగము నే నీజన్మమున మరలఁ జూడఁగల్గుదునా. అట్టినోమును నోఁచి యుంటినా. అంతభాగ్యము నాకుఁ గలుగునా!

సరమ:—ఊరకేల యిట్లకారణశంకలను నీమనస్సునఁ జొరనిచ్చెదవు. నేను రాక్షసాంగనను గానా! పుట్టినదాదిగ నీయసురులలో మెలఁగుచుండు నాకు రాక్షసమాయ తెలియదా! దివ్యమంగళవిగ్రహుండు ను సింహసంహననుండు ను నప్రమేయప్రతాపవంతుండు ను నగు శ్రీరాముం డెప్పుడు ను నట్టియకాలమృతికిఁ జిక్కువాఁడు గాఁడు. ఈ బడుగురక్కసు లాతని కొక్కలెక్క యగువారు గారు. వీరిచేత నతఁ డెన్నఁడు ను బడువాఁడు గాఁడు.

(తెరలోఁ దూర్యధ్వానము.)

సీతా! సీతా! వింటివా రాక్షసులతూర్యధ్వని. రాముఁడు నిక్కంబుగ మరణించియుండు నేని మఱియిప్పు డీయుద్ధయాత్ర యెవరిమీఁద కని. గోలా! బేల వైతివి గదే. నీ కింక సంతోషకాలము రానయి యున్నది. వ్యసనము మానుము. ధైర్యమూనుము.

సీత:—సరమా! నీవు నాకుఁ దోఁబుట్టువవు సుమా!

సరమ:—నాభర్త యగు విభీషణుని నీభర్త యాదరించి తనభ్రాతృవర్గమున నొక్కనిగఁ బరిగణించెను. మఱి నీ విపుడు నన్నుఁ దోఁబుట్టు వంటివి. రామచంద్రునకు రూపమున నే కాక గుణమున సైతము ననురూపపత్నివి నీవు. ఈనీవచనమున నన్ను ధన్యనుగా నెంచియుండుదానను.

సీత:—సోదరీ! సరమా! ఈరావణుఁ డూరక నన్నుఁ బలువిధములఁ గాఱియపెట్టుచున్నాఁడు. ఇంచుకంత కష్టమునకు సైఁచి యతనిరణోత్సాహ మెట్టిదో యింత తెలిసికొని వత్తువా?

సరమ:—తల్లీ! నీ విట్లడుగకొనవలయునే. ఇదె క్షణమాత్రకాలమునఁ గనుఁగొని వత్తును. అందాఁక నోపిక పట్టుము. రాక్షసమాయలకుఁ జిక్కకుము.

(నిష్క్రమించును.)

**యవనిక పడును.**



## తృతీయస్థలకము.

[ప్రదేశము—రావణునాస్థానము.]

[రావణుఁడు ఇంద్రజిదాదికుమారులతోను, మాల్యవంతుఁడు, మొదలగుమంత్రులతోను, బరివారముతోను బ్రవేశించుచున్నాఁడు.]

రావణుఁడు:—తాతా! నిన్న మాతల్లియు నన్నూరక తిట్టినది. నేఁడు నీవు ను నూరక నిందించుచున్నవాఁడవు. నీ వనవచ్చినదేమో యెల్లయుఁ గానిమ్ము.

మాల్యవంతుఁడు:—నాయనా! రావణా! పులస్త్యవంశము నేఁటిదాఁకఁ దామరతంపరై వాసిగాంచినది. అట్టిపావనవంశవృక్షము నూరక మౌర్ఖ్యమూని కూఁకటివేళ్లతోడ నేల యిట్లు పెకలించివైవఁ జూచెదవు. "వైరి యధికుఁడయ్యెడనేని వానితోడ స్నేహ మూనవలయును. సముఁ డయ్యెనేని, సంధి సేయ నగును. తక్కువబలమువాఁ డయ్యెనేని సమర మొనర్చి జయంబు గొనవలయు" నని నీతికోవిదులు చెప్పుదురు. ఇప్పుడు నీవైరి యగు రాముఁ డరసిచూచిన నధికుఁ డైనవాఁడు.

రావణుఁడు:—మాతామహా! నీకు ముదిమిచేత బుద్ధి పెడతలఁ బట్టినట్లు తోఁచుచున్నది. రాముఁడు నాకంటె నధికుఁ డెట్లగును? నరులు దానవుల కధికులన్నమాట వింతగ నేఁడు నీవు చెప్ప వింటిని?

మాల్యవంతుఁడు:—వత్సా! అట్లు గాదు. నామాట లన్నియుఁ దుదిముట్ట విని యట యుక్తి యుండినఁ గైకొని యమ్మెయి నడువుము. లేదేని నామాటలు పట్టకుము. నాకు దౌహిత్రుఁడ వగు నీవు నా కేభంగిని సంబద్ధపడనిరామునికంటెఁ జేవ మాలినవాఁడ వనియుఁ దక్కువవాఁడ వనియు నాడ నా కేమి వేడుకయా? కాక యేను వెఱ్ఱినా? ఇప్పు డొప్పయుండు భంగుల నన్నిటిని యోజించియే యట్లాడియున్నాఁడను గాని నిను వెఱపించుటకుఁ గాదు సుమా. తొల్లి భగవంతుఁడు సురాసురవిభాగ మేర్పఱచునప్పుడు ధర్మము సురలవంకను నధర్మ మసురులవంకను నిర్ణయించెను. ధర్మ మెప్పుడును నధర్మమును నడంచుచుండును. ధర్మ మెప్పు డధర్మము నడఁచునో యప్పుడది కృతయుగ మనియు, నెప్పుడు ధర్మము నధర్మము తగ్గించునో యప్పుడది కలియుగ మనియు నార్యులు చెప్పుదురు. తొల్లి నీవు దిగ్విజయమునకై వెడలియుండినయప్పుడు మునులు చేయుతపోయజ్ఞదానాదిధర్మవృద్ధికార్యంబులకు భంగము గల్గించియు, నీకు

సహజంబుగ నలవడిన యధర్మమును బరుల హింసించియుఁ బరదారలఁ జెఱలఁ బెట్టియుఁ బరధనముల నపహరించియు నభివృద్ధిఁ జేసి యున్నవాఁడవు. ఇంక రాముఁ డన్ననో పుట్టిన నాఁటఁగోలె దుష్టశిక్షణమునకును శిష్టరక్షణమునకు ను బూని యధర్మహానిఁ గలిగించి ధర్మ సంస్థాపన మొనరించుటకుఁ దాటకాదివధంబులును కౌశికమఖాదికార్యములసంరక్షణంబులు ను జేయుచు లోకహితము చేయుచున్నట్టివాఁడు. కావున నీకంటె రాముఁ డధికుఁ డంటిని.

నీ వావంతయు సరకుగొనక మున్ను దేవర్షి ప్రముఖులకన్యాపత్నీహరణము లెన్నియో చేసి కాలాగ్నిసన్నిభులగు నమ్మహనీయులకానసున్నలలో నీయెడ సహింపరాని కినుక గలిగించితివి. అప్పటినుండియు వారు నీమరణంబునకును రాక్షసవినాశంబునకునుం బూని వేదఘోషములు సేయుచునగ్నిష్టోమాదియజ్ఞంబు లొనర్చుచు వైశ్వానరుం బ్రీతుఁ జేయుచుఁ దన్ముఖంబున సర్వగీర్వాణుల నర్చించుచున్నవారు. ఆహోమధూమంబులే దెసలు నిండి రక్కసులతేజము నుక్కడక్కించుచున్నవి. వారితీవ్రతపంబులే రాక్షసులకుఁ దీవ్రతాపంబు గల్గించుచున్నవి.

రావణుఁడు:—హా హా! ఇంతటిపనికై చింతింతువేల! నీవగపు చూచి నవనీతము చేత నే పెట్టుకొని నేతికై వెదకున ట్లున్నది. నీమాటలు నిక్కములే యయిన నిప్పుడ పోయి యామునుల నాక్రమించి వారియజ్ఞంబులు ధ్వంసం బొనర్చి వారితపంబులు చెఱచి వారినుత్తుక లుత్తరించెద. అంత మనదానవుల కెల్ల సంతతతేజంబు గలిగి యుక్కుమ్ముడగును. ఇంతటిస్వల్పకార్యమున కై యేల యోజింతువు ?

మాల్యవంతుఁడు:—ఎంతటిజెడఁగవు తండ్రీ! ఇప్పటికే నీవు చేసినపాపకార్యంబులు కొండలంతలుగ నుండ, మఱి మఱి పాపమే యాచరింతు నంటివే. జ్వలజ్జ్వాలుని నాజ్యంబునఁ జల్లార్పఁ జూచెదవే! పోనిమ్ము. తొల్లి నీవు బ్రహ్మచేత వరములు గొనిననాఁడు దేవదానవయక్షులచే నవధ్యత్వము వేఁడికొంటివి గాని నరవానరులచేత నవధ్యత్వము గొనవైతివి. ఇంత ప్రాప్తికిఁ దెచ్చుకొని యేమందుము.

రావణుఁడు:—నరులు మనకు భోజనంబులు. ఋక్షగోలాంగూలవానరుల నొకలెక్కగ నేల చెప్పెదవు. సురాసురు లెల్లరు నాపదముల వ్రాలి దాసు లగుచుండ నీశాఖామృగక్రిమిజాలం బొకలెక్కయా! ఇది యేమెక్కు వని యాడితివి. హా హా ! ముదుసలివై నకతంబున నీబుద్ధి కేమైన జాడ్యము గల్గెనా? శివునిశూలమును విష్ణునిచక్రమును సరకుసేయనివాఁడవును రాక్షస వంశమునకుఁ గర్తవును నగు నీవు నేఁ డేమి యిట్టిపిఱికిమాట లాడుచున్నావు!

మాల్యవంతుఁడు:—కుమారా ! మాల్యవంతుఁ డెన్నఁడును పిఱికివాఁడు గాఁడు. రాజనీతి తెలియు నీ కెఱింగింప నెంచి యిట్లాడెదఁ గాక. దేశకాలసత్త్వము లెఱిఁగి తత్తదనుగుణంబుగఁ బ్రవర్తించురాజు చిరకాలము ప్రజల రక్షించుచు నిలాపాలనం బొనర్చుచుండును. ఇప్పుడు సత్త్వ మారయ నరవానరులచేత నవధ్యత్వము నీవు పడయనికారణముచేతను నీవైరి వానరులఁ దోడుకొనివచ్చియుండు నరుఁడై యుండుటచేతను నీయెడ నధర్మము ను నీవైరియెడ ధర్మము ను నిలిచియుండుకారణముచేతను వైరి నీకంటె నధికుఁడై యున్నవాఁడు. మఱి కాలమా? ఎల్ల కాలమును ధర్మమే జయించును. అధర్మము పరాజయం బొందును. కావున నధర్మపరుఁడవైన నీకంటెను ధర్మపరుండగు రాముఁ డధికుఁడై యున్నవాఁడు. ఇఁక నీదేశపుస్థితి యరసి చూడుము. నీదేశమునఁ బ్రజ లెల్లరును దైన్యమున విన్ననయి యున్నవారు. నీరాజధానియం

దెల్ల నవశకునంబులు పెల్లుగ నుప్పతిల్లుచున్నవి. ప్రళయకాలమునాఁటిగర్జలు సేయుచుఁ గెంపుమొగులులు లంకలో నెత్తురు గురియుచున్నవి. టెక్కెములు విఱుగుచున్నవి. జీవరత్నంబు లగు నేనుఁగులును గుఱ్ఱములును నూరక కన్నీరు నించుచున్నవి. వఱులును గాకంబులును గ్రద్దలును గూబలు ను బురము సొచ్చి రాత్రిందివము లేకాకృతిగ నఱచుచున్నవి. గోవులకు గాడిదలు పుట్టుచున్నవి. దానవుల కెల్ల నిద్దురల దుస్స్వప్నంబులు గలుగుచున్నవి. తెల్లని మేనులు నెఱ్ఱని యడుగులుఁ గల పులుఁగు లెల్లయెడలఁ బిండుగట్టి తిరుగుచున్నయవి. పంజరంబులలోని పెంపుడుఁగోయిలలు మనోజ్ఞస్వరంబులు వీడి యూరక జెట్టిదంపుటులివుల పీచి కూచి యని కూయుచున్నవి. కాలుఁడు వికటాకారమునఁ గృష్ణపింగళాంగుఁడై భయము గొలుపుచు బోడితలయై రాక్షసులయిండ్లఁ బ్రతికాలమును జూచుచుండునట్లు తోఁచుచున్నవాఁడు. నాయనా! ఇంతకంటె దేశారిష్టము లింకేవి కావలయును! నీవే యోజించి సమయానుచితకృత్యము జతపఱుపుము.

రావణుఁడు:—అయిన నన్నిపు డేమి చేయు మనెదవు?

మాల్యవంతుఁడు:—నాయనా! చేయఁదగినపని యీవఱకే చెప్పితి. నీతల్లియు నీకుఁ జెప్పియున్నయది. మరలఁ జెప్పెద వినుము. ఊరక పనిలేనిపనిగ దానవలోక మస్తమింప నీకుము. రాక్షసుల నెల్లర నెమ్మదిగ మననిమ్ము. మంచివేళ వచ్చునపుడు వైరిని గెలువవచ్చును. ఇప్పుడు జానకిని రామున కిచ్చి యతనితో సంధి చేసికొనుము. నీకు మేలగును.

రావణుఁడు:—ఏమీ! జానకిని రాఘున కీవలయునుగా! ఇంకఁ జాలును దాతా నీహితబోధము. ముదిమిని నీకు బలాబలతారతమ్యవివేచనజ్ఞానము నశించి నట్లున్నది. కాకున్న బక్కచిక్కిన మానిసి యగు రామునితోడనా సంధిచేసికొనవలయును!

ఉ. దిట్టతనంబుఁ జేవ యుఱి | ద్రిమ్మరుచున్ వనశైలసీమలం
జెట్టుల గుట్టలం దిరుగు | చెన్నఁటి కీసులమూఁక గూడఁగా
నిట్టుల వచ్చినట్టి నరు | నేమియొ యెక్కుడుగా నుతింతువే
దిట్టయ యైన నన్నదిరి | తేర్కొనునప్పుడు చూతు లెమ్మటన్.

మాల్యవంతుఁడు:—అయిన నీమూర్ఖ్యము మానవా. వినాశకాలము దగ్గఱునప్పుడు హితవాక్యము లెట్లు రుచింపఁ గలవు.

అతికాయుఁడు:—తండ్రీ! నీకు నేఁ జెప్పఁ గలవాఁడనుగాను. అట్లయ్యును నాకుఁ దోఁచినది విన్నవింప నెంచితి ననుమతియిమ్ము.

రావణుఁడు:—నీయెన్నిక యేమిటో తెలుపుము. అందఱు నొక్కసారియే యన్నియును గానిండు.

అతికాయుఁడు:—పెదతాతగారు చెప్పిన యన్నియును నిక్కము లని నే నెన్నెదను. ప్రకృతము మన రాజధానిని దోఁచు దుర్నిమిత్తము లారసియు నీవు వరములు గొనునాఁడు పడినప్రమాదంబు నారసియు నిపుడు మనపై నెత్తివచ్చినరాముఁ డింతవఱకు నొనరించిన యమానుషకార్యము లారసియుఁ జూచిన నీరాముఁడు కేవలనరుఁ డని తోఁచుట లేదు.

సీ. బాణము చేతను | బట్టనేరనినాఁడె
యుల్లతాటకను దూఁ | టాడి చంపె

నస్త్రప్రయోగంబు కనను వెఱుంగనినాఁడె
సుందసూతి సుబాహు ద్రుంపఁ జేసె
నడవులలోఁ జిక్కి యలజడిపడునాఁడె
ఘోరభంగి విరాధుఁ గూల్చివైచె
నలజనస్థానంబు నడుగువెట్టిననాఁడె
ఖరదూషణాదులఁ గాలుఁ జేర్చె
తే. గీ. మాయఁ బూనిన మారీచు మాయ సేసె
వానరాధిపు నలవాలిఁ బడఁగఁ గొట్టె
నామహావిష్ణుఁ డీరాముఁ డయ్యెఁగాక
యతఁడు కేవలమర్త్యుఁడే యసురనాథ.

ఇంక సీతయా!

మ. జనకక్ష్మాపతి యజ్ఞదేశమున నబ్జాతాక్షి యాలక్ష్మి యే
మనుజస్త్రీ యయి రామభద్రుసతి యై క్ష్మాలోకరత్నంబు నై
మనపాలింటికి మిత్తియై యసురనాశంబేర్చు పెన్గీలయై
తనరెం బేరున సీత నాఁగ నని డెందంబందు భావించెదన్.

దానవలోకనాయకా! ఏది యెట్లున్నను సీత పరాంగన. పరాంగనలపొందు గోరుట నరకమునకు నపయశమునకు వంశనాశమునకుఁ గారణము గదా. సుస్థిరధర్ముఁడవు ను బరమనీతిపరుండవు ను నగు నీ కేను జెప్పవలయునా? అట్టి కీడునకో కాని యీసీతను నీ విటకుఁ గొనితెచ్చిన దాదిగ మనవీట నవశకునములే తోఁచుచున్నవి. పెదతాత మాల్యవంతుబుద్ధి మేరకు సీతను రాముని కిచ్చి యతనితో సంధిచేసికొనుటయే లగ్గని నామతము. అట్లొనర్చితివేని రాముఁడు కృపార్ద్రబుద్ధిని నీతప్పుల వేయింటి నైన క్షమించును. అట్టినిఖిలలోకైకశరణ్యుఁడగు నారాజచూడామణితోడి మచ్చరంబు మానుము. పెదతాత చెప్పినమాట వినుము.

మాల్యవంతుఁడు:—మేలు! అతికాయకుమారా! మేలు! లెస్సగాఁ జెప్పితివి!!

అతికాయుఁడు:—ఉన్నమాట చెప్పితిని. ఊరక నన్నేల పొగడెదవు?

రావణుఁడు:—నీయుపన్యాసము ముగిసెనా? మీ రెల్లరు ను వైరియెడఁ బక్షపాత మూని సత్త్వరహితుఁడు ను కృపణుఁడు ను శాఖామృగాశ్రయుఁడు ను నైనరాముని బట్టులవలె సమర్థుఁడని పొగడుచు దానవలోకచక్రవర్తియు ను మహేంద్రాదినిఖిలనిలింపమౌళికోటీరమణిప్రభానీరాజితభాస్వచ్చరణకమలయుగళుండును నగు నన్ను జఘన్యునట్లు లతకరించి తెగడుచున్నవారలు. వలచి కానలనుండి మోహమునఁ గొనితెచ్చిన సీతను రాముని కిచ్చి వానిని వేఁడుకొనుటకు నేను భీరుఁడను గాను. ఇప్పుడె యా సత్త్వహీనుని రాముని ససోదరపరివారుని రణాంగణంబున భూతాళికి బలివెట్టెద. ఇంక నీమాట లుడుగుఁడు.

ఇంద్రజిత్తు:—తండ్రీ! కోపింపకుము. ఈయతికాయుఁడు బాలుఁడు. ఎవ్వ రెట్లాడిన నట్లు పోవువాఁడు. ఇంక మా పెదతాత మాల్యవంతుఁడు ముదుసలి. ముదుసలులకుఁ జిత్త మొక్కపట్టున

నుండదు గదా! కావున వారిపైఁ గినుకఁ బూనకుము. ఈ రాముని జంప నీవు వలయునా? నీకుమారుఁడ మేఘనాదుఁడ నే నున్నాఁడ. నన్నుఁ బంపుము. నాఁ డింద్రునంతటివానిఁ బట్టి తెచ్చి నీయడుగులఁ బడవైచితినే. నరుఁ డగు నీరాముఁ డింక నా కెంతపాటి.

రావణుఁడు:—మేలు! ఇంద్రజిత్కుమారా! మేలు! నీవు సుమా నామనస్సునకుఁ గూర్చువాఁడవు! అతికాయకుమారా! నీయన్నను జూచి యైన శౌర్యము నేర్చుకొనుము. ఇంకను గొండికవుగ నుండకుము.

మాల్యవంతుఁడు:—(స్వగతము) తండ్రికిఁ దగినకొడుకు వీఁడు. వీరు నశింప నుండ నామాట లేల వినుదురు. (ప్రకాశము) నాయనా! రావణా! నీపట్టు మానవు. అగ్నికి వాయువు తోడైనట్లు నీకు మేఘనాదుఁ డొదవెను. జయింపుము. నాకు ననుష్ఠానవేళ యైనది. నే నేగెదను.

(నిష్క్రమించును.)

రావణుఁడు:—మంత్రులారా! వింటిరా మామాతామహునివాక్యములు. ఈతఁ డింత పిఱికివాఁ డగునే!

మహోదరుఁడు:—నిర్జరారిసార్వభౌమా! ముదుసలియగు నాతనిమాటలు పరమార్థములుగఁ బట్టకుఁడు. దేవరయమోఘవీర్యంబును నద్భుతపరాక్రమమును మే మెఱుంగమా? దిక్పాలకు లట్టివారు మీకుఁ జరణదాసులయి యుండ నీబడుగుమానిసి రాముఁ డేకొలఁది?

ఇంద్రజిత్తు:—నిక్కము! మహోదరా, నిక్కము.! ఈరాముఁ డేకొలఁది? —తండ్రీ! నీకేలఁ జిక్కని వేలు పెవ్వఁడు? నిన్ను మార్కొనఁ గలవాఁ డీముజ్జగంబులలోను గలుగఁడు.

మ. అనిఁ ద్వాదశబాహువిధుంతుదు ల్చెలఁగి ఘోరాస్త్రంపుజిహ్వావళిన్
ఘనదిక్పాలయశోమయామృతకరుం గాఱ్ఱాంచు గ్రమింగంగ నాఁ
గన నీవైరుల కంతకుం డొకఁడు దక్కన్ లేఁ డొకం డేనియున్
రణసీమన్ శరణిచ్చి నెవ్వగలు దీర్పన్ రాక్షసాధీశ్వరా!

రావణుఁడు.—మేలు! మేఘనాదా! మేలు! నిక్కము వచించితివి! మంత్రీ! మహోదరా! ఏను జెప్పియుండిన పురరక్షణమునకైన గుప్తికర్మము నెఱవేర్చితివా?

[అప్పుడంతరిక్షమునుండి యంగదుఁడు ప్రవేశించును].

అంగదుఁడు:—నెఱవేర్చితిమి నెఱవేర్చితిమి నీగుప్తికిఁ బ్రతిగుప్తి.

రావణుఁడు:—ఏమీ! హనుమంతా! మరల నేల వచ్చితివి? చిక్కిన తోఁకయుఁ గాల్పించుకొనుటకా?

అంగదుఁడు:—నేను హనుమంతుఁడను గాను. మావానరనీతి ననుసరించి యితరులచే భంగపడిన వానరుని మేము బహిష్కరింతుము. ఇక్కడ రాక్షసాధములచేఁ దోఁక గాల్పించికొనివచ్చి పరాక్రమోపేతవానరానీకమునకుఁ దక్కువపేరు తెచ్చె నని యాహనుమంతుని మేము తన్ని తఱిమితిమి. మాపిడికిళులపోటులఁ బడఁజాలక వాఁ డేగుట్టల నేచెట్టులఁ బట్టి పోయెనో మే మెఱుంగము.

రావణుఁడు:—నీ వెవ్వఁడవురా కోఁతీ!

అంగదుఁడు:—ఓహో! నే నెవ్వఁడనో యెఱుఁగవా! నేను రామదూతను. రాము నెఱుఁగుదువా? పరశురాముగర్వము భంజించినవాఁడు. పరశురాము నెఱుఁగుదువా? కార్తవీర్యార్జునునిఁ జంపినవాఁడు. ఆయర్జును నెఱుంగుదువా? తనజలక్రీడకు భంగము ఘటియింపఁ జేసితి వని యలిగి నిన్నుఁ జెఱపట్టియుండినవాఁడు.

రావణుఁడు:—దురాత్మా! ఎవ్వఁడవురా నీవు! ప్రాణములపై నాస లేనివాఁడవు.

అంగదుఁడు:—ఇంకను న న్నెఱుంగవా! నేను వాలిపుత్రుండను. ఆవాలి యెవ్వఁడో యెఱుంగవా? నాఁడు తన్ను మోసపుచ్చవచ్చిన ని న్నెఱింగి నీయిరువదిభుజములను దనబాహుమూలయుగళమునఁ జిక్కించుకొని యట్లే యెగసి నాలుగుసముద్రములలోనను నిన్ను ముంచిముంచి తెచ్చి తనకుమారునకు "నాయనా! పదితలలపురువుతోడ నాడుకొందువా" యని యిచ్చినయాతఁడు గాఁడా వాలి? ఆపదితలలపురుగవై నసీతోడ నాడుకొనఁ జూచినయాకుమారుఁడనే యేను. అంగదుఁడను. భ్రాతృభార్యాక్రమణము చేసినయావాలి నొక్కటే శరమునఁ జంపిన శ్రీరామభద్రునకు నేను దూతను. రావణా! నే నెవ్వఁడనో యెఱిఁగితివా.

రావణుఁడు:—పేరిలరీ! దొంగవలె మాయాజ్ఞ లేక మాయాస్థానమునకు వచ్చి కొఱులు ప్రేలెదవా! చూడుము ని న్నేమి చేయింతునో.

అంగదుఁడు:—అబ్బబ్బా! ఈబూచి నన్ను బెదిరించుచున్నది. జడిసినాఁడను. జడుపుమంత్రమైన వేయించుకొనవలయును. దుష్కర్మా! ఎల్లరుఁ జూచుచుండ బహిరంగముగ ధీరతమై వచ్చిన నేను దొంగనా? కాక పతిలేనితఱిఁ గల్లకర్మందివేష మూని వచ్చి లోకైకమాత యగు సీతాదేవి నపహరించుకొనివచ్చిన నీవు దొంగవా? యోజించి చూడుము. నిక్కముగ నీ వన్నట్లు మాయావులదొర వగు నీ వుండుచోటు గాన నిది మాయాస్థానమే.

రావణుఁడు:—ఏమీ! ఒడలెఱుంగక మాట లాడుచున్నావు. నీ? దూత వన్నకారణమున ని న్నేనేమియుఁ జేయరాదు. నీవచ్చినకార్య మేమో చెప్పుము.

అంగదుఁడు.—ఆహాహా! ఎంతటినీతిజ్ఞుఁడవు నీవు. దూత నేమియుఁ జేయరా దన్నయాధర్మము నీకు మావిభీషణరాజేంద్రుఁ డెఱుఁగఁ జెప్పినదియే కదా. దానితో నాకేమి కావలయును? నా వచ్చినపని చెప్పెద వినుము. నీతో మహాత్ముఁడగు మాశ్రీరామచంద్రుఁడు చెప్పు మని కలిపి పుచ్చినమాటలు కొన్ని కలవు. నీతోడ రాయబారము నడప నన్నామహనీయుండు పుత్తెంచినాఁడు.

రావణుఁడు:—రాముఁడు మహాత్ముఁడు ను మహనీయుఁడు ను నయి మాతో రాయబారము నడప నిన్నుఁ గలిపిపుత్తెంచెనా? ఈకన్నుగాననిసాగరుఁదనమునకు ఫల మాతఁ డచిరకాలముననే పడయఁగలఁడు. కులాపశదుండగువిభీషణుఁడు మీపాలిటికి రాజేంద్రుఁ డాయెఁ గా! చెప్పులు తలకెక్కఁదొడఁగె. తీర్చెదఁ గాక. చెప్పు చెప్పు రాముఁ డేమి చెప్పి పంపెనో.

అంగదుఁడు:—అయిన విను మాశ్రీరామచంద్రుని మాటలు.

చ. "మునుపటిరీతి గా దిఁకను * మూర్ఖుఁడ! జానకిఁ దెచ్చి యిచ్చి లం
కను విడిపొమ్ము నీ విపుడె * కాచెదఁ గా దని యుంటివేని మ

త్సునిశితశ స్త్రపాతమునఁ దూలు శిరోదశకంబు మావిభీ
షణునకు లంక యిచ్చితి నిశాచరరాజ్య మతండ యేలెడిన్.

కావున నీ విప్పుడే జానకీదేవిని మా కర్పించి లంక వీడి వెడలిపోవలయును. అట్లు చేసితివా నిన్నుఁ జంపక విడిచిపుత్తును. కాదేని నీపాటు దయ్య మెఱుంగు''నని మారామచంద్రుఁడు నీతోఁ బల్కుమని చెప్పి పుత్తెంచెను. రావణా! నిన్నుఁ గన్నదాదిగ నామనస్సు సంకటపడు చున్నది సుమా! ఈ వాసేచనకంబగు సీతామహాదేవిరూపముఁ గాంచి యాతల్లి యాక్రమణీయ యని తలంచితివి.

ఉ. తా మద మెత్తి జాహ్నవినిఁ దారినభృంగము శంభుఫాలపుర్
సీమను గన్ను పద్మ మని చేడ్పడి చేరఁగ నెంచినట్టు లే
రాముతృతీయనేత్రముగ రాజిలు తత్సతి నాక్రమింపఁగా
నీమది నెంచి తీవు రజనీచర చేటును గాన వక్కటా!

రామభద్రునితోఁ బగ సాధింపకుము. ఆమహావీరుఁడు బాణ మెత్తెనా, యర్ణవములే ఘూర్ణిల్లును. లోకము లెల్లఁ దల్లడిల్లును.

సీ. హైహయుఁ డేఁచిన నిన్నలనాఁడు చెఱఁబెట్ట
నజుఁ డొక్కశీర్షము నపుడ వ్రాల్చె
బలిచక్రవర్తి నీబైసి మాల్చిననాఁడు
నజుఁడు రెండవశీర్ష మపుడ వ్రాల్చె
వాలి నిన్భుజములఁ బట్టినయానాఁడు
నజుఁడు మూఁడవశీర్ష మపుడ వ్రాల్చె
నవమతు లిట్లు నిన్నలమంగ నవి యెల్లఁ
గులమున కెల్లను గలిగె ననుచు

తే. గీ. రావణా! యింక జానకీ దేవిఁ దెచ్చి
రామునకు నీ వయితివేని రహిఁ దొలంగి
బ్రహ్మ నాల్గవతలయును వ్రాల్చుఁ జుమ్ము
చెప్పినాఁడను మీఁద నీచిత్త మింక.

పెద్దలకుఁ దలవంపులు ఘటింపఁజేయకుము. పావనబ్రహ్మవంశమునకుఁ గళంకముఁ గల్గింపకుము. నాహితవాక్యములు వినుము. ఊరక చావకుము. వేయిమాట లేల? రామభద్రునినిశ్చయము వినుము.

చ. మునుపు పురారిపూజనముఁ బొంటను దొమ్మిదిమస్తకంబులం
దునిమితి వీవె వెండియును దోఁచె నవే మహనీయమస్తకం
బొనరుటఁ జేసి యాశిరము నొయ్యన రాముఁడు త్రెంచి భక్తి దా
నిని బలి యీఁ దలంచె మదిఁ గ్రన్నన రణదేవతకుం బ్రియంబు గన్.

రావణుఁడు:—ఏమీ! రాముఁడు నన్ను బలియిచ్చునా? ఇదె వానిని వానిసోదర్యుని సపరివారముగ నొక్కుమ్మడి నారణదేవతకు నేన బలియిచ్చెదను. దురాత్మా! ఇవియా నీహితవాక్యములు. రాక్షసులారా! ఈ చెనఁటిక్రోఁతిపురువును బట్టి చంపుఁడు. (అంత నలువురురక్కసు లంగదుఁ బట్టికొందురు. అంగదుఁడు "దుష్టులారా! ఇదే చచ్చితి"రని మూల కొక్కనిఁ దన్నిత్రోసి మీఁదికి లంఘించి ప్రాసాదశిఖరముఁ గూలఁ దన్నును. రావణాదులు భయమున దిక్కు తెలియఁగక పరువు లిడుదురు.)

[యవనిక పడును.]



[చతుర్థస్థలకము.]

[ప్రదేశము: సువేలాద్రిని శ్రీరామునివిడిదల]

[శ్రీరాముఁడు, లక్ష్మణుఁడు, విభీషణుఁడు, జాంబవంతుఁడు, హనుమంతుఁడు, సుగ్రీవుఁడు, అంగదుఁడు మున్నగువారు ప్రవేశించుచున్నారు.]

శ్రీరాముఁడు:—సుగ్రీవా! నా కేమో యుద్ధమున మనస్సు చొరకున్నది. బహుజనవధ మొనరించుటకు నాకు మనసు గొలుపకున్నది. పావన మయినయాబ్రహ్మవంశమునఁ బొడమి త్రిలోకవిజయి యని పేరొందిన యారావణునిఁ జంప నామది యేటికో సమ్మతింప కున్నది.

సుగ్రీవుఁడు:—దేవా! నీయుదారబుద్ధి యెంతయు మెచ్చికొనఁ దగినది. కాని యాదురాత్ముఁ డెల్లవారికిని వధ్యుఁడయి యుండ నీ కేల యవధ్యుఁడయ్యెను? నీయానతిమెయిని వానరసైన్యముఁ గూర్చితిని. సముద్రము దాఁటి యీసువేలాద్రికి వచ్చితిమి. ఈ విభీషణసాహాయ్యమును మనకుఁ గలిగెను. ఇంక నిష్ప్రయోజనచింత యేల. ఆదుష్టునకు మంచివిధమునఁ జెప్పి పంపితిమి. వినఁడయ్యె. హితమును గనఁడయ్యె. మంచితెరువునఁ జనఁడయ్యె. ఇంక నాతనిఁ జంప నేల విచారింతువు. యుద్ధమున కొజ్ఞ యిమ్ము.

శ్రీరాముఁడు:—(చింత నభినయించును.)

లక్ష్మణుఁడు:—దేవా! సూర్యబింబములోన మచ్చ యేర్పడుట మాకు యిగ బహుజనసంక్షయమునకు హేతు వని నీవ చెప్పితివే. నీ విపుడు యుద్ధ మొనరింపక యున్నను నబహుజనక్షయము కాక మానునా? జగదేకమాత యగు జానకీదేవిని ముచ్చిలించికొనిపోయిన యానికృష్టునిఁ జంప విచార మేటికి?

హనుమంతుఁడు:—రామచంద్రా! నాఁ డశోకవనమున నానికృష్టదనుజుఁడు పలికినపలుకు లెల్లఁ జెప్ప వింటివే. మాతల్లి జానకీదేవి నీకుఁ బంపినసందేశ మెల్ల విన్నవించితినే. ఏల చింత చేసెదవు. ఆదుష్టునియెడ నీ కేల యీకారుణ్యము గలిగె?

౪. సురలకు మునులకు నెప్పుడు
పొరయించును హింస పరుల[?]పొలఁతుల బలిమిన్

దొరకొనుఁ జెఱుపఁగ నతనిం
బొరిగొన మదిఁ జింత సేయఁ బోలును దేవా.

శ్రీరాముఁడు:—(నిట్టూర్పు పుచ్చును.)

విభీషణుఁడు:—ఇనకులేశ్వరా! అదుష్టునిదుండగములు విన్న నెట్టివానికిని నాతనిఁ దునుమాడనే మనసగుఁగదా. ఎట్టికీ డాతఁ డాచరింపకున్నఁ బిత్రుసముండగు నన్న యని యైనఁ బాటింపక యతనిని వీడి వచ్చితిని. అతఁ డెప్పుడును నధర్మముత్రోవనే పోవువాఁడు. ధర్మము కాదని యెంత చెప్పినను వినువాఁడు గాఁడు.

ఉ. ధర్మము గాదు చూడఁ బరదారధనాదులఁ గోరు టంచు నే
నర్మిలి విన్నవింపఁగ నహంకృతిఁ గాలను దాఁచెఁ గొల్వునన్
మర్మవిభేదనంబు లగు మాటల నాడుచు నన్ను నట్టి దు
ష్కర్ము వధింప నీగతి విచారము సల్పఁగఁ జన్నె రాఘవా.

ఇంక నే నేమాడినను "జ్ఞాతిశ్ఛేదనలేన కి"మ్మన్నమాట స్థిరపడు నని నే నింతకంటె నేమియుఁ బల్కకుండువాఁడను.

అంగదుఁడు:—దేవా! నీయానతిని నేను రాయబారము నడపఁబోయితినే. ఏమయ్యెను?

ఉ. యుద్ధ మొనర్ప నెంచినరఘూద్వహు మార్గణఁ గాదు నీకు నీ
యుద్ధతి మాని జానకిని నొయ్యన నిమ్మని నేను బల్కు నన్
బద్ధునిఁ జేసి చంపఁ దనవారికిఁ గట్టడ చేసె నయ్యసం
బద్ధునితోడఁ బోర మదిఁ బట్టవ దేల యినాన్వయాగ్రణీ.

నీవు పంపినబంటున కవమతి యొనర్చుట నీకే యొనరించినయట్లగుఁ గదా.

శ్రీరాముఁడు:—అంగదా! అట్లు గాదు. నా కవమతి యొనరించినను నోర్తుఁ గాని నానమ్మినబంటుల కవమతి యొనరించిన, నే నోర్వఁజాలను. వీరియెల్ల రయభీష్టము మెయిఁ జేయువాఁడను. వీరియిచ్ఛయే కొనింతు. సుగ్రీవా! అయిన సంగ్రామమున కుద్యోగము సేయింపుము.

అందఱు:—(సంతోషమున సింహనాదము లొనరించుచు) జయము. శ్రీరామచంద్రునకు జయము శ్రీరామచంద్రునకు జయముఁ అని గంతు లిడుచున్నారు. —యుద్ధభేరి మ్రోఁగును).

యవనిక పడును.

---

శ్రీ

# శ్రీరామ పట్టాభిషేకనాటకము.

## ద్వితీయాంకము.



(ప్రథమస్థలకము.)

[ప్రదేశము: యుద్ధరంగము.]

[ఇంద్రజిత్తు సంగరోచితవేషమునఁ బ్రవేశించుచున్నాఁడు.]

ఇంద్రజిత్తు:—అక్కటా! నేఁ డేమి దుర్దినము! దేవదానవుల కైనఁ జీరికిఁ గొనని దైత్యవీరాగ్రణులైన రథికవర్యులు హీనవానరాధములచేత యుద్ధరంగమునఁ జచ్చిరి. వానరులతోడి ప్రథమదివస యుద్ధముననే దైత్యశ్రేష్ఠుల కింతటి పరాభవము ఘటిల్లెనే! భయ మన్న నెట్టిదో కలనైన నెఱుఁగని నిశాటవీరులు వనాటకీటంబులం గాంచి వెఱచునట్టి కాలం బాసన్నం బయ్యెఁగా! ఔరా! ప్రచండవీర్యమున గండుమిగిలినదశకంఠసార్వభౌమునిదళంబునకా దళమగు కళవళము దలముకొనుట! అక్కటా! నా కింతయుఁ జింత గలిగె! దిక్పాలకాధీశ్వరుఁడును సర్వగీర్వాణాధిపతియును పాకబలజంభాదిరాక్షసాంతకుఁడును నైన మహేంద్రుని రణరంగమున నోర్చి చెఱపట్టిననాఁడును నా కిట్టి బెట్టిదంపుఁజింత పుట్ట దయ్యె. ఆహా! ఆరామలక్ష్మణహతకు లెందును గానరాకున్నారు గదా. వారికై కాదె నేఁ డీరాక్షసనాశం బౌనదె. అక్కటా! జంబుమాలీ! సర్వగీర్వాణచక్రంబు నవక్రవిక్రమంబున నాక్రమింపఁ జాలిన నీయట్టివాఁడు హనుమ యను చెనఁటివనాటుని పిడికిటిపోటునకే కెడయ నయ్యెనా. హా! మిత్రఘ్నా! నిన్ను విభీషణుఁడు పొలివుచ్చెనా. అక్కటా నేఁడు సుమా విభీషణుఁ డరివిభీషణుం డయ్యె. వజ్రముష్టీ! హా! విధి నేమనువాఁడ. మైందుఁడు నిన్ను మ్రందింపఁ జాలెనే. అన్వర్థనాముఁడ వగు నీముష్టివజ్రము నేఁడు మైందశైలమును విఱువఁజాలక పోయెనా! హా! తపనా! గజుఁ డనుకేతువు నిన్ను మ్రింగివైచెనా. ప్రఘసా! సుగ్రీవునిఁ భగ్నగ్రీవుని జేయక నీవ యాతనిచేఁ దల దునుమఁబడితివా! ఔరా కాలమహిమ. దుర్విధిపరిపాకము. ఏమిది! ప్రతపనునియనుచరుఁడు రక్తనాసుఁ డిట్లు పరు విడుచువచ్చుచున్నాఁడు.

[రక్తనాసుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

రక్తనాసుఁడు:—(ఇంద్రజిత్తును జూచి) దేవా! నలుఁడు—నలుఁడు ప్ర—ప్ర—ప్రతపనునిఁ జంపెను. (పరువెత్తుచున్నాఁడు.)

ఇంద్రజిత్తు.—ఆహా! నేఁ డేమి యెల్లెడల నిట్టిదుర్వార్తలే కర్ణగోచరము లగుచున్నవి! ప్రతపనా! వైరిని బ్రతపింపఁజేయక వైరిచేత నీవే యంత మొందితివే! నీబలముకలిమి నెంతయు నచ్చియుంటినే. ఔరా! నలాధమా! నీవ కావా యీరాక్షసనాశమునకుఁ గారణమవు. నీవు గట్టిన యా

సేతువు సాహాయ్య మొనరుటఁజేసి కదా యీరామహతకుఁడు వానరానీకంబుతోడ సముద్రము దాఁటి వచ్చి మమ్ముఁ దాఁకఁజాలినవాఁడు. ఉండుము. నీపని తీర్చెదను.

(కోపమున నిష్క్రమించును.)

[అంగదసుషేణులు ప్రవేశించుచున్నారు.]

అంగదుఁడు.—సుషేణా! నీ విపుడు విద్యున్మాలితోఁ బోరాడుచుండినపుడు నేను శ్రీరామదేవునకు బాసటగఁ బోయియుంటిని. కావున నీ వావిద్యున్మాలిని జంపిన దెఱుంగను.

సుషేణుఁడు.—ఎవరికి! శ్రీరామదేవునకా? ప్రభువున కెవరితోడఁ బోరాట కలిగెను? దశకంఠుఁడు వచ్చెనా?

అంగదుఁడు:—దశకంఠుఁడు రాఁడాయె. వానియనుచరులు నల్వురు వచ్చిరి. అగ్నికేతుఁడు, రశ్మికేతుఁడు, యజ్ఞదత్తుఁడు, సుప్తఘ్నుఁడు ననునీనల్వురు రాక్షసు లొక్కుమ్మడి శ్రీరామచంద్రునిపైఁ గవిసిరి. వీర లగ్నికణముమీఁదికి ముసరుకొను శలభములకైవడి శ్రీరామచంద్రునిపై ముసరుకొనిరి.

సుషేణుఁడు.—రామచంద్రునకు వారితోడిపోరు భరం బయ్యెనేమో కదా! చాల నలసియుండును.

అంగదుడు.—ఏమీ! ఒక్కముహూర్తకాలమునఁ బదునాల్గువేవురు రాక్షసవీరులఁ జెండాడివైచిన రఘుకులవీరాగ్రణి యగు శ్రీరామదేవున కీముక్కడిసోఁకు లొక్క లెక్కయా! ఒక్కసారిగ నాలుగమ్ములు ధనువునఁ దొడిగి యాదేవుఁ డొక్కుమ్మడి వారిపైఁ బ్రయోగించెను. ఆనాలుగమ్ములును నాలుగు క్రూరోరగములట్లు వెడలి యానలువురు దైత్యాధములప్రాణానిలముల నొక్కపర్యాయముగఁ గ్రోలివైచెను.

సుషేణుఁడు.—అయిన నీక్షుద్రదైత్యులు శ్రీరామునితో మెండొడ్డి యేమి సాధింపఁగలరు?

[అప్పు డధిజ్యధన్వుఁడై యింద్రజిత్తు ప్రవేశించుచున్నాఁడు ]

ఇంద్రజిత్తు.—(కోపమున) ఎవ్వఁడురా యీవనాటాధముఁడు వీరసంభవు లగుదైత్యులను క్షుద్రు లనువాఁడు? దురాత్మా! ఇదె చచ్చితివి.

అంగదుఁడు.— నీవ కావా యాజగద్ద్రోహి యగు రావణుని పెద్దకొడుకవు? ధనుర్విద్యాపండితమ్మన్యా! నిశాటాధమా! దైత్యులు క్షుద్రులు గాకున్న మఱెవ్వరురా క్షుద్రులు? క్షుద్రు లన్నంత మాత్రయే కాదు. ఆతతాయి సంతానములు. దురాత్మా! నీవా మమ్ముఁ జంపువాఁడవు. నిన్న నీయబ్బ కొలువుండిన ప్రాసాదశిఖరము నేను బడఁ దన్నినపుడు నీశూరత్వ మేగుహాయందు డాఁగియుండెను. రమ్ము. నన్ను డీకొనుము. నీశౌర్యమునకుఁ దోడు నీవు వానరవీరవరేణ్యుల నెక్కసక్కెము లాడుటయునా!

ఇంద్రజిత్తు.—ఓరీ! కులద్రోహీ! నీపితృహంత యగు నారామునితోఁ బ్రతిఘటించి పోరి పొలియించి పితృఋణ మీఁగుటకు మాఱుగ నారామునిపాదసేవకుఁడవైన నీవును నొకధీరునివలె మమ్మధిక్షేపించుటయా!

ఉ. ఏర వనాట! తండ్రిఁ బొలియించినక్రూరునిఁ జంపలేక నీ
ధీరత మాలి రాఘవుని "దేవ! ప్రభూత్తమ!" యంచుఁ బాదముల్
చేరి యడంగుకూరుఁడవు సీ యిసుమంతయు సిగ్గు లేక నీ
వూరక ప్రేలినం జనునె యుద్ధ మొనర్పఁగ వచ్చుచోటులన్.

అంగదుఁడు:—ఏమీ!

ఉ. ఏర నిశాచరాధమ! యహీనపరాక్రమశాలి రాముఁ డే
వారికినే శరణ్యుఁ డగు వాలి యొనర్చిన దుండగంబులం
గూరిన కోపవేగమునఁ గూలిచె నాతని దొంగరావణుం
జేరి వధించు నిప్పు డిట సీతను వేకొని పోవుఁ జూడు రా.

ఇంద్రజిత్తు:—ఓహో! బెదరింపఁ జూచెదవే. ఓరీ! నికృష్టపుఁగ్రోఁతీ! మీరామలక్ష్మణులను మిమ్మును నొక్కటఁ గాలఁ బెట్టి నేలఁ జమరెదను. ఊరక పగ్గలు ప్రేలకుము.

అంగదుఁడు:—ఓరీ! హీనదానవాధమా! ఏల యూరక కారులు కూసెదవు. శ్రీరామచంద్రుని జెనక నెంచుట సామాన్యకార్యము గాదు. కేసరివిక్రముఁ డగు నాకోదండగురునితోడ నీవు మార్కొన నెంచుట మత్తేభ మొకటితో నున్న సింగమును రేఁపుటవంటిది. ఊరక చావకుము. విభీషణరాజేంద్రునివలె మారామభద్రుని శరణు సొరుము.

ఇంద్రజిత్తు:—రామునిప్రాఁపు చేసుటకు నే నావనాటాధముఁడగు సుగ్రీవుఁడను గాను. నిశాటాధముఁ డగు విభీషణుఁడను గాను. ఇదే మి మ్మెల్లరఁ బొలియించి మాయయ్య యగు రావణేశ్వరునకు సంప్రీతి సంధింతును. ఆరామలక్ష్మణపాతకు లెం దున్నవారో చెప్పుఁడు. మిమ్ము విడిచి పుచ్చెదను. ఊరక చావకుఁడు.

అంగదుఁడు:—మారామలక్ష్మణులు నీయట్టి దొంగలవలె డాఁగియుండకున్నారు. రణయజ్ఞంబున రాక్షసపశువిశసన మొనరింప బద్ధకంకణులయి రణసీమ నలంకరించియున్నారు. వారితేజములే వారిని జూపుచుండ వారి నొరులు చూపనేల! నిక్కము! నిక్కము! నీవు వారిని గనఁజాలవు. వారితేజములు సదాచారుల కపారముదావహంబులును, దోషాచరుల కపారభయావహంబులునై యొప్పుచుండును. కావున నీవు వారినిఁ జూడఁ జాలవు.

సుషేణుఁడు:—వారే వచ్చుచున్నారు. చూడుడు శౌర్యగాంభీర్యములు రూపములు దాల్చివచ్చినట్లు సుగుణనిధులగు మారామలక్ష్మణులు.

[అప్పుడు రామలక్ష్మణులు సజ్యచాపులై ప్రవేశింతురు.]

ఇనకులేశ్వరులారా! వీఁడు రావణునికొడుకు మేఘనాదుఁ డనువాఁడు.

అంగదుఁడు:—దేవా! మే మిప్పుడు వీనిని బిలుకుమాలుపఁ బూనియున్నవారము. మా కానతిమ్ము.

శ్రీరాముఁడు:—అంగదా! ఈతఁడు వీరుఁడుగఁ బొడగట్టుచున్నాఁడు. దయనీయుండుగ నగపడు నీతనియెడఁ బరుసములు చూపకుము. ఊరక పోనిమ్ము.

ఇంద్రజిత్తు:—ఓరీ! శూరంమన్యా! సర్వగీర్వాణతమోర్కుఁడు ను బూర్వగీర్వాణసార్వభౌముఁడు ను నగు రావణేశ్వరునకుఁ బుత్రుండనై యల్లమహేంద్రుఁ జెఱపట్టి యింద్రజిత్తను మేటిపొగడ్త గాంచిన నన్ను నీవా దయచూచువాఁడవు. ఇదె మిమ్మెల్లర నేకాహుతిగ వైశ్వానరున కొల్లకుమ్మడి దిగమ్రింగెదను జూడుము.

సుషేణుఁడు:—రాక్షసాధమా! శ్రీరామచంద్రునితోడనే పరుసములాడఁ జొచ్చితివా. చత్తువు సుమా.

లక్ష్మణుఁడు:—సుషేణా! నీ వేటి కూరక వాని కితవు గఱపెదవు. వాఁడు వినువాఁడు గాఁడు. సాధువరు లగు దిక్పాలకుల జయించితి నని వీనియయ్యయు సాధువరేణ్యుఁ డగు నింద్రుని జయించితి నని వీఁడు ను మిక్కిలి గర్వోక్తులు పల్కుచుందురు. వారి నయినను వీరు ధర్మయుద్ధమునఁ గాక మాయఁ బూని జయించి యుండుట వారి యొక జయము గాదు—ఓరీ! చోరచక్రవర్తిపుత్రా! నాయెదుట నీజల్పములు సాగవు సుమా.

ఇంద్రజిత్తు:—డింభకా! ఈయింద్రజిత్తుతోడ బింకము లాడకుము. మీ రందఱు ను జేరినను నన్నుఁ గదల్పనైనఁ జాలరు. నే నొక్కఁడను జాలుదు మిమ్మెల్లరను జంపవైవ.

లక్ష్మణుఁడు:—నిన్నుఁ జంప నందఱు కావలయునా? నే నొక్కండనే చాలుదును. (బాణ మెత్తుచున్నాఁడు.)

శ్రీరాముఁడు:—లక్ష్మణా! శాంతింపుము—రావణకుమారా! ఊరక నేల మామీఁదకుఁ గయ్యంబునకుఁ బూనెదరు. మీయయ్యకుఁ జెప్పఁగూడదు గాక. మాజానకిని మా కర్పణముచేసి లంకను మావిభీషణునకు విడిచి మీ రెటకయినఁ బొండు. అట్లు చేయకున్న తిరిగి రాముని శరములు రిత్తలై పోవు. ఊరక నేల మీతోడఁ దక్కినరాక్షసుల సమూహముఁ జంపుకొనఁ జూచెదరు.

ఇంద్రజిత్తు:— ఔరా యేమి యీబింకము. ఈమాత్ర గర్జనము చాలించి మమ్ము దాసోఽహమ్మని వేఁడి పాదములఁ బడితి వేని నీప్రాణములఁ గాచెదము. మేము లంక విడిచిపెట్టి పోవలయును గా. నీకు సీత నీవలయును గా. మమ్ము బెదరింతువా!

ఉ. జానకి నిమ్ము నీకు విను చయ్యన లక్ష్మణు నంపు వీడినం
బ్రాణము దక్కఁ జేసి కతనిఁ బట్టి సభాస్థలి వానిముక్కునుం
వీనులుఁ దచ్చి రంబు నొలికింతుము శూర్పణఖాఖ్యచేత నా
మానిని భంగ మీఁగ ననుమానము లేక యటుల చరింపుమా.

శ్రీరాముఁడు:—చాలింపు మింక నీయుడివీరములు—వానరవీరులారా! ఈరాక్షసునిఁ బోదివికొనుఁడు.

(వానరు లింద్రజిత్తును బోదివికొనుచున్నారు.)

ఇంద్రజిత్తు:—(వానరుల నదల్చుచు) (స్వగతమున) వీరి నెల్లరను మాయఁ బూని వధియింతుఁ గాక. (అని నాట్యమున మాయమగును.) (అప్పు డంతరిక్షమునుండి రామలక్ష్మణులమీఁదను వానరానీకముమీఁదను శరములు కురియును.)

శ్రీరాముఁడు—:ఈతఁడు మాయాంతరితుఁడై యుద్ధము చేయుచున్నవాఁడు—హనూమన్నీలాంగదాది వానరవీరాగ్రణులారా! ఉప్పరంబున కెగసి యీరావణపుత్రుని బంధింపుఁడు. రాత్రి గావున

నీతఁడు చెలరేఁగినాఁడు. రాత్రించరుఁడగునీతనికి రాత్రి యెక్కుడగుకొలఁదిఁ జాతుర్యబల వీర్యంబు లెక్కుడగును. కావున నిప్పుడే వీనినిఁ బట్టి కట్టుఁడు.

(తెరలోనుండి యింద్రజిత్తు.)

ఓరీ! నరాధములారా! మాయఁ బూనిన నన్నెదిరింప శూలాత్ముండైన నోపఁడు రా. ఇంక మీ రన నెంత. మీయాక్రోశము లెంత. మి మ్మిర్వుర నిప్పుడీయుద్ధరంగమునకు బలి యిచ్చి దానవసార్వభౌముని మనఃక్లేశము నుడిపెదఁ గాచికొనుఁడు. తొలుత మిమ్ము నిద్దఱను నాగపాశంబులచే బద్ధులఁ గావించెదఁ జూడుఁడు.

శ్రీరాముఁడు:—తమ్ముఁడా! వింటివా యీనిశాచరునిమాటలు.

లక్ష్మణుఁడు:—దేవా! శబ్దవేధబలిమిని శరములఁ బరఁగించి యీదుష్టునిఁ బరిమార్తును.

(అప్పు డింద్రజిత్ప్రయుక్తము లయిన నాగాస్త్రములు వారి నిరువురను జుట్టుకొనును.)

శ్రీరాముఁడు:—(జనాంతికముగ) లక్ష్మణా! ఈక్రూరుఁడు యుక్తాయుక్తము లెఱుఁగక నాగాస్త్రములను బ్రయోగించి మనలను బంధించినాఁడు.

లక్ష్మణుఁడు:—(జనాంతికముగ) దేవా! భ్రూభంగమాత్రకాలమున సర్వజగత్సంహారము గావింపఁ జాలిన నీవే యీరీతిగఁ జింతింపనగునా? క్షణమున నీరాక్షసలోకదాహం బొనరించెద నానతిమ్ము.

శ్రీరాముఁడు:—(జనాంతికముగ) లక్ష్మణా! భాండ మూరకున్నను భాండములోనిక్షీరము లారయ వలయును. వాఁ డెట్టివాఁడైనను వాఁడు ప్రయోగించినవి మహనీయనాగాస్త్రములు. బ్రహ్మ సన్మానముకొఱకుఁ దద్వరపాలనకార్యము మన కవశ్యముగఁ జేయఁదగినది. కావున మన కిపుడు గౌరవార్థము నాగబంధనసహనమే కర్తవ్యము.

(అంతరిక్షమునుండి యప్పుడు కొన్ని బాణములు వారిపైఁ బడును.)

శ్రీరామలక్ష్మణులు:—హా! (యని పడుదురు)

(వానరులు "హా! రామచంద్రా! హా! లక్ష్మణకుమారా!" యని హాహాకారము లొనరించుచుందురు. అప్పు డింద్రజిత్తు బాణము సంధించినవింటితోఁ బ్రవేశించుచున్నాఁడు. వానరు లతనిని జూచి పరువెత్తుదురు. అతఁడు వారిని గొంతవఱకు వెన్నంటి తఱుమును.)

ఇంద్రజిత్తు:—(సంధించినబాణము వింటినుండి యెత్తి చేతఁ గొని శ్రీరామలక్ష్మణులకడకు మరలి వచ్చి) ఓహో! రాక్షసలోకము నష్టమింపఁ జేయువారా వీరు వీరాగ్రేసరశిఖామణులు. (శరముకొనతో వారిని బొడుచుచు.)

క. వీ రెవ్వరయ్య రఘుకుల,
వీరవరేణ్యులె సురారిశబీకులఁ జంపం
జేరిరె భువిఁ బడవలసెనె,
వీరికి నిటు లహో శరముల కే బీరము లెడలన్.

రాక్షసకులధూమకేతువు లఁట. ఒక్కరక్కసునియుక్కునకు ముక్కుల నూరుపులు దక్కించుకొనఁజాలని యీ బక్కచిక్కిన నరులు మమ్ముఁ జక్కడఁచువార లఁట.

[రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

రావణుఁడు:—ఇంద్రజిత్కుమారా! రామలక్ష్మణు లేరీ?

ఇంద్రజిత్తు:—తండ్రీ! దానవసార్వభౌమా! ఇదే చూడుమా రామలక్ష్మణులు మత్ప్రయుక్తము లగు నాగాస్త్రముల నెట్లు జీవము లెడలి పడియున్నవారలో.

రావణుఁడు:—(చూచి) ఇంద్రజిత్కుమారా! నీవలన నీయాహవాంబునిధి గడచి తీరము ముట్టితిని సుమా. నిన్నుఁ బోలుశూరవరేణ్యు లీ ముల్లోకములందు ను లేరు (అని పుత్రుని నాలింగనము చేసికొనుచున్నాఁడు.)

ఇంద్రజిత్తు:—తండ్రీ! ఇప్పటికి నీమది కుదుటఁ గనెనా?

మ. ఇఁక నిద్రింపుము దేవ గాఢముగ నీ వీరాత్రి నిశ్చింతమైఁ
బ్రకటింపం జను రామలక్ష్మణులఘోరప్రక్రియన్ యుద్ధభూ
మికి నీపుత్రుఁడు గావువెట్టె నని సంప్రీతిన్ జగం బంతటం
బ్రకటారాతిజయంబు గాంచితివి నీభాగ్యంబు సామాన్యమే?

రావణుఁడు:—నీవు సుమా నిక్కంపుఁబుత్రుండవు నాకు! నీవు నాకుఁ బుత్రోత్సాహము ననుదినమిట్లు గల్గించుచు నన్ను నిక్కముగఁ బుత్రవంతు నొనర్చుచున్నవాఁడవు. ఇఁక నా సీత నిటకుఁ బంపి వీరమరణముఁ గాన్పించి లోఁజేసికొన నగును. కుమారా! రమ్ము. అంతకంటె మున్నుగ నీవిజయోత్సవము నిర్వర్తింతము.

(అని యతనిని బిలుచుకొని పోవును.)

[విభీషణ సుగ్రీవ హనుమదంగదాదులు ప్రవేశించుచున్నారు.]

వానరులు:—హా! రామచంద్రా! హా! లక్ష్మణదేవా! మ మ్మెవ్వరి కప్పగించిపోయితిరి. హా! రామచంద్రా! (అని వారిపైఁ బడి యేడ్చుచున్నారు.)

విభీషణుఁడు:—సుగ్రీవా! ఊఱడుము. భయ మొందకుము. మనభాగ్యము మంచి దయ్యెనేని రాజకుమారు లింకొకనేపునకుఁ దెలివి గాంతురు. ధైర్య మూనుము.

సుగ్రీవుఁడు:—విభీషణా! ఏల లేనియాసలు పెట్టెదవు. చూడుము ఎట్లు పడియున్నారో. మృతులైనవీ రెట్లు తెలివిగాంతురు. మనభాగ్యోదయము నేఁడే యస్తమించె.

విభీషణుఁడు:—హరీశ్వరా! అటు చూడుము. నిక్కముగ మృతుల కిట్టి తేజము లుండవు. వీ రిప్పుడు గాఢమూర్ఛావశులయి యున్నారు.

సుగ్రీవుఁడు:—ఏమి మూర్ఛయో యిది. హా! రామచంద్రా!

[అప్పుడంతరిక్షమునఁ బుష్పకముపై నిరువురు రాక్షసాంగనలు పట్టికొనియుండ సీతయును నామెతోడ నిరుగెలంకులఁ ద్రిజటాసరమలును వత్తురు.]

సీత:—(చూచి) హా! ఆర్యపుత్రా! (మూర్ఛిల్లును)

శూర్పణఖ:—దీర్ఘనాసా! సీతను గట్టిగఁ బట్టుకొనవలయును. ఒకవేళ శోకవేగమున నిది యిక్కడి నుండి నేలకు దుముకఁగలుగును. రాక్షసరాజు విమానము నేలకు దిగనీయరాదనియు సీతను నేల నడుగిడనీరాదనియు దూరమునుండియే రామలక్ష్మణులఁ జూపించి త్వరమైఁ దెచ్చికొని రావలయు ననియు నాజ్ఞ చేసియున్నాఁడు.

దీర్ఘనాస:—అట్లు చేయకపోయినయెడల మనలను జంపఁగలఁడు.

సీత:—(తెలివి గని) హా! ఆర్యపుత్రా! వీరాగ్రణి వగు నీవే యిట్లు వాలిసితివే. ఇంక నా కెవ్వరు దిక్కు. హా! రామచంద్రా! నీచుట్టును జేరి విలపించుచుండు వానరబలముల కుత్సాహము గల్గింపక యీపగిదిని బడి యుండ నీకుఁ బాడియగునే—హా! సీతా! నిన్ను గుఱించి మున్నాడఁ బడుచుండిన యాశుభవాక్యము లెల్లఁ గల్ల లయ్యెనా! హా! హతవిధీ!

సీ. సాముద్రికులు చూచి ꠰ జానకి మాంగల్య
భంగ మొందదఁటంచుఁ ꠰ బలికినారు
మాహూర్తికులు సీత ꠰ మంగళాత్మిక యయి
వఱలు నఁటంచును ꠰ బలికినారు
శిష్టులు జానకి ꠰ చిరవీరపత్నియై
యలరుచుండు నఁటంచుఁ ꠰ బలికినారు
జ్యోతిషికులు వీర ꠰ మాతయై యీసీత
వెలయు నెంతయు నని ꠰ పలికినారు

ఆ. గీ. అకట రామచంద్ర ꠰ యనిలోన నీ విల్లు
హతుఁడ వగుటకతన ꠰ నాపలుకులు
కల్ల లయ్యె వార ꠰ లెల్లరుఁ గల్లరు
లయిరి శక్రజిత్తు ꠰ నంపగముల.

త్రిజట:—జానకీ! ఊరక కలఁగి దుఃఖించెదవు. అదే చూడుమా రామలక్ష్మణు లెట్లున్నవారో! నాగశయనము ను నాగభూషణములు ను గలిగిన హరిహరులు సుఖనిద్రఁ జెందియుండునట్లు తమ కాంతులు పిడికి నాగాస్త్రపాశమ్ముల సొమ్మసిల్లియున్నవారు. నీ వూరక యమంగళము శంకింపకుము.

సీత:—త్రిజటా! నాకేమో ధైర్యము గలుగదు.—ఏదీ నన్ను విడువుఁడే! నన్నొక్కసారి మాయార్యపుత్రుని నెమ్మోముఁ జెమ్మి చేరి చూడ నిండు.

శూర్పణఖ:—చాలునే నీవు చూచినది.—పుష్పకవిమానమా! ఇంక మరల నశోకవనమునకుఁ బొమ్ము. (విమాన మెగసి పోవును.)

హనుమంతుఁడు:—హా! రామదేవా! తుదకు నీ కింత గతి పట్టెనా !

సుగ్రీవుఁడు:—హా! దశరథరాజనందనులారా !

విభీషణుఁడు:—సుగ్రీవా! నీవే యిట్లు దుఃఖించుచుండిన నెట్లు? చూడుము శ్రీరామచంద్రుఁ డించించుక తెలివి గనుచున్నాఁడు. బలముల కుత్సాహము గల్గింపుము.

సుగ్రీవుఁడు:—(చూచి) వానరులారా! ఊఱడిల్లుఁ డూఱడిల్లుఁడు. రాజకుమారులు తెలివి గనుచున్నారు.

శ్రీరాముఁడు:—(తెలివి గని లక్ష్మణునిఁ జూచి) హా! లక్ష్మణా! నాచేత నీ కెట్టి కీడు మూఁడెను—సుమిత్రాదేవి! నీయనుంగుఁబట్టిని నాముద్దులతమ్ముఁగుఱ్ఱను గోల్పోయితిని హా! లక్ష్మణా!

విభీషణుఁడు:—రామచంద్రా! ఊరక యీచింత యేల? లక్ష్మణకుమారుఁ డిప్పుడే తెలివి గనఁగలఁడు. చింతింపకుము.

శ్రీరాముఁడు:—విభీషణా! చూడు మెట్లు పడియున్నాఁడో !

ఆ. వె. భార్య లెల్లయెడలఁ । బడయంగఁ బడుచుంద్రు
బంధు లెల్లయెడలఁ । బరఁగుచుంద్రు
కూడఁ బుట్టి తోడు । నీడగాఁ జరియించు
తమ్ముఁ డెబ్బుసీమ । తనర డెందు.

విభీషణా! నాతమ్ముని వీడి నే నింక మనఁజాలను.

తే. గీ. రక్కసుల కెల్లరకు నిన్ను । రాజొనర్తు
నంచు నీతోడ నేను ము । న్నన్నమాట
కల్ల యయ్యెను దండ్రి నీ । యుల్లమందుఁ
దలఁప కీఁక నన్ను । క్షమియించి తరలిపొమ్ము.

సుగ్రీవా !

చ. హనుమను బంచి జానకిని । నారయఁ జేసి వనాటసైన్యముల్
ఘనముగఁ గూర్చి సేతువును । గట్టిగ వారిధిపై ఘటించి పా
యనియనురక్తిఁ జూపితి ప్ర । యాసము నొందితి వయ్య మాకతం
బునను జెలీ యభాగ్యుఁడగు । పూరుషుఁ జేరు నొకో సిరుల్మహిన్.

మీ రెల్లరు నాకై పడినప్రయాసమంతయు నాదౌర్భాగ్యమునఁ జవుటఁ బెట్టినబీజ మట్లు ఫలవంతము గాదయ్యె. ఏమి చేయుదును! నాకపఖ్యాతి యిట్లుండ. సూర్యనందనా! ఇంక నీవానరానీకము సంతసముఁ గొని నీవు కిష్కింధకుఁ జని సుఖ ముండుము—సుగ్రీవవిభీషణాగులారా! నాగపాశములు దృఢముగ నన్ను బంధించియుండుటచేత మిమ్మాలింగనము చేసికొనుటకైనఁ గాకున్నది. ఇదే మీ కెల్లరకు నాకడసారిమ్రొక్కు (అని తలవాంచి యుత్త్రి) అన్నలారా! ఇంక నిల్వకుఁడు. ఈయభాగ్యు నిటనే విడిచి చనుఁడు. చింత నొందకుఁడు. పొండు. ఇట నిలువకుఁ డింక.

అందఱు: — హా! రామచంద్రా! (దుఃఖింతురు.)

[అప్పుడు శీఘ్రగమనమున వాయుదేవుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వాయుదేవుఁడు: — రాఘవేశ్వరా! ఇఁక యేల యూరక కేవలనరునివలెఁ నీవు చింతించెదవు? దుష్టశిక్షణంబును శిష్టరక్షణంబును నొనరింప దశరథరాజన్యునివలనఁ గౌసల్యాగర్భమున లీల నరరూపంబున నవతరించిన యాదినారాయణుండవు నీవు. నీ మాహాత్మ్యమం దించుకంత నిన్ను నీవ స్మరించి చూచుకొనుము. నీ కెంతయుఁ బ్రీతికరం బగు వాహనంబుగ నొప్పు గరుత్మంతునిఁ దలంచికొనుము. అతఁడు వచ్చె నేని మీ నాగపాశములు తెగిపోవఁగలవు.

శ్రీరాముఁడు: — తండ్రీ! ఇంత హితము నవ్యాజప్రేమమున మాకుఁ గూర్చుచుండు నీ వేదేవతవో యెఱుఁగను.

వాయుదేవుఁడు: — దేవహితము గూర్ప నీకడ కరుదెంచిన వాయుదేవుఁడ నార్యా యేను. అది యుండనిమ్ము. ఆ గరుడునిఁ దలంచికొనుము.

శ్రీరాముఁడు: — తండ్రీ! మహాబలదేవా! నీ యానతి నట్లే చేసెదను.

ఆ. వె. మాతృసేవ చేసి । మాతృదాస్యముఁ బాపు
మాననీయుఁడైన । మహితుఁ డీవు
వజ్రివజ్రమునకుఁ । బక్షంపు టీఁకను
నిచ్చినట్టి గరుడ! । యేలు మమ్ము.

[గరుత్మంతుఁ డేతెంచును. నాగములు విడి పాఱిపోవును. గరుడుఁడు రామలక్ష్మణుల శరీరములు నిమురును. వారు లేచి కూర్చుండుదురు. వానరు లుత్సాహమున "జయము! శ్రీరామచంద్రునకుఁ జయ" మని యెలుఁగు లెత్తుదురు.]

శ్రీరాముఁడు: — వత్సా! లక్ష్మణా! ఈ మహానీయులను బ్రణుతింపుము. వీరే గరుడ వాయుదేవులు. వీరిదయవలన మనము పునర్జీవుల మయితిమి.

(అని లక్ష్మణునితో వారికి మ్రొక్కును.)

గరుడుఁడు: — శ్రీరామదేవా! భవద్భృత్యుఁడ నగు నన్నేల ప్రస్తుతి చేసెదవు?

వాయుదేవుఁడు: — దేవా! భవత్తేజస్సముద్రమున నేము కిరణములము గాము. రణమున వైరిపంక్తి కంఠదళన మొనర్చి దేవహితము సాధింపఁ బ్రోవుము గాక.

అందఱు: — తథాస్తు (ఆశీర్వదింతురు.)

[యవనిక పడును]



## ద్వితీయస్థలకము.

[ప్రదేశము: యుద్ధరంగము.]

[రావణుఁడు తిరస్కరిణి వహించును. రంభానలకూబరులు విమానమునను ప్రవేశించుచున్నారు.]

రావణుఁడు:—నేఁటి కొలునాళ్లయ్యె యుద్ధ మారంభమయి. ఇంతదనుక వానరులలోఁ జేయఁగల వాఁ డొక్కఁడైనఁ బావకయున్నాఁడు. రామలక్ష్మణులు కడుపులోపలిచల్లయైనఁ గదలక చెక్కుచెదరక యున్నారు. అక్కటా! వాసవజిత్ప్రియుత్రము లగునాగాస్త్రములు వారిని జంపివైవఁజాలక యూరక కట్టివైచెను. నాఁడు మాయింద్రజిత్తు సర్పపాశబద్ధులై మూర్ఛితులై యున్నవారిని నాకుఁ జూపినయప్పు డెంతయో సంతసించితి నే—ఆహా! నాఁ డారామలక్ష్మణులు ప్రాణంబులతోడనే యుండినది యించుకంత తెలిసియుండెనా నాఁడే యందందఱూపాదమస్తకముగ వారియంగము లెల్లఁ జితుకఁగొట్టియుండనా, హా! తప్పెఁ దప్పె. ఇట్లు కానుండ నది యట్లేల యగును. ఇంద్రజిత్కుమారుఁడును వారు చచ్చిరనియే యెంచెను. తోడునీడగఁ గూడి తిరుగుచు సహధర్మచారిణియై వెలసిన సీతయే వారు మృతి నొందిరనుకొననింక నితరుల నేమనవలయు.—హా! ధూమ్రాక్షాకంపనుల నాహనుమంతునివాత వైచియుండను గదా! వజ్రదంష్ట్రా! నీవే రనిన సర్వగీర్వాణులకును గుండెగాలముగదా. అట్టి నీవు చెనఁటి యంగదునిచేఁ బడితివా! ఏ మనఁ గలవాఁడను అక్కటా! ప్రహస్తా! నీయట్టి సేనాని నాకెన్నఁ డొదవఁగలఁడు. నీయట్టియపారబుద్ధిమంతు నెందుఁ బడయఁగలవాఁడను. హా! నీ పాలిటికి నీలుఁడే కాలుఁ డాయెనా! నే నేటి కూరక చింతిల్లవలయు. ఇదె పోయి యొక్కమాత్ర నారామలక్ష్మణులఁ జెండివైచెదను. ఆజానకిని బలవంతమున నాకు రాణినిగాఁ జేసికొనియెదను. మర్కటముల నెల్ల మడియించెదను

(నిష్క్రమించును)

రంభ:—యక్షరాజకుమారా! ఇంకను నీఖలుఁడు జానకీమహాదేవిని బలవంతమున రాణినిగాఁ జేసికొనఁ జూచుచున్నాఁడు.

నలకూబరుఁడు:—అ దేటి కింకను సని యనియెదవు.

రంభ:—నీ వీతని కిచ్చియుండుశాప మమోఘము గదా. వీఁ డెట్లు లింక నకార్య మాచరింపఁగలఁడు.

నలకూబరుఁడు.—రంభా! వీఁడు నీయెడ నాచరించినయావమతి యిప్పుడు జ్ఞప్తికి వచ్చెనా నీకు.

రంభ:—ఈఖలునివినాశము కన్నారఁ గాంచి కాని లోలోన రవుల్కొనుచుండు నీపరిభవానలము చల్లారదు. అది కావునఁగదా నిన్ను వేఁడి యిక్కడి కీ తిరస్కరిణిఁ బూని వచ్చినది.

నలకూబరుఁడు:—చెలీ! నీకోరిక దీర్చుటే కదా నావ్రతము. ఈతిరస్కరిణిలో మనల దేవదానవులకును జూడరాదు.

రంభ:—నలకూబరా! నలకూబరా! అటు చూడు మాదుష్టుఁడు లక్ష్మణునితోఁ బోరాడుచున్నాఁడు.

(తెరలో లక్ష్మణుఁడు)

దురాత్మా! రమ్ము రమ్ము. ఇంక నీపరసతీపరిగ్రహబుద్ధికిఁ దగినఫలం బనుభవింతువుగాక.

తే. గీ. అన్నను న్నన్ను నాఁడట్లు కన్ను మొఱఁగి
జానకీదేవి ముచ్చిలి చన్నయట్టి
పాపఫల మిప్పు డనుభవింపంగవలయు
రమ్ము రమ్ము దురాత్మక! రమ్ము రమ్ము.

నలకూబరుఁడు:—వింటివా లక్ష్మణునివాక్యములు. అదె చూడు మారాక్షసు నెట్లు లక్ష్మణుఁడు బాణములఁ బొదివెనో.

రంభ:—పాప మారావణుఁడు నీకుఁ బినతండ్రి గాఁడా? పొమ్ము పొమ్ము. పోయి సాయపడుము.

నలకూబరుఁడు:—నేఁ జేసినసాయ మింకను నీకుఁ జాలినట్లుగ నుండలేదే.

రంభ:—పాపము! శాప మిం కేదేని వాని కిమ్ము. (నవ్వును.)

నలకూబరుఁడు:—ఆహా! నికృష్టుఁడు లక్ష్మణుపై శక్తి వయిచి మూర్ఛిలఁజేసెను. రమ్ము రమ్ము పోద మక్కడకు. [నిష్క్రమింతురు]

[వెనుక యవనిక నెత్తినంతనే లక్ష్మణుఁడు మూర్ఛిల్లియుండ నాతనిపజ్జ రావణుఁ డాతనిఁ జూచి చూచి యచ్చెరు వందుచుండును.]

రావణుఁడు:—ఆహా! ఈలక్ష్మణునితేజము నే మనఁగలవాఁడ! వీని నెత్తికొనిపోయి లంకలో నాసౌధంబున నిడికొందునుగాక.

[అని లక్ష్మణు నెత్తఁబోవ నాతఁ డించుకయుఁ గదలకుండును.]

[యథాపూర్వముగ రంభానలకూబరులు ప్రవేశించుచున్నారు.]

రావణుఁడు:—ఆహా! ఏమాశ్చర్యమిది! పార్వతీపరమేశ్వరులతోడను బ్రమథగణంబులతోడను నొప్పు కైలాసపర్వత మట్టిదాని నెత్తిన నాబాహువులు నేఁ డేమి సత్త్వహీనము లాయెనా? (మరల మరల యత్నించి విఫలమనోరథుఁ డగును.

[అప్పుడు పకుగున హనుమంతుఁడు ప్రవేశించును.]

హనుమ:—దురాత్మా! ఇదే చచ్చితివి (రావణునెదపై గ్రుద్దును.)

రావణుఁడు:—హా! (అని మూర్ఛిల్లును)

హనుమ:—చావుము దురాత్మా! (లక్ష్మణునివంకకుఁ దిరిగి) ఆహా! లక్ష్మణదేవుఁ డీదురాత్మునిక్రూరశరంబులఁ జిక్కి సొమ్మసిల్లి మూర్ఛిల్లియున్నాఁడు. ఈరావణుఁ డీ నారాయణాంశము నెత్తికొని పో నెంచినట్లున్నది.

రావణుఁడు:—(మూర్ఛనుండి లేచుచు) హనుమంతా! నీముష్టిబలువు నుతియింపఁ దగినది సుమా! దిక్పాలవరులక్రూరతరాస్త్రంబులును నైరావతముకొమ్ములఁ గోరాటయు నింత బెట్టిదములుగావు.

హనుమ:—ఏమైన నేమి? నాముష్టి నిన్నుఁ జంపదాయెఁగదా! కావుననే నాకుఁ జింత యయ్యె. ఇదె మాలక్ష్మణదేవు నన్నకడ నిడివచ్చి నీపని తీర్చెద నుండుము.

రావణుఁడు:—హనుమంతా! వశముగాని ప్రయత్న మేల చేసెదవు? కైలాస మట్టిపర్వతమును బంతి కైవడి నెగఁజిమ్మి యాడిన నాకే యతని నెత్త నలవి గాదయ్యె. ఇంక నీ కన నెంత? మర్కట చాపలము మానుము.

హనుమ:— ఓరీ రావణా! కైలాసము గాదు గదా. కులాచలముల నన్నింటి నెత్తఁ గలిగినను నీయట్టిదుష్టునకు భక్తజనసులభుం డగు నారాయణునియంశమేయైన యీలక్ష్మణదేవుఁ గదలింపనైనఁ గాకుండును. మూఢా! నీ యహంభావ మింకను బోదు గదా.

ఉత్సాహ. రామ రామ రామ రామ రామ రామ రాఘవా
రామ రామ రామ రామ రామ రామ మాధవా,
రామ రామ రామ రామ రామ రామ కేశవా
రామ రామ రామ రామ రామ రామ రాఘవా.

[అని లక్ష్మణు నెత్తుకొని పోవుచున్నాఁడు.]

రావణుఁడు:—(ఆశ్చర్య మభినయించి) ఆహా యేమి యీ వింత! హనుమద్బాహుయుగళ మస్మద్బాహువింశతికంటె బలవత్తరమా! కాక హనుమంతుఁ డాడినపలుకులే నిక్కము లగునా! ఏ మాశ్చర్య మిది!- వాఁడే శ్రీరాముఁడు తమ్మునిభంగపాటునకుఁ గోపించి నామీఁదకు వచ్చుచున్నాఁడు. ఇతని మార్కొందుఁ గాక. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

నలకూబరుఁడు:— రంభా! చూచితివా? నిన్నుఁ బరిభవించిన యాఖలుఁ డెట్లు లాంజనేయుని పిడికిటిపోటునకు నేలఁ బడెనో రంభా! అదే వాఁడు వాఁడు మాతఁడు రామచంద్రుని వ్రేటుల సొమ్మసిల్లుచున్నాఁడు.

(తెరలో శ్రీరాముఁడు.)

రావణా! నేఁ డింకఁ జాలును. చాల నలసితివి. నేఁ డేగి విశ్రమించి యీరాత్రి పుచ్చి రేపు వచ్చి నాచేతిబలు వెల్లఁ జూతువు కాని పొమ్ము.

నలకూబరుఁడు:—ప్రేయసీ! వింటివా రామదేవుని యుదారోక్తులు.

రంభ:—దయామయుఁడు సుమా శ్రీరామదేవుఁడు.—ఆహా! అపంద మగలిపోవుచున్నాఁడు. రమ్ము రమ్ము. మనలక్ష్మణుఁ డెట్లు లున్నాఁడో యరయుదము.

నలకూబరుఁడు:—పోదము రమ్ము. వాఁడే లక్ష్మణుఁడు లేచి కూరుచుండి కపినాయకునితో నేమో మాటలాడుచున్నాఁడు. శ్రీరామభద్రుఁడును నటకే పోవుచున్నాఁడు. రమ్ము మనమును బోవుదము.

(నిష్క్రమింతురు.)



# ద్వితీయాంకము.

## తృతీయస్థలకము.

[ప్రదేశము: కుంభకర్ణునిశయనమందిరము.]

(కుంభకర్ణుఁడు, యూపాక్షాదిరాక్షసులు ప్రవేశించుచున్నారు.)

కుంభకర్ణుఁడు:—యూపాక్షా! నన్నారక యేల నిద్రలేపితిరి. దానవలోకచక్రవర్తియగు మాయన్న పఙ్క్తికంధరునకు సుఖమే కదా. మీ మొగములు చూడ నేదియో బెట్టిదంపుటెడ రడరిన యట్లు స్ఫురించుచున్నది. అట్లు గాకున్నఁ బనిలేనిపనిగ మాయన్న నాకు నిద్రాభంగము ఘటియింపఁజేయునా. చెప్పుఁ డిప్పు డీ ముప్పెవ్వనివలన నాయెనో.

చ. పఱపెద నింద్రు ఘోరముగఁ § బావకు మ్రింగెద భాస్కరాత్మజుం
గొఱికెద మస్తకం బసురుఁ § గూల్చెద వేల్మిడిఁ బాశిఁ ద్రుంచెదం
జెఱిచెద గాడ్పుప్రాణములఁ § జీల్చెద యక్షుఁ బినాకిఁ గొట్టెదన్
మఱి యెఱిఁగింపుఁ డెవ్వలన § మార్కొనఁగాఁ దగు నాకు నిత్తఱిన్.

యూపాక్షుఁడు:—(అంజలి ఘటించి) దేవా! సురాసురయక్షకోటి కెన్నఁడును యుద్ధమున భీతిల్లని మాకు నేఁడు చెనంటినరవానరులకారణమునఁ జనుభయ మావహిల్లినది. నాఁడు హనుమంతుం డనువానరుఁ డొక్కఁ డేతెంచి దానవసార్వభౌముఁడు మోహంబునఁ దెచ్చికొనిన రామపత్ని యగు సీత నిడిన యశోకవనం బెల్లఁ బాడుచేసి పెక్కుర రక్కసుల నొక్కుమ్మడిగ నుక్కుమిగిలి చక్కడంచినది దేవర యెఱింగియే యున్నవారు.

కుంభకర్ణుఁడు:—అవును. మున్న నేను నిద్ర మేల్కని వచ్చియుండిననాఁ డాస్థానమున నివి యెల్ల వింటిని. మఱి యిప్పుడేమి వచ్చెను. ఇప్పు డారాముఁడు సముద్రము నీఁదికొని లంకకు వచ్చి మిమ్ముఁ గుదిముట్టింపఁ బూనెనా యేమి?

యూపాక్షుఁడు:—ఈఁదికాదు దేవా! ఇంతవఱ కెవ్వరును గనియును వినియును నుండని యాశ్చర్యవిధ నంబుధిపై సేతువు గట్టి వానరబలములతో వచ్చి లంకను ముట్టడించి యారాముఁ డిపుడు మన రాక్షసులతోఁ బోరాడుచున్నాఁడు. దేవా! యాతనిగోశ్చండిమ మే మన వచ్చును. దేవదానవవరులచేతను నిట్టిగట్టిభయము మాకుఁ గలిగియుండలేదు. వాఁడును వానితో వచ్చినయాక్రోఁతులును నెంతటి దిట్టలో తెలియరాదు. వీరివలన నగు భయ మింతింతని చెప్ప వలను గాకున్నది.

కుంభకర్ణుఁడు:—అయిన నింతవఱకును మీ రెవ్వరును వారిని గొట్టఁజాలకయే యున్నవారలా?

యూపాక్షుఁడు:—దేవా! అది యేల యడిగెదవు. వారితో డీకొని మనవజ్రదంష్ట్రుఁడును విరూపాక్షుండును నకంపనుండును బ్రహస్తుండును యుద్ధమునఁ జచ్చిరి.

కుంభకర్ణుఁడు:—ఏమీ! సేనాపతి ప్రహస్తుండును జచ్చెనా!

యూపాక్షుఁడు:—అక్కటా! ప్రహస్తుని దేమిలెక్క! నిన్న మనదానవచక్రవర్తి యారామునితోఁ యుద్ధ మొనరించి ప్రాణసంశయదశయం దతనివలన విముక్తిఁ గాంచి వచ్చెను.

కుంభకర్ణుఁడు:—కటకటా! ఎట్టిఘోరాపత్కాల మాసన్న మాయెను.

యూపాక్షుఁడు:—ఆరాముఁడు మీయన్న నెట్టులైనను జంపఁ బూనియున్నాఁడు. రాక్షసేశ్వరున కొనరిన యీయాపద దేవర తప్పింపవలయును. మీకంటె దానికి సమర్థు లెవ్వరును లేరు.

[రావణుఁడు మహోదరునితోను బరివారముతోను బ్రవేశించుచున్నాఁడు.]

కుంభకర్ణుఁడు:—అన్నగారిపాదపద్మములకు సేవకుఁ డిదె నమస్కరించుచున్నవాఁడు.

(నమస్కరించును)

రావణుఁడు:—విజయీ భవ (అని లేవనెత్తి యాలింగనముచేసికొని తాను మంత్రు లిడియుండిన సింహాసనమునఁగూర్చుండి తమ్మునిఁ గూర్చుండఁ జెప్పి యూపాక్షుదెస మొగంబై) మంత్రీ! యూపాక్షా! జరిగిన దెల్లయుఁ జెప్పితివా?

యూపాక్షుఁడు:—దేవా! ఎల్లయును మనవిచేసికొంటిని.

రావణుఁడు:—తమ్ముఁడా! నీనిద్ర చెఱచితిని. మనమునఁ గనలకుము. నీవు మొన్న వచ్చియుంటివే. అప్పుడు నన్నుఁ జూచియుంటివిగదా. మఱి యిప్పుడు చూడు నాయొడ లెట్లు బడలి చెడఁ బాఱియున్నదో! నిన్న నారాముఁడు గనికరింపకుండినయెడల మీయందఱిమొగములఁ జూడఁ గలిగిన భాగ్యము నా కబ్బియుండదు.

ఉ. అక్కట యేమి చెప్పుదు రణావని రాముఁడు నిన్న నాపయిం
జిక్కనికోపవేగమునఁ జేవ దలిర్చిన బాణపఙ్క్తి దా
నొక్కమొగి న్నిగిడ్చి దిగులొందిననన్నయుఁ జూచి వీడఁగా
నిక్కడి కేగుదెంచితి నహీనపరాక్రమ మేది తమ్ముఁడా!

మునుపు సురేంద్రునితోఁ బోరాడునెడ నాయెదను విఱిగిన యైరావతదంతశకలము నా పరాక్రమాలంకరణమై యలరారుట సైఁపక యారాముఁడు శరపఙ్క్తుల నావక్షము ప్రక్కలించి తద్దంతావళిదంతఖండముఁ బెకల్చివైచునట్లుండెను. చూడుమా నాయొడ లెట్లు వానివిశిఖముల జర్జరితమై యున్నదో. నాకుఁ బాటిల్లిన యాపదఁ బాప నీవ సమర్థుఁడ వని నీనిద్రాభంగము ఘటియింపఁ జేసితిని. వీరవరా! నీప్రాపు చేరితిని. నీపాలఁ బడితిని. నిన్ను మించఁగల వీరుఁ డీ ముల్లోకములయందును గానరాఁడు. దశరథపుత్రకులు నీ కొక్క లెక్కగారు. నీ భుజాబలమునకు వా రీడువచ్చువారుగారు. అనేకపర్యాయములు నీవు దేవదానవుల నద్భుతరీతి నాహవభూమి జయించిన త్రిలోకవిజయివి గావా? నీ వీరాయసామాన్యదోర్బలమున నీ నరవానరులఁ బట్టి గిట్టఁజేయుము. తమ్ముఁడా! కుంభకర్ణా! నీయన్నను గాపాడవా! నీయన్నకు జయముఁ జేకూర్పవా! (దుఃఖించును.)

కుంభకర్ణుఁడు:—దేవా! యేల యిట్లూరక చింతిల్లెదవు. మున్ను మంత్రనిర్ణయవేళ యే యేదోషములు పొసఁగఁగలవి యని మే మెంచితిమో యవి యెల్ల నేఁడు సంప్రాప్తించెను. దుష్కృతి యగువానికి నిరయములఁ బతనము గలుగునట్లు నీ కీ సీతాపహరణపాపఫలము శీఘ్రముననే సంభవించును. ఇట్లు సంభవించు నని నీవు సీతను తెచ్చుమున్నె యోజింపవైతివి. అక్కటా!

ముట్టికొని వచ్చినప్పుడిప్పుడు చేతులు పిసికికొనుచు నంగలార్చుచున్నాఁడవు. నీవు ప్రేక్ష్య కారివి గాక యిప్పు డీముప్పు తలమీఁదికిఁ దెచ్చికొంటివి. రాజుగాని రాజమాత్రుండు గాని సమయసముచితకార్యోద్యోగముఁ జేయకున్న నట్టివాఁ డచిరంబునఁ జెడును. ఉచితజ్ఞు లగు సచివులతోఁ గార్యనిర్ణయమంత్రము సలిపి యుచితకాలంబున ధర్మార్థకామంబు లుచితభంగి నెట్టివాఁడు సేవించుచుండునో యట్టివాని నెన్నఁడును వ్యసనము లంటకుండును. నీకుఁ గల సచివులు శాస్త్రదృష్టం బగుధర్మ మెఱింగించి యుచితమంత్రము చేయునట్టివారు కారు.

ఆ. గీ. తనదుబుద్ధి మేలు ♦ తనరించు చుండును
బరునిబుద్ధి చేటుఁ ♦ బరఁగఁ జేయు
గురునిబుద్ధి మిగులఁ ♦ గూర్చును శుభముల
వనితబుద్ధి విలయ ♦ మొనరఁ జేయు.

అని నీతికోవిదులు వచియించుమాటలు నీ వెఱుఁగితివో యెఱుఁగవో. శూర్పణఖబుద్ధి మెయి సీత నపహరించితెచ్చి యిప్పు డిట్టికులవిలయముఁ జేసేతఁ దెచ్చికొంటివి. నీతమ్ముఁడు విభీష ణుఁడు నీ కెంతయు హితముఁ జెప్ప వానిబుద్ధి గా దని కంటగించికొని వానిఁ దిరస్కరించితివి. సర్వమునకు నీబుద్ధియే పురస్కరించికొంటివి. నీవు తెలియనివాఁడవు గావు. అన్నా! రాక్షస చక్రవర్తీ! గుణదోషము లెఱిఁగి కర్తవ్యాకర్తవ్యములు విచారించి, భావ్యమును సర్వసమ్మతం బును నగు కార్యమునకుఁ బూనుము. నాకుఁ దోఁచినభంగి చెప్పితిని. మీఁద నీయిష్టము.

రావణుఁడు:—అక్కటా! కుంభకర్ణా! అనుంగుఁదమ్ముఁడవుగదా యని నీబుజములబలిమికలిమి నచ్చి వచ్చి యర్థించిన నూరక పూజ్యుఁడగు నాచార్యుఁడు దయమెయి శిష్యుని శాసించినట్లు నన్ను శాసించితివి. నే నేమి చేయుదును? నీవును నన్నిట్లు తెగడుదువే. ఊరక గతకార్యమునకు వగచి చేయఁగల కార్య మేమిగలదు? తెలిసియో తెలియకయో బలిమినో చలముననో నిలిపిన పని కూర కిప్పుడు నన్నుఁ దప్పులు పట్టిన నే మగును.

తండ్రీ! కుంభకర్ణా! నాపై నీకు భక్తి యుండెనా, సోదరవాత్సల్య ముండెనా, యుద్ధరంగ మున రిపునిఁ బరిమార్చి నాకు మహానందము గలుగఁజేయుము. అట్లు గా దందువేని నా కెవ్వరు నైనవారు లే రని చెలు వేది పడియుండువాఁడను. సమయమున కొదవువాఁడే బంధువు. భ్రాతృవాత్సల్యము మాని నన్ను సరకుగొనకుంటివేని, గతి మాలి దుర్గతిఁ జెంద వలసినవాఁడ నగుదును తండ్రీ! కుంభకర్ణా! ఇఁక నన్నుఁ జాల ముంచెదవో నీట ముంచెదవో.

(దుఃఖించును.)

కుంభకర్ణుఁడు:—అన్నా! ఊఱడుము. నీతివిధము చెప్పితిని గాని పౌరుషము మాలినవిధము గాదు. నే నుండ నీ కేల యీచింత!

చం. వెఱవకు మన్న యింక రఘు ♦ వీరులకై యనిలోన వారిఁ జె
న్నఱ వధియించి భీతిలి వ ♦ నాటులు పర్వఁగ వారిమస్తముల్
గుఱుతుగఁ దెచ్చి నీమదికిఁ ♦ గూర్చెద మోదము నెల్లరక్కసుల్
మఱిమఱి సంతసింపఁగను ♦ మానిని జానకి ఖేద మొందఁగన్.

నే నుండ నీకు వెఱవ నేల! నే నిదే యారామలక్ష్మణులకుత్తుక లుత్తరించివైచెద.

**రావణుఁడు:**—ఇప్పుడు నాకు సంతసంబు గలిగె. రాక్షసవీరశిఖామణీ! న న్నీరణసాగరంబు తరింపఁ జేయుము.

**కుంభకర్ణుఁడు:**— దానవసార్వభౌమా! వారి నెట్లును రణరంగమున నేను జంపువాఁడ. అటుకాక నే నారామునిచేతఁ జంపఁబడితినా యంతలోనే, నీయాసయు మానుకొనుము. ఇఁక నా కానతి మ్ము. వైరినామము మాపివచ్చెదను. శూలమాత్రసహాయుండనై యే నొక్కరుండ యేగెద.

**మహోదరుఁడు:**—కుంభకర్ణా!అసురేంద్రా!ఇంతవఱకు దానవసార్వభౌము నాలోచనలేనివాఁడనియు నాతఁడు మంత్రులతో నాలోచింపక సీతాపహరణం బొనరించె ననియు దూఱాడితివి. దశ కంఠకృత మైన యికార్యము మంత్రు లామోదించినట్టిదే. మఱి యిప్పుడు ని న్నేమనవల యు. జనస్థానవసద్దానవవీరాగ్రణులఁ బదునాల్గువేవుర నెక్కటి కయ్యంబున నేలకుఁ దెచ్చి నయారామునిమీఁది కొంటి దలపడి పోరఁ బోయెద నందువే. ఆరాముఁ డగ్నికల్పుఁడు. శౌ ర్యధనుఁడు. వైరిలోకమృత్యువు. అతనితో సముఁడగు నవక్రపరాక్రమశాలి మనుజులలోన నే కాదుగదా దనుజులలోనను దివిజులలోను నొక్కఁడైనఁ గానరాఁడు. అమోఘశరుఁ డగు నాతనితో నీ వొంటి పోరనెంచుట కృష్ణసర్పముకోఱలతో సాముచేయుట యని యెంచు కొనుము. బాల్యచాపలము మానుము. ఒంటి యేగితి వేని నిక్కముగ నీకుఁ గీడు మూడును.

**కుంభకర్ణుఁడు:**—చాలింపుము. మహోదరా! నీవదరుఁబోతుతనము. నీబోఁటియసంప్రేక్ష్యకారులమం త్రంబు విన్నప్రభునకు నెగ్గు గాక లగ్గు చేకూరునే. పయోముఖవిషకుంభములఁ బోలినహితముఖ దుర్హృదు లని మి మ్మరయ లేక యీదానవేశ్వరుఁడు మీమాటలఁ బోయి ధననాశము జన నాశము పురనాశము చేసికొని యిప్పుడు తననాశమే పాటిల్లు నని కుందుచున్నాఁడు. ఇంత కుఁ గారకులు మీరలే కదా. శూరుఁ డెన్నఁడును దన్నుఁ దాఁ బొగడుకొనఁడు. మాటలఁ గాక చేఁతల నాత్మపౌరుషము సూపును. మీదుగోళ్ళధమునఁ గలిగిన యీయెడరు నడఁప నిదే పోయెదను.

**రావణుఁడు:**—నాయనా! కుంభకర్ణా! శాంతింపుము.

**కుంభకర్ణుఁడు:**—ఏదీ నీవు మంత్రివి గదా. సులువైనవెర వెఱింగింపుము. చూతము నీమంత్రసా మర్థ్యము.

**మహోదరుఁడు:**—దేవా! నీ వూరక నాపైఁ గోపము చెందుచున్నవాఁడవు. నే నేమి చెప్పిన నీమ దికి నేమిగాఁ దోఁచునో.

**కుంభకర్ణుఁడు:**—అ ట్లేమియు లేదు. నిర్భీకుఁడవై చెప్పుము. యుక్తముగ నుండె నేని దానినే చరింతము.

**రావణుఁడు:**—చెప్పుము. నీయాశయ మేమో.

**మహోదరుఁడు:**—దానవసార్వభౌమా! నీకు సుఖము చేకూర నొక్కవిధ మూహించితిని. అవధరింపు ము. ఈభవదనుజుఁడగు కుంభకర్ణునితోడ నన్నును విద్యుజ్జిహ్వుని సంహ్రాదిని వితర్దుని నారా మునితోఁ బోరఁ బంపుము. ఏ మేవురము ను బంచాగ్నులభంగి రణమునకుఁ బోవుచున్నార మని పురంబునఁ జాటఁ బంపుము. మేము రణరంగమున రాము నొక్కట మార్కొందుము,అ

తఁడు మాచేఁ జచ్చెనా మేలు. అటుకాకున్న మే మొక్కింతసేపు శత్రువుతోఁ బోరి మాశరీరముల నంపగములు చీరినట్లు రచించుకొని రక్తసిక్తశరీరులమై రామనామాంకితములగు బాణములఁ గొని నీచెంతకు వచ్చి రాఘవులఁ జంపివచ్చితి మనియు గుఱుతుగ నాబాణములు గొని తెచ్చితి మనియు నీసౌధప్రదేశమున సమర్పించెదము. నీవును నొక్కపురుషు నేనుంగు నెక్కించి పురమునల్గడలను కుంభకర్ణమహోదరాదులు రణరంగమున రామలక్ష్మణులఁ జంపి వచ్చినవా రని చాటఁ బంపి కపటసంతోషము నటించి భవత్సుహృద్భటాగ్రేసరులకుఁ జందనంబును గర్పూరతాంబూలంబులును నిప్పించి ఖండశర్కరాదులు పంచి బహుమతు లిమ్ము. ఎల్లవారును నిది నమ్మెదరు. అచిరంబుగ నిది సీతకుఁ దెలియును. అపుడు నీవు చక్కఁగ నైసేసికొని మధురసంబు గ్రోలి యట కేగుము. అపుడు సీత చేయునది లేక నిన్ననుమతింపఁగలదు. ఇది సుఖమార్గము.

కుంభకర్ణుఁడు:—ఇంకఁ జాలు నీయుపన్యాసము. మేధావివి. మహామంత్రివి. అపూర్వధీశాలివి.

రావణుఁడు:—తమ్ముఁడా! ఈమహోదరుఁడు రణమున నారాముని చేతియంపచవి గని భీతిల్లి యుండుటవలన నిట్లు యుక్తాయుక్తజ్ఞానరహితుఁడై పలుకుచున్నాఁడు. రమ్ము నిన్ను సమరోచితాలంకారముల నలంకరించెద. శూలము గొని రణస్థలిఁ జేరఁబోవు నిన్నుఁ గని యాయముఁడే యట్లు వచ్చె నని వా రెల్ల జడియరా. రమ్ము రమ్ము.

(అని కుంభకర్ణునిఁ గొనిపోవును. అందఱును వారివెంబడి నిష్క్రమింతురు.)



ద్వితీయాంకము

చతుర్థస్థలకము.

[ప్రదేశము—రణరంగము.]

[అంగదుఁడు (మూర్ఛిల్లి,) హనుమ (మూర్ఛనుండి తేఱి యప్పుడే కూర్చుండి,) సుగ్రీవుఁడు (కోపమున యుద్ధసన్నద్ధుఁడై), కుంభకర్ణుఁడు (శూలపాణియై) సుగ్రీవున కెదురుగ ప్రవేశించుచున్నారు.] [వానరదుమ విఱిగిపడినకొండ.]

సుగ్రీవుఁడు:—ఓరీ! క్రవ్యాదాధమా! లేఁజెక్కులఁ బాలుగాఱు చిన్నిబాలుని నంగదుని స్వబలమేమియు నెఱుంగనిహనుమంతుని గొట్టుట యొక్క శౌర్యమే. ఈసుగ్రీవుఁడు నీకుఁ దనంతన వరము లీవచ్చినాఁడు సూడుము. వాఁడు నీకు బ్రహ్మ నిద్రగూర వరమిచ్చియు నొక్కొక్కప్పుడు ప్రబుద్ధియుఁ గూర్చియున్నాఁడు. ఈసుగ్రీవుఁ డాపరమేష్ఠివలె వేదజడుఁడు గాఁడు సుమా. ఇతఁ డిక నీకు మేల్కొలు లేనిపెద్దనిద్దుర యుద్ధరంగమున నిచ్చువాఁడు.

కుంభకర్ణుఁడు:— వాలికి వెఱచి పాతి గొఱిగియుండినఋశ్యమూకము నంతలో మఱచిపోయితివా! సుగ్రీవా! చెట్టుచాటున నుండి శర మేసి వానరుని వాలినిఁ జంపి తా నేమో మేటివీరాగ్రేసరవతంస మని బింకము లాడుసారాముఁడు నీకు దొర యయ్యె. నరవానరులకు దొర అగు

మీరిద్దఱును నాకు దొరలు గారు. మీ కెల్లరకును బెద్దనిద్దుర గలిగింప వచ్చిన కుంభకర్ణుఁడ సుమా. నాకా నీవు పెద్దనిద్దుర కలిగింతువు. ఇదే యది నీకుఁ గలిగింతుఁ దొలుత. (మేను పెంచును.) ఋశ్యమూకము నీకు నీడ యిచ్చినది. అన్నిశైలములకు నేను నీడ యిచ్చెదను. వలయునేని నాపిడికిటిపోటున నంగంబుల నన్నింటి నేను బొడిచేయుదును. నామీఁదఁ గొండ వైచితివి. అది మాయెఁ జూడుము. ఇదె యీశూలము నీయెదఁ జీల్చివైచును. చూడుము. (శూలము విసరును.)

హామమంతుఁడు:- —ఔరా! దురాత్మా! (శూలము నొడిసిపట్టుకొని) 'రామ రామ రామ రామ రామ రామ రాఘవా!' (అని శూలమును మోకాలునఁ బెట్టి విఱిచి పాఱవైచెను.)

కుంభకర్ణుఁడు:—(స్వగతము) ఆహా! ఈహనుమంతుఁ డెంతటిబలిష్ఠుఁడు. కాలాయసశూలంబు నవలీలఁ బెళ్లు మని విఱిచివైచినాఁడు. అట్టు గాకున్న నెవ్వరికిని సాధ్యంబుగాని వారిధి దాఁటివచ్చి యిప్పటికిని నాఱనట్టి లంకాదహనంబు పొనరించునె. వీరెల్లరును నీసుగ్రీవుఁ డొక్కరుఁడు లేకున్నఁ జుక్కానిలేనియోడ యట్లీరణాంబుధిఁ బడి మునుఁగుదురు. ఇదే యీలంకాపురములోనిమలయాద్రిశిఖరంబుఁ బెకల్చి తెచ్చి వీనిమీఁద వైచి వీని నుగ్గొనర్తుఁగాక.

(నిష్క్రమించును.)

సుగ్రీవుఁడు: —క్రూరకర్మా! ఎందేగెదవు? (వెన్నంటి పోవును)

హనుమంతుఁడు:—ఆహా! ఖలుఁడు కపినాథునిఁ గొండతోఁ గొట్టెను. సుగ్రీవుఁడు మూర్ఛిల్లె. అక్కటా! ఇప్పలుగాకి పలలాశి వానరప్రభుని నెత్తికొనిపోవుచున్నాఁడు. నే నిప్పుడే పోయి వానిశిరము పిడికిటఁ బగుల నడఁచి భాస్కరతనయుని విడిపించుకొని వచ్చెదను. (అని పోవ నుంకించి నిలువఁబడి) ఆహా! ఈసుగ్రీవుఁడు దేవదానవులకైన లక్ష్యపెట్టనట్టివాఁడు గాఁడు. కొండతాఁకున నింత సొమ్మసిల్లి పడినాఁడు. యిప్పుడ లేచి కుంభకర్ణునికిఁ గీడు గలిగింపఁగలవాఁడు శూరవరేణ్యుం డగు నీతని నేను విడిపించితి నేని నిజశౌర్యము వెలితిపడె నని డెందమునఁ జింత నొందఁగలఁడు. అట్టిపని నేను చేసి యూరక యేల యాతనియాగ్రహపాత్రుఁడఁ గావలయు.

[ రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు. ]

శ్రీరాముఁడు:—వత్సా! వాయునందనా! ఏ మట్లు యోజించుచున్నాఁడవు.

హనుమంతుఁడు:—దేవా! కుంభకర్ణుఁడు సుగ్రీవు నెత్తుకొని పోవుచున్నాఁడు.

శ్రీరాముఁడు:—ఏమీ! సుగ్రీవునా? (శరముఁ గొనుచున్నాఁడు.)

హనుమంతుఁడు:—దేవా! దేవా! వలదు వలదు. సుగ్రీవుఁ డా దుండగీనిఁ జెండివైవఁగలఁడు. వాఁడదిగో వచ్చుచున్నాఁడు.

[ సుగ్రీవుఁడు (రక్తార్ద్రహస్తుఁడై) ప్రవేశించుచున్నాఁడు. ]

సుగ్రీవుఁడు:— జయము జయము శ్రీరామలక్ష్మణదేవులకు (నమస్కరించును).

శ్రీరాముఁడు:-(లేవనెత్తి) సుగ్రీవా! నిన్నా మ్రుక్కుడిరక్కసుఁ డెత్తికొనిపోయెనని విని మిక్కిలి చింతఁజెందితి సుమా. మై పొచ్చెముగాంచక వచ్చినదే నీయద్భుతపరాక్రమమునకుఁ దార్కాణము. మఱి నీచేతుల నీనెత్తుటికట్టె లెట్లు వచ్చెను?

సుగ్రీవుఁడు:—దేవా! నీయాశ్రితుల కెంతైనఁ గీడు గలుగునే. నన్నా రాక్షసాధముఁ డామలయాద్రి శృంగమునఁ గొట్టెను. దానితాఁకున నేను మూర్ఛిల్లితిని. అంత నాకట్టిఁడిఘటకర్ణుఁడు నన్నుఁ గొని పురమార్గము పట్టెను. పురిఁ జేరునంత నేను దెలిసి నాగోళుల వానిముక్కును, చెవులను గిల్లివైచితిని. అంత వాఁడు కడుఁ గోపించి నన్నెత్తి నేలఁ బడవైచెను. నేను నేలఁ బడక యాకసమున కెగసి దేవరపాదపద్మంబులకడ వ్రాలితిని.

హనుమంతుఁడు:—దేవా! దేవా! వాఁడె కుంభకర్ణుఁడు వచ్చుచున్నాఁడు. మనబలములు చెల్లాచెదరై పాఱుచున్నవి. వాఁడు వానరులఁ దఱుముచున్నాఁడు.

లక్ష్మణుఁడు:—అన్నా! అన్నా! అటు చూడుము. వాఁడు వానరులను రాక్షసులను గూడఁ బట్టి మ్రింగుచు వచ్చుచున్నాఁడు.

శ్రీరాముఁడు:—నాయనా! ఈమూర్ఖుఁ డిప్పుడు నెత్తురు పెల్లుగఁ ద్రావి మత్తెక్కి స్వబలపరబలవివేచనము లేక చేతి కబ్బిన యెల్లవనేచరనిశాచరులను బట్టి మ్రింగుచున్నాఁడు.

[కుంభకర్ణుఁడు (రోషమునఁ) బ్రవేశించుచున్నాఁడు.]

కుంభకర్ణుఁడు:—ఓరీ! మర్కటములారా! ఏఁడీ మీరాముఁడు. ఆరామునిఁ జూపుఁడు మిమ్ముఁదినుట మానను. నే నెవ్వరనుకొంటిరి. రాక్షసలోకచక్రవర్తి యగు పఙ్క్తికంఠసార్వభౌమునను౯ుఁ దమ్ముఁడఁ గుంభకర్ణుఁడ. దేవత లందఱికి హృదయశల్యమను. ఇప్పుడు మీయందఱిపాలికాలుఁడను. ఆరాముని లక్ష్మణుని సుగ్రీవుని హనుమంతుని విభీషణుని నందఱును దినివేయువఱకు నాకుఁ దృప్తి గలుగదు. చూపుఁడు. శాఖామృగములారా! చూపుఁడు వారిని. (వానరబలములు శ్రీరాముని మఱుఁగుసొచ్చును.) ఇట్లు గాదు వీరి నెల్లర నాకొండతోఁ గొట్టెద.

(పోవును)

హనుమంతుఁడు:—ఛీ! ఛీ! కుంభకర్ణుఁడు పగుపెత్తుచున్నాఁడు.

(వానరులు సింహనాదములు చేయుచుందురు. అంగదుఁడు లేచును.)

శ్రీరాముఁడు:—ఓహో! ఈ రాక్షసవీరుఁడు కొండ గొని వచ్చుచున్నాఁడు. కొండతోడి యాచేయి నట్లె తునిమివైచెద. (బాణ మేయును)

లక్ష్మణుఁడు:—అన్నా! అన్నా! అదె చూడుము మాకుంభకర్ణునిచేయి తెగి కొండతోడఁ బడుచున్నది. అక్కటా! ఆకొండక్రింద నెందఱో వానరులు చచ్చిరి. అన్నా! ఈదుష్టుని సంహరింపుము. వానరులు భయపడుచున్నారు.

సుగ్రీవుఁడు:—వానరులారా! మీ రెల్ల నాయసురాధమునిమీఁది కెక్కి వానిశరీర మంతట మీనఖరాయుధంబులఁ జీల్చివేయుఁడు. (వానరులు కొందఱు పోవుదురు)

హనుమంతుఁడు:—ఆహా! వానరులు వానిమీఁది కెక్కుచున్నారు.

లక్ష్మణుడు:—అక్కటా! వాఁడు మెయి విదల్చి వానరుల నేల రాల్చుచున్నాఁడు. అన్నా వీనిని జంపివేయుము.

హనుమంతుఁడు:—వాఁ డిదే వచ్చుచున్నాఁడు.

[కుంభకర్ణుఁడు (ఒంటిచేత ముద్గరము గొని) ప్రవేశించుచున్నాఁడు.]

కుంభకర్ణుఁడు:—రామా! నిన్ను మెచ్చవచ్చును. ఇంతవఱ కెరికిని నసాధ్యమైనఘనంగి నేఁడు నీవు మద్బాహునికర్తనం బొనర్చి కీర్తి వడసితివి. కాని నీవు నన్నుఁ జంపఁజాలవు. నే నాఖరుఁడఁగాను. విరాధుఁడనుగాను. కబంధుఁడను గాను. వాలిని గాను. తాటకాసుతుఁడను గాను. నిఖిలనిర్జరుల జయించిన కుంభకర్ణుఁడను సుమా.

శ్రీరాముఁడు:-అవును. నీవు కుంభకర్ణుఁడవే. కాని నే నెవ్వఁడనో యెఱుఁగవైతివి. నిన్ను నీయన్నను మిమ్ముఁ బోలు దుష్టుల శిక్షించి శిష్టులఁ జేకొని రక్షింప వచ్చిన రాముఁడ. రమ్ము రమ్ము.

కుంభకర్ణుఁడు—(స్వగతము)వీఁడు శూరవరేణ్యుఁ డని మాయన్న చెప్పయున్నాఁడు. వీనిని గొండకొమ్ముతో నడఁచెద. అంతకుఁగాని యీయుద్ధము ముగియదు. [నిష్క్రమించును]

శ్రీరాముఁడు:—(స్వగతము)ఏమి యీదనుజుఁ డట్లు పోవుచున్నాఁడు.—ఓహో! వీఁడు పర్వతశిఖరంబు నూడఁ బెఱికికొని వచ్చుచున్నాఁడు నామీఁద వైచి చంప. వీనిని శరపరమునఁ దునిమివైచెదఁ గాక. (శరము వేయును)

సుగ్రీవుఁడు:—దేవా! దేవా! వాని రెండవచేయి తెగి పడెను.

అంగదుఁడు:—ఆచేతిక్రింద నెందఱు చచ్చిరి!

శ్రీరాముఁడు:—ఏ మాశ్చర్యమిది! ఏయస్త్రిరాజము సప్తసాలములఁ గూల్చి వాలివెన్ను చీల్చి వారినిధి నడల్చె నది నేఁడు వీనిఁ బొలియింపదయ్యె. ఇదే యిఁక నైంద్రాస్త్రి మేసెద.

(అభిమంత్రించి ప్రయోగించును.)

హనుమంతుఁడు:—దేవా! వానితల తెగి యెగసి లంకాపురచర్యాగృహంగోపురప్రాకారముపయిం బడుచున్నది. ఎట్లు వెలుఁగుచున్నది!—ఆహా! ఆప్రాకారములు నుగ్గులయ్యె.

లక్ష్మణుఁడు:—అన్నా! ఏ మాశ్చర్య మిది. వాని మొండెము సముద్రజలములఁ బడెను.

(వానరులు సింహనాదము చేయుదురు)

వానరులు:—జయము జయము శ్రీరామచంద్రనరేశ్వరచూడావతంసమునకు. జయము జయము.

హనుమంతుఁడు:—శ్రీరామజయము. శ్రీరామజయము.

(అని చిందులు ద్రొక్కును)

(యవనిక పడును)



# శ్రీరామపట్టాభిషేకనాటకము

## తృతీయాంకము



### ప్రథమస్థలకము.

(ప్రదేశము: రావణుమందిరము.)

[రావణుఁడు (దుఃఖమున) దేవాంతకుఁడు, నరాంతకుఁడు, అతికాయుఁడు, త్రిశిరుఁడు, మహోదరుఁడు, మహాపార్శ్వుఁడు (రావణు నోదార్చుచును బరిచరించుచును) ప్రవేశించుచున్నారు.]

త్రిశిరుఁడు:—అయ్యా! ఊఱడుము. దుఃఖింపకుము. దుఃఖించి యేమి కార్యము సాధింప నగును!

రావణుఁడు:—హా! కుంభకర్ణా! అమోఘ మగు నీపరాక్రమము నేఁడు రామునిచేత మోఘ మయ్యెనా!

తే. గీ. ధీరవర నీవు రణమునఁ జెగుట యరయఁ
గుడిభుజమె నాకు నని చెగిపడినపగిదిఁ
దోఁచె నే విధి శత్రువుతోడఁ బోరి
జయము గొనువాఁడఁ దమ్ముఁడా సమరమునను.

సీ. శైలము ల్పిండిగాఁ జదమెడు వజ్ర మె
వ్వానిమూర్ధమునను వజ్రమయ్యె
నఖిలజంతులఁ జంప నగుకాలదండ మే
ధైర్యాద్రిమెడఁ బూల దండ యయ్యెఁ
దరలక కూల్చు యాదఃపతిపాశ మె
వ్వనికరమ్ములకుఁ గంకణము లయ్యె
నసురుల సమయింపఁ గనగు విష్ణుచక్ర మే
ప్రబలునిఁ గొమ్మునఁ బదక మయ్యె

ఆ. వె. నట్టి విజయశాలి వగు తమ్ముఁగుట్టని
నొక్కనరుఁడు పోర నుక్కడంచె
నెట్టి వింత పుట్టెనే మన నగు నీదు
భూరిబల మదెంతఁ బోయె నేఁడు.

ఆ వె. నీవు లేనికతన నిర్జరు లిఁక నన్ను
సులభముగ జయింపఁ జాలరయ్యొ
కుంభకర్ణ! నేను గూడ నేవెనువెంట
వచ్చువాఁడఁ బోవ వలదు తండ్రి!

హా! కుంభకర్ణా! నీ వనుచెలియలికట్ట యొండుండఁబట్టి కదా వైరిసముద్రము మీఱివచ్చి నన్ను ముంపఁ జాలకుండెను. అకటా! ఇంక నీరావణునకు జయము లేదు. ప్రాఁపు లేదు. కుంభకర్ణా! న న్నోదార్పరాదా.

త్రిశిరుఁడు:—తండ్రీ! దానవలోకాధీశ్వరా! ఊరక యేల యిట్లు దురపిల్లెదవు? ప్రాఁపు లేదు. ప్రాఁపు లేదని యూరక చింతింపకుము. నీకుమారుఁడఁ ద్రిశిరుఁడ నే నున్నాఁడ నీవాగులు దీర్ప.

ఆ. వె. మూఁడులోకములు ను మూగి వచ్చిననేని
మూఁడు నోళ్ల మ్రింగువాఁడ నింక
రాముఁ డెంత నాకు రాక్షసాధీశ్వర
వగపు దక్కు నీవు నెగులు దీర్తు.

మాపినతండ్రి యగు కుంభకర్ణదానవనాథుఁడు వీరాగ్రేసరుఁడై కదనంబున వానరానీకంబు నెల్లంజీకాకు సేసి చించి చెండాడి యుద్ధమరణంబు నొందినవాఁడు. కాలధర్మయుక్తుం డగునాదానవశిఖామణికై యేల చింతిల్లెదవు. నన్నుఁ బంపుము శత్రునిమీఁదికి. క్షణమాత్రమున నాతనిపేరు మాపివచ్చెదను. ఊరక చింతింపకుము.

రావణుఁడు:—నాయనా! త్రిశిరకుమారా!

ఉ. చిన్నవు యుద్ధరంగములు పెక్కు లెఱుంగవు వచ్చినట్టివాఁ
డెన్నఁగరానిశౌర్యమున నెంతయుఁ బేర్చినయట్టివాఁడు నా
కన్నులు చల్లగాఁగ నినుఁ గంపు రణంబున కేగ కన్న సౌ
ఖ్యోన్నతి నింట నుండఁ దగవో త్రిశిరా! వల దిట్లు పూనఁగన్

ఆరామునిమీఁదకుఁ బోకుము నాయనా! నీ వోర్వఁజాలవు.

త్రిశిరుఁడు:—తండ్రీ! ఆరామున కేల భీతిల్లెదు. వాఁ డన నెంత?

తే. గీ. లోకముల గెల్చినట్టి లోకైకవీరుఁ
డైనరావణబ్రహ్మకు నాత్మజుండ
నింద్రజిద్భ్రాతయును నయి యొసఁగినట్టి
నేను రాముని నరుఁ జంప లేనె తండ్రి.

చ. సురపతియో హుతాశనుఁడో సూర్యతనూజుఁడో కోణపాలుఁడో
వరుణుఁడో వాయువో మనుజవాహనుఁడో ఫణిభూషణుండో యీ
నరుఁ డగురామనాముఁడు రణంబున నా కొకలెక్కయే మదిం
బరఁగఁగ నీకు తండ్రి యనుమానము న న్నని కంపు మేగెదన్

నాకు సమరోత్సాహము మిక్కిలిగాఁ బొడమె. నామీఁదిమక్కువ నాయీప్రార్థనము చిన్న నేయక నన్నంపుము.

రావణుఁడు:---నాముద్దుకుమారా! నీ వూరక యిట్లు పట్టిన నే నే మనఁగలవాఁడ నింక. నామాట యించుకంత వినుము. భ్రాతృమరణముచేతనైన దుఃఖమున నే కర్శితుండను. నా కేల యింకను జింత గల్గింపఁ జూచెదవు.

త్రిశిరుఁడు:---తండ్రీ! వీరే యస్మత్సహోదరులు గలరు గారె దేవాంతక నరాంతకాతికాయులు. మే మెల్లరము నేఁగి యారాముని నామ మడఁచి పుచ్చి వచ్చెదము.

రావణుఁడు:---(ఇంచుక చింతించి) మంచి దట్లె కానిండు.

అతికాయుఁడు:---(స్వగతము) త్రిశిరుఁడు బాలుఁడైనను మంచికోరిక కోరినవాఁడు. పుట్టినది మొదలుగా నాతతాయిచేష్టలే చేయుచుండు నీనికృష్టరాక్షసులకు శ్రీమన్నారాయణుం డగు నాశ్రీరామచంద్రునిశరములఁ జావు గల్గి మోక్షము చేకూరుఁ గాక. (ప్రకాశము) మేలు! త్రిశిరా! మేలు! నీవూనిక నస్మదాకులవిక్రమంబును జూప నద నొదవించితివి. నీవు గదా నా మెచ్చునకు వచ్చినవాఁడవు---తండ్రీ! మా కెల్లర కనుజ్ఞ యిమ్ము. మే మిప్పుడ పోయి యుద్ధమునఁ బేరెన్నిక గనెదము. (నమస్కరించును.)

దేవాంతకుఁడు, నరాంతకుఁడు, త్రిశిరుఁడు :-ఇంక మా కనుజ్ఞ యిచ్చి మ మ్మాశీర్వదింపుము. (నమస్కరింతురు.)

రావణుఁడు:---శాశ్వతకీర్తి యొసఁగెదుఁ గాక. (అందఱను లేవనెత్తి) వత్సలారా! మీకుఁ బ్రాపుగా నస్మద్భ్రాతల నీమహోదరమహాపార్శ్వులను సైతము వెంటఁగొని పొండు. తమ్ములారా! కుమారవీరులకు మీరు బాసటగఁ బొండు.

మహోదరుఁడు., మహాపార్శ్వుఁడు. ---చిత్తము. (నిష్క్రమింతురు.)

---

## తృతీయాంకము.

### ద్వితీయస్థలకము

[ప్రదేశము---యుద్ధరంగము.]

[రాముఁడు, లక్ష్మణుఁడు, జాంబవంతుఁడు, విభీషణుఁడు, సుగ్రీవుఁడు, హనుమంతుఁడు ప్రవేశించుచున్నారు.]

రాముఁడు:---విభీషణా! నీమోమున దీనభావ మేల యింకను వీడకున్నది? నాయెదుట నీ విట్లు చింతఁగూరియుండ నామదికి నెమ్మది గలుగకుండెడిని. నాకతమున నీ కేమియు మనస్సునకుఁ జింత గలుగదు గదా? నీచింతకుఁ గారణ మేమి?

విభీషణుఁడు:—అక్కటా! దేవా! మీకతమున నాకెంతయు సంతోషము గలుగుఁ గాని చింత యేల కలిగెడిని? అట్లు మీచేఁ జింత గలుగునెడల నే నేల మీమఱుఁగు చొచ్చియుండుదును. మీకతమున నొకనాఁడును నాకుఁ జింత గలుగదు.

రాముఁడు:—అయిన నీచింత దేనిచేత?

విభీషణుఁడు:—మాయన్న యగు రావణుఁ డింత మూర్ఖుఁ డయ్యెనే యని చింత.

చ. అనిమొన యక్షరాక్షసుల * కైనను దేఱి కనంగ రానివాఁ
డొనరినకోపవేగమున * నొక్కట లోకము లెల్ల మ్రింగి వై
వను దగు కుంభకర్ణుఁ డని * వ్రాలినపిమ్మట నైన మిమ్ములం
జెనఁకుట యక్కటా! విడఁడు * చేటును గానఁ డదేమి మౌర్ఖ్యమో.

ఇట్టిమూర్ఖునిప్రజల కెన్నఁ డేని మేలు గలుగునే.

రాముఁడు:— విభీషణా! ప్రజ లన్న జ్ఞప్తికి వచ్చె. ప్రతిదినమును లెక్కకు మిక్కిలి యగు రక్కసులఁ జక్కడంచుచున్నారము. మఱునాఁ డుదయమున రణరంగమున నొక్కరక్కసపీనుగును గనరాకుండును. ఇది యేమి చోద్యము. వా రెట్లు మాయ మగుచున్నారు. రాక్షసులు జీవములు వీడియు మాయలు పచరింతురా యేమి?

విభీషణుఁడు: —దేవా! ఇది యేమి వింత! అది మాయన్నగారిధీచాతుర్యము. ప్రతిదినము జచ్చిన రక్కసపుమూఁకల నాతఁడు సముద్రమునఁ ద్రోయించి పట్టణంబున రక్కసులు జయించుచున్నా రనియు వారిలో నొక్కఁడును జావకున్నాఁ డనియుఁ జచ్చినవా రెల్లరు వానర వీరులే యనియుఁ బౌరులకు ధైర్యోత్సాహంబులు పుట్ట నెల్లెడలఁ జాటఁ బంచుచున్నవాఁడు. అంతియే కాని యిది రక్షోమాయ గాదు.

రాముఁడు:—అవురా! రావణుని యప్రమేయప్రతిభ! విభీషణా! నిక్కముగఁ బరస్త్రీపహరణశిష్టపీడనంబు లన్న దుర్గుణంబులు పొనరవేని మీయన్న ముల్లోకము లేలను సమర్థుఁడు సుమా!

హనుమంతుఁడు: —అహో! రామచంద్రునియుదారగంభీరమతి మెచ్చఁదగినది కదా. వైరి యని యైన నెన్నక శాత్రవుబుద్ధిచాతుర్యము పొగడుచున్నాఁడు. అవురా! రామచంద్రా!

[వానరుఁ డొకడు (పరుగున) ప్రవేశించుచున్నాఁడు.]

వానరుఁడు:—రక్షింపుఁడు. రక్షింపుడు. దేవాంతకుఁ డంగదయువరాజును జేయార్పనీక కొట్టుచున్నాఁడు.

సుగ్రీవుఁడు:—నీలహనూమంతులారా! అంగదునకు మీరు బాసటగఁ బొండు పొండు.

నీలుఁడు }
హనుమంతుఁడు } :- భాగ్యము. (పరుగున నిష్క్రమింతురు.)

రాముఁడు:—లాంగూలా! అంగదుఁడు నరాంతకునితోఁ బోరుచుండెఁ గదా?

లాంగూలుఁడు:—భాగ్యము. అంగదరాజు నరాంతకుని క్షణమునఁ జంపివేసినాఁడు. అంత నారాక్షసుని భ్రాత దేవాంతకుఁడు కోపంబున యువరాజును బొదివికొనెను. యువరాజు నరాంతకు యుద్ధంబునఁ జాల నలసియుండుటచేత మిగులఁ జీకాకువడుచుండఁ జూచి నే నిటకుఁ బాఱు తెంచితిని.

రాముఁడు:—మంచిది. ఇఁక నీవును నట కేగుము.

లాంగూలుఁడు:—ప్రభువునాజ్ఞ. (నిష్క్రమించును.)

జాంబవంతుఁడు:—ప్రభువు లటు వీక్షింపుఁడు. జనస్థానమున దేవర దంపిన త్రిశిరుఁడు మరల సజీవుఁడై వచ్చినయట్లున్నయది. (అని నిష్క్రమించును.) (అందఱు నావంకఁ జూతురు)

విభీషణుఁడు:—(చూచి) కాఁడు కాఁడు. వీఁడు మాయన్నగారికుమారుఁడు త్రిశిరుఁడు—ఆహా! అతఁ డేమి హనుమంతునిమీఁది కేగుచున్నాఁడు. ఓహో! హనుమ దేవాంతకునిఁ గూల్చినాఁడు. సోదరమరణవ్యథితుఁడై త్రిశిరుఁడు హనుమను దాఁకుచున్నాఁడు.

సుగ్రీవుఁడు:—దేవా! దేవా! అటు చూడుఁడు. మనఋషభుఁడు మహాపార్శ్వునితోఁ బోరాడుచున్నాఁడు. వానికి వానితోడిపోరాట దుర్భరంబుగ నున్నది. ఆహా! మననీలుఁడు మహోదరునిఁ జంపి ఋషభునికడ కేగుచున్నాఁడు.

(తెరలోఁ గలకలము)

రాముఁడు:—ఏమి! వానరవీరు లట్లు చెల్లాచెదరుగఁ బాఱిపోవుచున్నారు? ఆహా! విభీషణా! ఆఘోరాకారుఁ డెవ్వఁడు? అతఁడు కుంభకర్ణుఁడే మరల వచ్చిన ట్లున్నాఁడే. వానరు లెల్ల నారాక్షసవీరునిఁ గాంచి భయపడి పరుగులు వాఱుచున్నారు.

విభీషణుఁడు:—దేవా! వీఁడు రావణునకు ధాన్యమాలిని యను నప్సరోరమణిగర్భమున జన్మించినవాఁడు. అతికాయుఁ డనువాఁడు. వీఁడు తపస్సున శంకరు మెచ్చు గాంచి యతనిచేత మన్ననపడసినవాఁడు, నీతివిశారదుఁడు, బహుకార్యదక్షుఁడు, శౌర్యవీర్యంబుల రావణున కీన యగువాఁడు.—ఏ మిది? వాఁడు వానరులఁ దఱుముచు మనవంకకే వచ్చుచున్నవాఁడు.

సుగ్రీవుఁడు:—దేవా! దేవా! ఋషభునకుఁ దోడుపోవుచుండిననీలుని రాక్షసు లడ్డగించిరి. వానికిఁ బోరు భరమైనది. నే నేగెదను.

రాముఁడు:—పొమ్ము. పొమ్ము. (సుగ్రీవుఁడు నిష్క్రమించును.)

విభీషణుఁడు.—దేవా! మూరమున నింద్రజిత్తు యుద్ధమున కరికట్టి వచ్చుచున్నవాఁడు. నన్నుఁ బంపుఁడే వానిఁ బొదివెద.

రాముఁడు:—పొమ్ము. నేనును వత్తునా?

విభీషణుఁడు:—వలదు దేవా! నేనే చాలుదును. (నిష్క్రమించును)

రాముఁడు:—తమ్ముఁడా! చూచితివా యతికాయుఁ డెట్లు వానరులఁ దఱుముచు మనవంకకు వచ్చుచున్నవాఁడో.

(తెరలో హనుమంతుఁడు)

(దురాత్మా! చచ్చితివిరా)

రాముఁడు:—(విని చూచి) లక్ష్మణా! లక్ష్మణా! హనుమంతునకుఁ ద్రిశిరునితోఁ బోరుట కష్టముగ నున్నట్లున్నది. ఇదె నే నేగి యాత్రిశిరుఁ గూల్చి హనుమంతుని వదలించుకొనివచ్చెదను. నీ విచ్చోటనె యుండి యతికాయునిపని తీర్పుము. నే నేగెదను.

లక్ష్మణుఁడు:—భాగ్యము.

[రాముఁ డధిజ్యధన్వుఁడై నిష్క్రమించును.]

(స్వగతము) ఈయతికాయునిఁ గాంచఁగనే వానరులు పరువులెత్తుచున్నారు. వీ రితనిఁ గుంభకర్ణుఁ డని తలంచియున్నారు. మరలఁబట్టి తమ్ము మ్రింగునో యని వెఱచి పఱచుచున్నవారు. (ప్రకాశము) వానరవీరులారా! పరుగెత్తకుఁడు. వీఁడు కుంభకర్ణుఁడు గాఁడు. అతికాయుఁడు. వీనిని బొదివి చంపుఁడు. మరలుఁడు మరలుఁడు.

(తెరలో)

అతికాయుఁడు:—వానరవీరులారా! ఊరక చావకుఁడు. మీతోడ మా కేమియుఁ గార్యము లేదు. ఆరామచంద్రుఁ డెం దున్నాఁడో చెప్పుఁడు. మాకు వానితోడఁ బని గలదు. తచ్ఛరపాతంబు గాంచ వచ్చినారము.

లక్ష్మణుఁడు:—దురాత్మా! రావణీ! అతికాయా! రమ్ము రమ్ము. నీకు రామచంద్రునితోఁ బని గలదా? తొలుత నాపని యెట్టిదో నా కెఱింగించినఁ గాని శ్రీరామచంద్రునిఁ జేరఁ జాలవు. నీబింకములు చాలించిరమ్ము. నీకు నేను జాలువాఁడను. రమ్ము. రమ్ము. మచ్ఛరపాతముఁ గాంతువు గాక.

[అతికాయుఁడు ప్రవేశించుచున్నాఁడు]

అతికాయుఁడు:—లక్ష్మణా! మీయన్న యేఁడీ యాలోకైకవీరుఁడు రామచంద్రుఁడు. వానికి నేఁడు నాచేతిబలు వింత చూపవలయును.

లక్ష్మణుఁడు:—ఓరీ! రావణీ! మున్ముంగు నన్ను మార్కొనుము. ఆమీఁద రామచంద్రునిమీఁదికిఁ బోదువు గాని బ్రదికి యుండినయెడల.

అతికాయుఁడు:—లక్ష్మణకుమారా! బాల్యచాపలమున మాటాడకుము. నీకీడైన రాక్షసబాలకులతోడ యుద్ధ మాడఁబొమ్ము. నన్నుఁ జెనకఁజాలవు. రామునిజాడ నా కెఱింగింపుము. నే నాతనికడ కరిగెదను.

లక్ష్మణుఁడు:—బాల్యము వయస్సునకుఁ గాని యుద్ధచాతుర్యమునకుఁ గాదుసుమా. ఊరక మాటాడక యుద్ధ మొనరింపుము.

అతికాయుఁడు:—లక్ష్మణా! అయోగ్య! నెత్తురుగంగ పవే.

ఉ. బాలుఁడవయ్య నీకును శుభం బెదఁగోరి వచింతు నయ్య యీ
కాలము మానుమయ్య నను నక్కట మార్కొనఁ జాల వయ్య నిన్
బోలిన రాక్షసార్భకులఁ బోరున మార్కొన గెల్తు వయ్య కా
లాలయ మేగ కయ్య నను నాజి నెదుర్కొని పోరి లక్ష్మణా!

లక్ష్మణుఁడు:—ఏ మేమీ! కాలాలయవాసమా. నీకు దానిపై నంత కూర్మి గలదేని నేను వలదందు నా. నీ కాకాలాలయవాసమే కలిగింతు. నిలువుము.

అతికాయుఁడు:—పడుచా! రజ్జులు ప్రేలకుము. నాబారిఁ జిక్కితివేని సురాసురశ్రేష్ఠులైన నిన్నుఁ గాపాడఁ జాలరు. సుమిత్రకుఁ బుత్రశోకము గల్గింపకుము.

లక్ష్మణుఁడు:—ఓరీ దుర్బలవాచాటా! నిశాటాధమా! ఊరక యుద్ధమొనర్పఁగల్గితివా, యుద్ధము సేయుము. అంతకుఁ జాలవేని 'జితోఽస్మి' యనుము. నిన్ను విడిచి పూరుఁడుండు నొండెడకై నఁ బోయెదను.

అతికాయుఁడు:—ఏమేమీ! మేర మీఱుచున్నవి నీప్రల్లదములు. అయిన నింక నాయత్నము లేదు. నీయెడఁ గనికరము దలఁచి నే నాడినమాటలు నీ కంత వెగటు లయ్యెఁ గా.

లక్ష్మణుఁడు: —ఓరీ! వైరియెడఁ గనికరించి పోరాట దక్కు నీ వెట్టివూరుఁడవురా! న న్నెదిరింపఁ జాలక యాదౌర్బల్యము గప్పిపుచ్చ నీపన్నుగడఁ బూనితివో.

అతికాయుఁడు:—అయిన నిదే నాదౌర్బల్యముఁ జూచువాఁడవు గమ్ము. చక్క నిలువుము. నీపని తీర్చెదను. చేఁపవై నీరధి సొచ్చినను, కూర్మాకృతిని మేను డాఁచినను, వరాహంబవై పాతాళంబు చొఱఁబాఱినను, నరమృగంబవై నఖరాయుధంబులఁ గోరాడినను, బుడుతవై వేఁడికొనినను, బ్రాహ్మణాకృతి ధరించినను, నీరధి దాఁటి వచ్చినను నిన్నుఁ బోనీను.

లక్ష్మణుఁడు:—(స్వగతము) ఏమి వీనిభక్తి! అవతారప్రశంసనము వీరాలాపవ్యాజమునఁ జేయుచున్నవాఁడు!

అతికాయుఁడు:—ఇదే సురలు తలర నసురు లలర నీశిరము దొరలింతుఁ గాచికొనుము.

(శరము దొడుగును)

లక్ష్మణుఁడు:—ఇదే సుర లలర నసురులు దలర ని న్నిలఁ గూల్చెదను. నిలువుము.

(యుద్ధసన్నద్ధుఁ డగును.)

(యవనిక పడును.)

---

# తృతీయాంకము.

## తృతీయస్థలకము.

[ప్రదేశము—యుద్ధభూమి.]

[ఇంద్రజిత్తు (అధిజ్యధన్వుఁడై) యుండును. రామాదు లెల్లరును బ్రహ్మాస్త్రమోహితులై పడియుందురు.]

ఇంద్రజిత్తు:—ఇప్పటికిఁ గదా నాసహోదరు లగు నరాంతక దేవాంతక త్రిశిరోఽతికాయులయప్పు దీర్చికొనఁ గంటిని. వైశ్వానరు నారాధించి. పడసినమహనీయబ్రహ్మాస్త్రము మొక్కపోవునే. కపిసైన్యమంతయు నేలపా లొనరించితి. నేఁడు నరాంతకుఁ జంపినయంగదుని దేవాంతక

త్రిశిరులఁ బొలియించిన యాచెనఁటిహనుమంతుని మహోదరుఁ గెడపిననీలుని మహాపార్శ్వప్రమందించిన యాఋషభుని నాకసి దీఱ వ్రేటులాడి నేలఁబడఁ గొట్టితిని. కుంభకర్ణాతికాయులఁ దుదిముట్టించిన యారామలక్ష్మణుల నేలఁ ద్రోఁచితిని. నేఁడు గదా నాచేతుల కోరినసమర మబ్బె. పులస్త్యవంశదూషణుఁ డగు నావిభీషణుఁడు నాపితృవ్యుఁ డెందును గానరాకున్నాఁడు. అక్కులద్రోహి చిక్కె నేని నాకుండు నీసంగ్రామావేశముననే వానిని నీరణరంగమునకు బలి యిత్తును. మాయయ్య మిక్కిలియుఁ బుత్రభ్రాతృశోకములఁ జిక్కియున్నవాఁడు. నేనిప్పుడ పోయి యీవిజయ మెఱింగించి సంతోషపెట్టి మరల నస్మత్పితృవ్యవిషయ మరసెదఁ గాక. (అనినిష్క్రమించును.)

హనుమంతుఁడు:—(ఇంద్రజిత్తు పోయినపిమ్మట లేచి కూర్చుండి చుట్టును బడియుండు సైన్యమెల్లఁ జూచి) అక్కటా! నేఁ డెట్టిబెట్టిదంపుటెడరు పుట్టెను. ఈనికృష్టమేఘనాదుఁ డెంతపని చేసెను. బ్రహ్మాస్త్రమా! ఎట్టి కీడు పొనరించితివి. పరమేష్ఠీ! నీయస్త్రము నన్నేమియుఁ జేయకుండునట్లు నాఁడు వర మిచ్చితివే. ఈదుష్టరాక్షసనిర్మూలనం బగునంతవఱకైన నీకపిసైన్యము నంతయును నేమియుఁ జేయకుండునట్టివరము దయచేయరాదా. అయ్యో! నీయస్త్రమున రామలక్ష్మణులు సయితము నేల వ్రాలిరే. హా! మేఘనాదా! ఎంతటిక్రూరుఁడవురా నీవు. ఎంతటిమాయావివిరా నీవు. ప్రత్యక్షయుద్ధ మొనర్చియుండిన, మారామదేవుఁడు నిన్ను నీపిన్నబ్బకుంభకర్ణునికడ కంపియుండునే. ద్రోహీ! రాక్షసాధమా! (రామలక్ష్మణులఁ గాంచి) అక్కటా! రామచంద్రా! నీవు నిక్కముగఁ గోపించితి వేని లోకపాళి భస్మము గాదే. అట్టినీవును నీదనుజునస్త్రమునకుఁ గట్టువడితివే! ఇఁక సామాన్యులగతి యేమి యన నేల? హా!—నే నేల యిట్లు చింతిల్లవలయు. ఇప్పుడే పోయి యీరావణమేఘనాదుల నాతోఁకఁ గట్టి సముద్రమున వైచెద. ఈలంకాపట్టణము నంతయుఁ బెకలించి నీటఁ గలిపెద.—(చుట్టుఁ జూచి) అక్కటా! ఆద్రోహి యింద్రజిత్తు మరలఁ గరదీపిక గొని యీవంకకే వచ్చుచున్నవాఁడు. రానిమ్ము. నే నిట్లే పండియుండి యీమహామాయావి నేమఱించి పైఁబడి మెడ నొక్కి చంపెద. (మునుప టట్లు పరుండును.)

[విభీషణుఁడు (కరదీపికఁ గొని) ప్రవేశించుచున్నాఁడు.]

విభీషణుఁడు:—అక్కటా! నేఁ డేమి యీప్రళయము! వానరలోక మంతయు నింద్రజిద్బ్రహ్మాస్త్రమునఁ గట్టువడి నేల వ్రాలెను. ఇట్టిదుర్గతి గలుగఁగల దని కలనైనఁ దలఁపఁ గదా! రామలక్ష్మణు లెట్లయిరో కదా. (అని పరికించి రామలక్ష్మణు లుండుచెసఁ జూచి చెంత కేగి వారినిఁ దడవు పరిశీలించి కాంచి) (స్వగతము) ఈయిరువురు నూరక బ్రహ్మాస్త్రసమ్మానంబునకై సొమ్మసిల్లిన ట్లున్నారు. తక్కినవానరవరులలో నెవ్వరు జీవంబులతో నున్నవారలో యరసెదఁ గాక. (సుగ్రీవునికడ కేగి) వానరాధీశ్వరా! సుగ్రీవా!—ఈతఁడు నిర్జీవుఁ డైన ట్లున్నవాఁడు. (అంగదుకడ కేగి) అంగదా!—ఈతఁడు ను నట్ల యున్నవాఁడు.

హనుమంతుఁడు:—(స్వగతము) ఈతఁడు విభీషణుఁడు. నే నూరక దూరమున నీతనియాకృతిఁ గాంచి యీతని నింద్రజిత్తుగా నెన్నినాఁడను. ఆతనిపోలికలును గొన్ని యీతనికడ నున్నయవి గదా! (ప్రకాశము) రాక్షసేంద్రా! విభీషణా! (అని దగ్గఱుచున్నాఁడు.)

విభీషణుఁడు:—ఆహా! హనుమంతా! నీవు జీవించియున్నవాఁడవే! దురాత్ముఁ డగు నీయింద్రజిత్తు బ్రహ్మాస్త్రంబున నందఱఁ బడ నేసినాఁడు.

హనుమంతుఁడు:—రాక్షసేంద్రా! విరించి నా కిచ్చియుండువరముచేత నే నీబ్రహ్మాస్త్రబద్ధుఁడఁ గా నైతిని.

విభీషణుఁడు:—అట్లైన నింకను నీవానరానీకంబున నెవ్వ రెవ్వరు జీవంబులతో నున్నవారలో పరిశీలింతము రమ్ము—ఈవీరుఁ డెవ్వఁడు నిద్ర గూరిన ట్లున్నవాఁడు?

హనుమంతుఁడు:—(చూచి) ఇతఁడు మాయయ్య కేసరి. అంజనాదేవికి భర్త.

విభీషణుఁడు:—(ఇంకొకనికడ కరిగి) మఱి యితఁ డెవ్వఁడు? జీవంబు లెడలినట్లు యున్నాఁడు.

హనుమంతుఁడు:—ఇతఁడు వానరధన్వంతరి సుషేణుఁడు.

విభీషణుఁడు:—(జాంబవంతునిఁ దఱిసి) అక్కటా! ఈజాంబవంతుఁడు శరీర మంతయు నంపగములఁ గ్రువ్వఁబడి పడియున్నాఁడు. ఎంతటిశూరాగ్రేసరుఁ డితఁడు! ఎంతటిసచ్చరిత్రుఁడు! అక్కటా! కాలము గడవ నెవ్వరితరము! ఈవిరించినందనుఁ డూరకమూలుఁగుచున్నవాఁడు.—మహాత్మా! బ్రహ్మపుత్రా! జాంబవంతా!

జాంబవంతుఁడు:—ఎవ రట్లు పిల్చువారు? విభీషణా! రాక్షసేశ్వరా! ఇంద్రజిత్ప్రయుక్తక్రూరశరములు నాయంగములం దంతటను నాఁటుకొని యున్నయవి. కన్నులు దెఱవనైనఁ గాకున్నవి.

చం. ఘనతరమేఘనాదవిశిఖంబులు దేహము నంగపాళిలో
సునిశితభంగి నాఁటుకొనెఁ । జొప్పడ దొక్కసుమంత కన్నులై
నను దెఱవంగ నీధ్వనిని । నామదిఁ గంటి విభీషణుండ వం
చును దనుజేంద్ర నిన్ను నిటు । చోద్యపుయుద్ధము గాంచ నెన్నఁడున్.

విభీషణా! నిక్కముగ నిట్టిమోసమును నిట్టిఘోరరణమును నే నెన్నఁడును గాంచ నైతిని.

విభీషణుఁడు:—అనఘాత్మా! నీకు ను నిట్టిఘోరరీతి పట్టెనే.

జాంబవంతుఁడు:—అది యుండనిమ్ము. హనుమంతుఁడు జీవముతో నున్నాఁడా చెప్పుము.

విభీషణుఁడు:—ఏమి మహాత్మా! ఇట్లడుగుచున్నాఁడవు? నా కాశ్చర్యము గొల్పుచున్నది యీనీప్రశ్న!

చం. ఇనకులభర్త రాముఁడు న। హీనపరాక్రమశాలి లక్ష్మణుం
డనఘులు సూర్యపుత్రుఁడు ను। నంగదుఁడు న్మఱి వార్ధి సేతువుం
బొనరిచినట్టియానలుఁడుఁ। బోలఁగ నెందఱో యుండ వారి నె
ల్లను విడి యాంజనేయుఁ బది। లంబుగఁ బృచ్ఛయొనర్చి తేట్లొకో.

జాంబవంతుఁడు:—రాక్షసేంద్రా! నీ వాహనుమంతునిమహిమ యెఱుఁగక యిట్లాడుచున్నాఁడవు.

తే. గీ. అలమహాబలనందనుం। డైనహనుమ
జీవముల నున్న మన మెల్ల। జీవితులమె
యామహాత్ముఁడు లేకున్న । నఖిలకీశ
వరులు బ్రదికియుఁ జచ్చిన। వారె యయ్య.

విభీషణుఁడు:—మహాత్మా! అయిన నిదే యాహనుమ.

హనుమంతుఁడు:—(జాంబవంతునికడ కరిగి) మహాత్మా! బ్రహ్మనందనా!

క. వచ్చితి హనుమంతుఁడఁ గను
విచ్చి ననుం జూడు యోధవీరాగ్రణి నీ
హెచ్చుబలమునకు ఫలమే
యిచ్చటఁ బడి యున్కి ధాత కే నేమనవచ్చున్.

జాంబవంతుఁడు:—మరున్నందనా! రమ్ము. (అని దగ్గఱకు రాఁదీసికొని మెయి నివురుచు) హనుమంతా! నేఁ డీకపిసైన్యమును నరేంద్రనందను లగు సీరామలక్ష్మణులను నెల్లరను బ్రదికించుట నీచేత నున్నది సుమా.

హనుమంతుఁడు:—ఊరక న న్నేటి కిట్లగ్గించెదవు. చెప్పుము మహాశయా నే నేమి చేయవలయునో. నాచే నేమి గావలయునో యానతి యిమ్ము. నీపంపు దలఁ దాల్చి చేసెదను.

జాంబవంతుఁడు:—వత్సా! మహాబలనందనా! నీ వీక్షణమే వియత్పథమున నుత్తరదిశ కేగుము. అరిగితి వేని హిమవంతము డాసెదవు. ఆహిమవత్పర్వతరాజంబు గడచి యుత్తరమే పొమ్ము. అటఁ గైలాసంబును దాని కుత్తరంబున మేరువును గందువు. ఆరెండుకొండలనడుమ ద్రోణాద్రి నోషధులు పెక్కులు గలవు. నిజప్రభలచే నెల్లెడలు వెలింగించుచుండు మృతసంజీవని సంధానకరణి విశల్యకరణి సౌవర్ణకరణి నాఁబడు నోషధు లందుండును. అవి యిటకుఁ దెచ్చితివా, రాత్రిలోనన వీ రెల్లరు జీవింతురు.

హనుమంతుఁడు:—మహాత్మా! ఇదే నే నరిగి యయ్యోషధులఁ దెచ్చెద. అవి నా కెఱుంగరాకున్న నాకొండనే పెల్లగించుకొని తెచ్చెద. పోయివచ్చెద నానతిమ్ము. నమస్కరించువాఁడ.

(మ్రొక్కును.)

హనుమంతుఁడు:—

రామ రామ రామ రామ రామ రామ రాఘవా'' (నిష్క్రమించును.)

విభీషణుఁడు:—మహాశయా! ఈహనుమంతుఁ డీరాత్రియే వానిని గొని తేరఁగలఁడా! ఇప్పటికే యర్ధరాత్రము మీఱినది. నా కేమియో మదిని నమ్మకము గలుగదు.

జాంబవంతుఁడు:—విభీషణరాక్షసేంద్రా! హనుమంతునివిషయమున నీ వించుకంతయును సందేహింప రాదు. చెప్పినంతకంటెను నెక్కుడుగఁ జేయఁగల్గినవాఁడు. ఇప్పటికే యాతఁ డయ్యోషధులఁ గొని తెచ్చుచుండును. స్వబలము నెనుంగువోలె సీతఁ డెఱుఁగఁడు. వలయునన్న నీలంకాపట్టణమే సముద్రమున వైవఁగల లావుగలవాఁడు. ఇంతె యేల! నేలయు నింగియుఁ గ్రిందుమీఁదుగఁ జైసయెడలఁ దనతోఁకకొనఁ బెక్కుఁ దట్టఁగలవాఁడు. అతని నెన్నఁడు నసదుగఁ దలంపకుము. అతనిబలముననే యీప్రపంచము నిల్చియున్న దన నగును. అప్రమేయబుద్ధిమంతుఁడు సుమా హనుమంతుఁడు! నిరుపమానపరాక్రమోపేతుఁడు! అతఁ డిడిన యగ్గి లంకలోనింకను నారకున్నయది గదా!

(తెరలో దూరమునఁ గలకలము.. వానరులసింహనాదము.)

జాంబవంతుఁడు:—అదే వానరులసింహనాదము. హనుమ వచ్చుచుండును.

విభీషణుఁడు:—అదే వచ్చుచున్నాఁడు కొండయే కొని.

[హనుమంతుఁ డుక్తరీతి నాకసమునఁ బ్రవేశించును.]

(వానరులులేచి సింహనాదము చేయుదురు. రామలక్ష్మణులు లేచి చూతురు.)

(యవనిక పడును.)

---

## తృతీయాంకము.

## చతుర్థస్థలకము.

### ప్రదేశము—యుద్ధభూమి.

[మకరాక్షుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మకరాక్షుఁడు:—నేఁడు గదా నాకు సుదినము. రాక్షసాధీశ్వరుఁ డగు పఙ్క్తికంఠుఁడు నేఁ డీ రామునిమీఁదికి నన్నంపి నా కెంతయు నుపకారము చేసినవాఁ డయ్యెను. నేను లేనితఱి జనస్థానమున మాయయ్య యగు ఖరాసురు నీరాముఁడు చంపిననాఁటినుండి యారామునితో నా కెప్పుడు యుద్ధము గలుగునా యెన్నఁడు వానిని జంపి నాతండ్రి యప్పు దీర్పఁ గందునా యని యెల్లవేళలఁ జింతించుచుంటిని. నేఁ డది చేకూరెఁ గావున నా కిదియే సుదినము. ధనువు చేపట్టితిని. రణరంగము మెట్టితిని. రామునిఁ జంపఁ జేతికిఁ గంకణముఁ గట్టితిని. రామునిఁ జంపి కాని యుద్ధభూమి వీడనని తీఱనిప్రతిన పట్టితిని. ఇంక రాముఁడు రణరంగమున దిట్టయై నన్నెట్టులు తప్పించుకొనఁగలఁడో చూతును గాక. వీరస్వర్గ మలంకరించియుండు నో నాతండ్రీ! ఖరాసురేంద్రా! నీదూషణత్రిశిరులతోడ వియత్పథమున విమాన మెక్కి రమ్ము. నేఁ డాఖలు రామునిఁ జంపి తదీయరక్తమున జనస్థానమృతు లగు నానిర్జరారుల కెల్లరకు నీకొడుకగు నీమకరాక్షుఁడు తూరఫంగి దీపింప నెన్నఁడు నెవ్వఁడు నొనరింపనిరీతిఁ దర్పణ మొనరించును. ఆరాముఁడు నేఁ డెట్లును నాకంటఁ బడక పోఁడు. నే నెట్లును వానిఁ జంపక విడువను. నేఁడు గదా యారాముని శౌర్య మెఱుంగ నగును. ముసలు లగు ఖరదూషణత్రిశిరులఁ బొలియించినంతనే యతఁ డొక మేటిశూరుఁ డని యెంచికొని యున్నాఁడు. నేనం దుండి యున్నఁ గదా వానిశూరత తెలియుచుండు. నేఁ డెందుఁ బోఁగలఁడు. నా కారామునిపైఁ గల పగ యవ్వరిపైనను లేదు. కంపనప్రజంఘుల నంగదుఁడు చంపియుండిన నుండెఁగాక. యూపాక్షుని మైందుఁడు ద్రుంచియుండిన నుండెఁ గాక. శోణితాక్షుని ద్వివిదుఁడు నేలకుఁ దెచ్చియుండిన నుండెఁగాక. కుంభుని సుగ్రీవుఁడు కూల్చియుండిన నుండెఁగాక. నికుంభుని హనుమంతుఁడు మడియించియుండిన నుండెఁగాక. వా

మృతులకై యలిగి వారలఁ బొలియింప నన్ను రావణుఁ డంపియుండిన నుండెఁ గాక. రాము నిఁజంపి కాని నేఁడు నేను వే ఱెవ్వరను మార్కొనను. అప్పటికిఁ గాని లోలోన రవుల్కొనుచుండు నీక్రోధాగ్ని కొఱుట గల్గదు.-ఏఁడీ యాశూరంమన్యుండగు రాముఁడు. ఓరీ విపినాటులారా! ఏఁడిరా యాలినిఁ గోలుపోయిన వీరుఁ డగువిూరాముఁడు!

[హనుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

హనుమంతుఁడు:—ఎవ్వఁడవురా నీవు? దుర్మదాంధా! శ్రీరామచంద్రు నధిక్షేపించువాఁడ వఁటరా నీవు? నీప్రాణములు నీకుఁ దక్కవు సుమా. శూరుఁడ వైనఁ బోరాటఁ జూపవలయు నే కాని మాటలాట నేమి పౌరుషము తెలియవచ్చును రా ప్రేలరీ.

మకరాక్షుఁడు:—నీ వెవ్వఁడవురా క్రోఁతీ! శూరునివలెఁ బగ్గెలు వదరువాఁడవు?

హనుమంతుఁడు:—ఓహో! నన్నె యెఱుఁగవా? నే నీ రాక్షసకులవినాశకారణధూమకేతువను. నే నిడిన యాయగ్గి మీయాలంకలో నదె యింకను రాఁజుకొనుచున్నది చూడుము రా. కుంభకర్ణపుత్రుని నికుంభునిఁ జంపిన యారణావేశ మింతయైనఁ దక్కువ యగుటకు మునుపే నిన్ను వానికిఁ దోడుగఁ బంపెద రమ్ము.

మకరాక్షుఁడు:—ఓహో! దొంగవై నిశీథమున నెవ్వరెఱుంగక లంక సొచ్చినవీరశేఖరుఁ డగు హనుమవా నీవు. ఓరీ! వీరవానరా! నీయీకుప్పిగంతులు నాయెదుటసాగిరావు సుమా. ఖరాపుత్రుఁడగు నీమకరాక్షుఁడు శత్రుని రక్తమాంసములు గడుపార నించుకొని కాని మరలఁడు.

[శ్రీరాముఁడు (అధిజ్యధన్వుఁడై) ప్రవేశించుచున్నాఁడు.]

శ్రీరాముఁడు:—(స్వగతము) ఎవ్వఁ డీతఁ డూరక మాటలాడుచున్నాఁడు. (ప్రకాశము) హనుమంతా! ఎవ్వఁ డీరాక్షసవీరుఁడు.

మకరాక్షుఁడు:—నీవే కావా రాముఁడవు. జనస్థానమున ఖరదూషణత్రిశిరులఁ జంపినవాఁడవు.

శ్రీరాముఁడు:—జనస్థానమున మునుల కవమతి యొనర్చుచు భయము గొల్పుచుండు రాక్షసుల నెందఱనో శిష్టజనులయభీష్టములు నెఱవేర్పఁ గడతేర్చినవాఁడను. ఒక్కఖరదూషణత్రిశిరులమాటయే యేల యాడెదవు. నీ వెవఁడవు?

మకరాక్షుఁడు:—ఏ మాక్రొవ్వారినపలుకులు దానవక్షుద్రవీరులఁ జంపినంతకే శూరుఁడ ననియనుకొంటివా? నే నాఖరాసురశిఖామణికిఁ గుమారుఁడనురా.మకరాక్షుఁడను. నాఁడు నేను లేకున్నయెడ నీశూరత్వము లెక్క కెక్కఁగలిగె. నాయెదుటనై యుండినఁగదా నీపాటు తెలిసియుండును.

హనుమంతుఁడు:—నీయన్నదమ్ములను బంధుగులను నండఁటను గూడి నేల యిప్పుడు నితోడఁ బిలుచుకొని రావైతివిరా?

మకరాక్షుఁడు:—ఏమీ మిమ్ముఁ బరిమార్ప నింకఁటు వలయునా?

హనుమంతుఁడు:—పరిమార్పఁ గాదురా. భీరువు లగువారు నీవలెనే నాఁడునా? నే నుండకపోయితిననియుఁ దన్నుఁ గొట్టిన మాయన్నను గొట్టకపోయితి ననియు నతని నడఁచిన మాయామను

గొట్టినఁ గదా తెలియుచుండె ననియు నా తనిఁ దాఁకిన నాకు నిక్కంబుగఁ గోపము రాదయ్యె ననియు నిట్టులే యేవో వంకలు పెట్టి మాటలాడుదురు. అట్టి దేదియుం బుట్టకుండుటకై యంపఱను సేల కొనిరావయితి వని యడిగితిని.

మకరాక్షుఁడు:—చాల నలసితివి. ఇంక నూరకుండుము. ఓరీ! రామా! నీ వేమో కడు శూరుఁడ వని యనుకొనుచుండువాఁడ వఁట. చూడ నెంచితి నీశూరత. నాయెదుట నీయుక్తులు, నీబింకము సాగిరావు సుమా.

ఆ. వె. మబ్బువంటినిన్ను । మార్కొని యెగఁ జిమ్మ
నేను గాలి నగుదు । నింత నిజము
నన్ను నెదిరి పోరి । పన్నుగఁ బ్రాణముల్
నిలుప నగునె నీకు । నిలుము రామ.

క. ఏ నప్పుడు లేమి జన
స్థానంబున విక్రమింపఁ । జనియె న్నీకుం
బో నగునె నాదునెదుట న
నూనపరాక్రమము సూపు । మొయ్యన రామా!

ఉ. ఎప్పుడు కందు రాఘవుని । నెప్పుడు సంగరమందుఁ గౌతుకం
బొప్పఁగ వానిఁ జంపఁ గలనో మఱి యెప్పుడు నాపితౄణముం
దప్పక దీర్తునో యనుచుఁ । దాలిమిఁ గాలముఁ బుచ్చుచుండి యిం
దిప్పుడు గంటి ని న్నెడపి । యిప్పుడ యప్పును దీర్తు వడ్డితోన్.

రాముఁడు:—

ఆ. వె. చేటు గాన కిట్లి । సీ కండక్రొవ్వున
వలసినట్టు లెల్ల । వదిరె దీవు
పలుకులందుఁ గలదె । వైరిజయం బది
కదనమాటయందుఁ । గలుగుఁ గాని.

క. ఖరునిన్ దూషణుఁ ద్రిశిరునిఁ
బరఁగం జంపుటయు నొక్కపనిగా దిదె నిన్
బోరి గొని ఘూకాదులకును
నెర యిచ్చెద నీశరీర । మెల్లను నిలుమా.

(పోర నుద్యుక్తు లగుదురు.)

(యవనిక పడును.)

---

# తృతీయాంకము.

## పంచమస్థలకము.

[ప్రదేశము—యుద్ధభూమి]

[శ్రీరామలక్ష్మణులు, సుగ్రీవుఁడు, జాంబవంతుఁడు, అంగదుఁడు, నీలుఁడు, నలుఁడు మొదలగువానరవీరులు ప్రవేశించుచున్నారు.]

సుగ్రీవుఁడు:—మాయావి యగు ఖరకుమారుఁడు మకరాక్షుఁడు చచ్చెను. ఇంక నీమహామాయావి యగు నింద్రజిత్తొక్కఁడు చచ్చెనా రావణుఁడు బ్రదికియుండియుఁ జచ్చినవాఁడే.

శ్రీరాముఁడు:—వాఁ డిందాఁక మాయఁబూని వానరానీకము నంతను గాసిపఱచుచు మమ్మిద్దఱ శరాసారంబున ముంచుచుండినప్పుడు వానిఁ జంపఁ దలఁచి లక్ష్మణునకుఁ జెప్పుచుంటిని. అంతలో వాఁడు రణరంగమే వీడిపోయెను. నిశ్చయముగ నీమహామాయావి చచ్చెనేని రావణుఁడు హతుఁడే. లంక వీనిభుజాయుగబలమున నిలిచియున్నయది యింకను. వీఁడు సురలకును నజయ్యుఁడు.

లక్ష్మణుఁడు:—సురల కజయ్యుఁ డైనను మన కజయ్యుఁడు గాఁడు. ఇప్పుడు నా కానతిమ్ము. మేఘనాదుఁ దుదిముట్టించి వచ్చెదను.

[హనుమంతుఁడు (ఏడ్చుచుఁ బరుగున) ప్రవేశించును.]

హనుమంతుఁడు:—పోయినది. మాతల్లి పోయినది. మాలక్ష్మి పోయినది.

(వెక్కి వెక్కి యేడ్చును.)

[అందఱు వెఱఁగందుదురు.]

శ్రీరాముఁడు:—వత్సా! హనుమంతా! ఏమి నీయాందోళనము? ఏమి పోయినది? ఏలక్ష్మి పోయినది?

హనుమంతుఁడు:—అయ్యో దేవా! నే నేమి చెప్పుదును. పాపాత్ముఁ డగు నాయింద్రజిత్తు లోకైకమాత యగు సీతాదేవిని రణరంగమున కీడ్చుకొనివచ్చి మే మెల్లగ మాక్రోశించుచుండఁ దలగోసినాఁడు.

శ్రీరాముఁడు:—హా! సీతా!

(మూర్ఛిల్లును. లక్ష్మణుఁడు కూర్చుండి శ్రీరామునిశిరమునకు నిజాంక ముపధానముచేసి యతని మెయి నివురుచుండును.)

నీలుఁడు:—హనుమంతా! నిక్కముగ సీతను జంపెనా?

హనుమంతుఁడు:—అయ్యో! నిక్కముగఁ జంపె నయ్యా.

నలుఁడు:—నీవు చక్కఁగఁ జూచితివా! ఆమె సీతయే యగునా? వే ఱొకకాంతకైన సీతవేషము వేసి తెచ్చినాఁడా?

హనుమంతుఁడు:—ఇ దేమి యీావలవని ప్రశ్నములు? ఆతల్లిని నే నెఱుఁగనా? దురాత్ముఁ డగు నాయింద్రజిత్తు సీతాదేవినే చంపినాఁడు. ఆదేవి యెంత విలపించెను. "రామా! రామా!" యని భర్తృనామస్మరణము చేయుచు నాలోకమాత యీలోకము విడిచెను.

లక్ష్మణుఁడు:—అక్కటా! ఏమి యీకాలమహిమ. ధర్మమున కన్నివెంటల నపజయము, నధర్మమునకు జయము గలుగుచున్నది. మంచి గుణము లుండువారికిఁ గుశలము లేదు. దుర్గుణము లుండువారికి దుఃఖము లేదు. పితృవాక్యపరిపాలనమునకై పూని రాజ్యపరిపాలనము మాని తపసివేషముఁ బూని యడవులఁ జొచ్చినంతనే యీరామున కట్టిసౌఖ్యము కలిగె! ప్రియకాంతను గోలుపోవలసివచ్చెనే. రామచంద్రా! నీశాంతతకు నీసద్గుణములకు నీశౌర్యౌదార్యములకు నన్నిటికి నిదియా ఫలము! నా కానతిమ్మంటినే యీదుష్టమేఘనాదునిఁ జంప. ఏల యీవైతివి. కైకకోరిక సీతామరణంబుతో నెఱవేఱెనా. ఔరా! దుర్విధిపరిపాకము!

[విభీషణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విభీషణుఁడు:—(శ్రీరాముని దక్కనయెల్లరను జూచి) ఏల యీరీతిని మీ రెల్లరు ఖిన్నులై చేష్టలు దక్కియున్నారు? శ్రీరామదేవుఁ డేల యీరీతి మూర్ఛిల్లె? నా కేమియుఁ దోఁపకున్నది.

సుగ్రీవుఁడు:—రాక్షసేంద్రా! ఏమి చెప్ప మనెదవు. ఈయుద్ధమే యింక వ్యర్థమయ్యెఁ జుమా.

విభీషణుఁడు:—ఏమి! ఏమి! యుద్ధమే వ్యర్థమా? ఏమి యట్లంటివి?

సుగ్రీవుఁడు:—అయ్యో! నేఁ జెప్పఁజాల. నీయన్నకొడుకగు నామేఘనాదహతకుఁడు... (దుఃఖము) హనుమంతా! నీవే చెప్పుము.

హనుమంతుఁడు:—అయ్యో! ఏమని చెప్పుదు. ఎవ్వతెకొఱకై శ్రీరామచంద్రుఁడు వానరాధిపతియగు నీసుగ్రీవునితో నగ్నిసాక్షికముగ నెయ్యము పూనెనో, యెవ్వతెకొఱకై నిఖిలకీశవరులు నానాదిక్కుల నెల్లయెడలఁ గ్రుమ్మరిరో, యెవ్వతెకొఱకై నాచేత సింహికయు లంకయు నక్షకుమారాదిరాక్షసవీరులును హతులైరో, యెవ్వతెకొఱకై యేను లంకాపట్టణమున నగ్గియిడితినో, యెవ్వతెకొఱకై సముద్రతరణమున కనువైన సేతు వీనలుఁడు నిర్మించెనో, యెవ్వతెకొఱకై నీవు లంకకు రాజుగ నభిషిక్తుఁడవైతివో, యెవ్వతెకొఱకై యీ తొమ్మిదినాళ్లు నరవానరాసురుల కసమయుద్ధంబు పొసఁగియున్నదో, యాసీతామహాదేవిని దుష్టకష్టనికృష్టాత్ముఁ డగు నానీచ మేఘనాదుఁడు రణరంగమున నెల్లరును వలదు వలదని వారించుచుండినను వినక తల ద్రుంచెను. (దుఃఖించును.)

లక్ష్మణుఁడు:—ఆవార్త విని శ్రీరామచంద్రుఁడు పిడుగడఁచినవడువునఁ బుడమిని మూర్ఛపడినాఁడు.

విభీషణుఁడు:—అక్కటా! ఇది యెంతైన నిక్కపుఁగృత్య మని నమ్మితివా? వాఁడు మహామాయావి యగుఁ గదా.

శ్రీరాముఁడు.—(మూర్ఛ దేఱుచు) హా! జానకీ! నీముద్దుమొగ మింకెట్లు చూడఁగలను!

విభీషణుఁడు:—రామదేవా! ఇప్పుడీవార్త నిక్క మని నమ్మితివా? ఇది యెన్నఁడైన జతపడునా? అగ్నిశిఖ వోలె నెట్టివారికిని నంటరాక యలరారు నామహాదేవిని మేఘనాగుఁ డంటి రణరంగమున కీడ్చుకొనివచ్చి కుత్తుక యుత్తరించెనా? వలయు నని తెచ్చిన యారావణుఁడే యేమివిధములనైనను నాతల్లి నంటఁ జాలకున్నాఁడు. ఇంక వీఁ డామెను జంపెనా? కల్ల. ఆమాయావి చేయు కపటకృత్యము మీ రెఱుంగక యూరక యాయుచ్చులఁ జిక్కి బమ్మరించుచున్నవారలు. మాయాసీతను దెచ్చి యానీచుఁ డట్లు జాలము చేసి మిమ్ము మోసగించినాఁడు.

శ్రీరాముఁడు:—అట్లు చేయుటచే వాని కగులాభ మేది?

విభీషణుఁడు:—మున్ను వైశ్వానరుఁడు వీఁ డెప్పుడు నిర్విఘ్నముగ నికుంభిలకడ హోమము చేసి తన్నారాధించునో యప్పుడు వానికి నవధ్యత్వంబు గల్గింపఁ జాలు దివ్యకాంచనరథంబును దివ్యధనుశ్శరంబులును ననుగ్రహించునట్లు వర మిచ్చియున్నాఁడు. ఇప్పుడు మిమ్మిట్టిదుఃఖ సముద్రమున ముంచివైచి మీ రెల్లరును దేర్కొనునంతలో నికుంభిలయందు నిర్విఘ్నముగ హోమారాధనము నెఱవేర్పఁ బోయి యున్నాఁడు. ఆహోమవిధి పరిపూర్తియగునంతలో నాతనిఁ బరిమార్పవలయును. వేళ తప్పెనా పిదప వానిని సురాసురులును జంప లేరు. దేవా! యీలక్ష్మణకుమారుని సైన్యముతోడఁ బంపుము. చాలును. నేను గూడఁ బోయెదను. వానిఁ జంపి కాని మరలము.

శ్రీరాముఁడు:—విభీషణా! నీయుక్తులు యుక్తియుక్తములు. లక్ష్మణా! నీయన్న యగు నీవిభీషణుఁడు బాసటగ హనుమదాదు లగు నీకపివీరులు తోడుగ నిప్పుడే వెడలి యాపాపాత్ము నింద్రజిత్తుఁ జంపి రమ్ము. పొమ్ము. విజయ మంది వచ్చి నాసన్మానము వడయుము.

లక్ష్మణుఁడు:—దేవా! నీ వెప్పుడు వానివధమునకు సమ్మతించి నిశ్చయించితివో యప్పుడే యాదు రాత్ముఁడు చచ్చినవాఁడు. అనతిమ్ము పోయివచ్చెదను. (నమస్కరించును.)

శ్రీరాముఁడు:—(లేవనెత్తి) వత్సా! విజయివి గమ్ము. సోదరా! విభీషణా,యీనీతమ్మున కీవు బాసట. కపివీరులారా! వెడలుఁడు.

(లక్ష్మణాదులు యుద్ధమునకుఁ దరలుదురు.)

(యవనిక పడును.)

---

## తృ తీ యా ం క ము.

### ష ష్ఠ స్థ ల క ము.

ప్రదేశము—నికుంభిల (హోమవాటిక)

[ఇంద్రజిత్తు (హోమముచేయుచుఁ బవేశించును.]

రాక్షసు లతనిచుట్టును గావలియుందురు.]

[అప్పుడు హనుమంతుఁడు వానరసైన్యముతోఁ గూడఁ బ్రవేశించుచున్నాఁడు.]

హనుమంతుఁడు:—ఓరీ! మహామాయావీ! మేఘనాదా! నీశౌర్యమునకు వైశ్వానరారాధన మొక్కటి వెత్తి యయినదా. దురాత్మా! నీమాయ లింకఁ బనికిరావు. రమ్ము. హనుమంతుఁడు నీపాలిటికి నేఁ డంతకుం డగును.

(అని చెంత కేగఁ బూన నక్కడి రాక్షసులు హనుమంతు నడ్డగింతురు. వానర రాక్షసులు కొట్టుకొందురు. రాక్షసులు హతు లగుదురు. అప్పుడు మేఘనాదుఁడు లేచి హనుమంతుకడకు వచ్చును.)

పాపాత్మా! స్త్రీలఁ జంపఁ బూనిన నీ కార్యమునకుఁ దోడుగ వైశ్వానరారాధనము వల సెనా? మాయావీ! ఇంక నీమాయలు సాగిరావు సుమా. నిర్విఘ్నముగ నికుంభిలయందు హోమము నెఱపవచ్చితివా? దానికై మాయాసీతను తలఁద్రెంచి మాకుఁ గన్నులు గప్ప వచ్చితివో!

[దూరమున విభీషణుఁడు (లక్ష్మణునికి హోమకుండముఁ జూపుచుఁ) బ్రవేశించుచున్నాఁడు.]

విభీషణుఁడు:—లక్ష్మణదేవా, చూచితివా యీదుష్టునిపన్నుగడ. అదె చూడుము. కించిదవశిష్టముగ హోమకార్యము నెఱపఁబడినను దత్కుండమధ్యభాగమున నిప్పు డిప్పుడే యొక్క కాంచన రథము వెడలుచున్నది.

లక్ష్మణుఁడు:—(స్వగతము) ఆహా! ఎంతటిమాయగలాఁ డీతఁడు! (ప్రకాశము) ఓరీ! మాయలమారీ! యింక నీమాయలు పనికిరావు. రమ్ము. నీకుఁ గాలాకృతిని వచ్చిన నన్ను మార్కొని ప్రాణములు విడువుము.

ఇంద్రజిత్తు:—(విభీషణువంకఁ గాంచి) (తనలో) ఇది యిక్కులద్రోహిపన్నాగము. తొలుత వీనిఁ జంపి పిమ్మట వైరిఁ జంపుదుఁ గాక. (అని చెంత కేగి) (ప్రకాశముగ) విభీషణా! బిడ్డలఁ జంపింపఁ దివురు నీవంటితండ్రులు నుందురా? ఇది పితృధర్మ మగునా?

తే. గీ. రాక్షసాధీశ్వరుం డైన । రావణునకుఁ
దమ్ముఁడవు గాన నా కీవుఁ । దండ్రి వైతి
తనయులనుఁ గీడు కోరెడు । తండ్రు లెందుఁ
గలరె నీ కేల కలిగెనీ । కానిబుద్ధి.

శౌర్యము మాలిన నీవు పుట్ట ఘనపౌరుషయుక్తం బగు నీరాక్షసవంశమున కంతకును నపకీర్తి కలిగెను.

క. స్వజనులఁ ద్యజియించుట
యన్యజనంబులపొత్తు మనుట । యను నీరెండుగ్
సుజనులు దూఱరొకో నీ
చజనులకడ మనఁగఁ గోరి । శౌర్యం బగునే.

తే. గీ. అరయఁ దమవారు దుర్గుణు । లైనఁ గాని
పరులు గుణవంతు లయ్యును । స్వజనవాస

మన్యజనయుక్తికంటెను నరయ మేలు
పరుల సేవించు టెందును బౌరుషంబె.

దురాత్మా! ఇక్కడ నీ కేమి దక్కువ యయ్యె? ప్రభుపదము వీడి భృత్యపద మవలంబింప నీ కే మంత దుర్విధి గలిగె?

తే. గీ. సర్వసౌఖ్యాకరం బగు స్వర్గమునను
భృత్యుఁ డయి యుంట యెప్పుడు హితము గాదు
సర్వవిధకష్టములకు నుస్థాన మైన
నరకమున నైనఁ బ్రభుత యే నాణ మగును.

కులద్రోహీ! నీవు పరుల నాశ్రయించి నీవారిగుట్టెల్లఁ బరుల కెఱిఁగించి నీస్వజననాశము గూర్చుచున్నాఁడవె. ఎవ్వఁడు పరులపొత్తు చేరి స్వపక్షజనులనాశ మొందించునో, వాఁడు తనజనులు చెగినపిమ్మట నిస్సహాయుఁడై యాపరులచేతనే తానును నాశ మందును. నీగతియు నట్ల కాఁగలదు.

విభీషణుఁడు:—దురాత్మా! రావణీ! నాశీల మెఱుఁగనివానికరణి నూర కేల యిట్లు ప్రేలెదవు. రాక్షసకులమునఁ బుట్టియును నేను గ్రౌర్యము మాని సౌజన్యము నూనియుండుట నీ వెఱుఁగవఁటరా కుమతీ.

ఉ. మానక యెల్లవేళలఁ గుమార్గము వట్టి యధర్మకార్యముల్
పూని యొనర్తు రీర లది పోలదు నా కొనరింపఁ జాల నే
మానుప మీదురధ్వముల మైకొని సద్గుణు రాముఁ జేరితిం
బూనునె దుష్టు లౌజనులపొత్తు మనంగను సజ్జనుం డిలన్.

అధర్మశీలురు నిర్మర్యాదకులు ననార్యులు పాపనిశ్చయులు నైనమిమ్ము దుష్టసర్పముల నటు విడిచి సుఖింపఁ దలఁచితిని. వంశక్షయకారణంబు లగు హింస, పరస్వాపహరణము, పరాంగనాభిమర్శము, దురాచారము నను నీనాల్గును మీకుఁదోడఁ బెట్టినట్టివై యున్నయవి. మహర్షివధమును, సాధునిర్జరనిగ్రహంబును, దురహంకృతియును, గోపమును, దీర్ఘవైరమును, బరాభివృద్ధి కెద నసహ్యభావమును నను నీదుర్గుణంబులు ఘనాఘనంబులు పర్వతంబుల నట్లు మీయయ్య రావణునిగుణంబులఁ గ్రమ్ముకొనియున్నవి. అవి తనకు నైశ్వర్యహానియుఁ బ్రాణహానియుఁ గలిగించునని యెంతెంతయో వచించితిని. నీతి బోధించితిని. అతఁడు వినక నన్ను నిరసించెను. ఇప్పు డిట్టి ముప్పులకుఁ బాలయ్యెను. దుర్మదాంధుఁడవు, దురభిమానివి, దుర్వినీతివి, దురాచారరతుఁడవు నైన నీవు రావణునకుఁ బుత్రుఁడవై జన్మించుటచేత నింత పుట్టెను. ఇంకే మనుకొన్న నేమి? గాలము మ్రింగినచేఁప యెట్లు తప్పించుకొనఁగలదు! దురాత్మా! లక్ష్మణదేవుఁడు నేఁడు నీ కంతకుండై తోతెంచియున్నవాఁడు. ఇంక నీకు మునుపటట్లు లంక కేగుటగాని హోమము సేయుటకు మరల నామట్టికడకుఁ బోవుట గాని మాయలు పచరించుట గాని కాదు సుమా. పరాక్రమధనుండైన యాతనితోఁ బోరి యసువు లెడలఁ గాలావాసంబునఁ గింకరుఁడవు గము.

ఇంద్రజిత్తు:—చాలింపుము నీవ్యర్థప్రలాపములు. ఇదే మిమ్మెల్లర నొక్కక్షణమున నాయమనిలయ భృత్యులనుగాఁ జేసెదను.

(అని యెల్ల వారిఁ గలయఁగనుంగొని)

శా. చండప్రక్రియ మద్భుజాబలమునన్ ׀ శౌర్యంబు దీపింపఁ గో
దండం బెక్కిడి కాలమేఘముక్రియన్ ׀ దట్టంపుబాణాంబువుల్
నిండ న్నేఁ గురియించి మిమ్ముల నిదే ׀ నిర్జీవులం జేసెదన్
రండో వీరుల లేని న న్నెదిరి సం׀గ్రామంబునుం జేయఁగన్.

అగ్నికీలలు తూలరాశి నేర్చునట్లు మత్కార్ముకప్రయుక్తప్రచండశరాళి మీతనువుల నీఱు సేయు నుండుఁడు.

లక్ష్మణుఁడు:—ఓరీ! దానవాధమా!

ఉ. ఆడినయంత చేయఁ గల׀యట్టి మహాబలుఁ డేమి పల్కినం
జూడఁగఁ గొంత లెస్స యగు ׀ శూరత మాలు భవాదృశుండు తా
నాడు టశక్తదుర్జనత ׀ యాడినయట్టులె చేయ నోపుదే
నోడక నిల్వు న న్నెదిరి ׀ యుద్ధమున న్నినుఁ బిల్కుమార్చెదన్.

ఇంద్రజిత్తు:—ఓహో! శూరునివలెనే మాటలాడుచున్నవాఁడవే నీవు. మొన్న మిమ్ముల నేను నాగాస్త్రంబులఁ గట్టిపడవైచినపు డే గిరికందరమున సుప్తిఁ జెందియుండె నీపౌరుషము. నాఁటివలెఁ గాదు నేఁడు. రమ్ము రమ్ము. శూరుఁడ వేని రణమున నీశౌర్యముఁ జూపుదువు గాని రమ్ము.

లక్ష్మణుఁడు:—నాశౌర్య మీవేమి యెఱిఁగెదవు. నీయనుఁగుఁదమ్ముఁ డతికాయుఁ డెఱిఁగియున్నవాఁడు. ఇంక నీకును నెఱింగింతును గాచికొమ్ము. ఊరక మాటల నేమి పని గలదు? వాగ్వాదము మాని శరవాద మొనరింపుము.

ఇంద్రజిత్తు:—ఓరీ! డింభకా! నిన్న బ్రహ్మాస్త్రమునఁ గట్టువడినపుడు నిన్ను దయమైఁ జంపక విడిచిన నింత పుట్టె. ఇదె నీపని తీర్పఁగలను. లెమ్ము.

లక్ష్మణుఁడు:-—(స్వగతము) ఈతఁడు నిక్కముగ శూరుఁడు. వీనిని వేగమె తుదిముట్టింపవలయును.

ఇంద్రజిత్తు:-—(స్వగతము) ఏను రథ మెక్కి వచ్చి వీనిఁ గుని మెదఁ గాక.

(నిష్క్రమించుచును.)

విభీషణుఁడు:—వానరవీరులారా! ఇక్లెంతదనుకఁ జూచుచు నూరకుండెదరు. రావణుని కీడురాత్మఁ డేజీవిత మన్నను బ్రాపన్నను. మీరెల్లరుఁ గసిమసఁగి వీనిసైన్యముం బొదివి చంపుఁడు. పిన తండ్రియైన నాకుఁ దనయునిఁ జంపుట మేలు గాదు. తాఁ జంపుటయు నొక్కరిచేఁ జంపించుటయు నొక్కటియే. పాపమైనను రామకార్యార్థ మిది పరమహితము గాన లక్ష్మణదేవుని చేత వీనిఁ జంపింతును. మీ రెల్లరు నీకర్బురబలముఁ జంపుఁడు. (జనాంతికముగ) రాజకుమారా! సూర్యుఁ డపరాంబుధిఁ గ్రుంకుచున్నాఁడు. రాత్రివేళ వీనికిఁ బౌరుషము హెచ్చును. శీఘ్రముగఁ జంపుము. ఆహా! వీనినేర్పు గంటివా? ఇంతలోఁ బురి కేగి రథ మెక్కి వచ్చుచున్నాఁడు.

లక్ష్మణుఁడు:—(స్వగతము) ఆహా! ఏమి వీనిరణవ్యాపారచమత్కారము. ఇంక వీనిఁ జంపక యుంపరాదు. (అని బాణము సంధించి (ప్రకాశము)

శ్లో. ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది,
పౌరుషే చాప్రతిద్వంద్వ శ్శరైనం జహి రావణిమ్.

తే. గీ. బాణమా! రామచంద్రుఁడు పౌరుషమున
నప్రతిద్వంద్వి యేని ధర్మాత్ముఁ డేని
దాశరథి యేని సత్యతత్పరుఁడు నేనిఁ
జంపుదువు గాక రావణి సమరమునను.

[బాణమేయును. వానరులు మేఘనాదుఁడు చచ్చె మేఘనాదుఁడు చచ్చెనని సింహనాద మొనర్తురు. హనుమ రక్కసులఁ దఱుమును. వారు పరువెత్తుదురు. అప్పు డేడ్చుచు సులోచన ప్రవేశించి లక్ష్మణుపాదములపైఁ బడి]

సులోచన:—తండ్రీ! నేను నీతనయను సులోచనను. ఎంతదుష్టుఁడైనను నీయల్లుఁ డగు మేఘనాదుఁడు నాభర్త. నీచేతులార నీయల్లునిఁ జంపి కూఁతునకు వైధవ్య మాపాదించితివే. నే నేమి చేయుదానను.

లక్ష్మణుఁడు:—దుర్మార్గుఁ డగువాఁ డల్లుఁ డగుఁగాక. కొడు కగుఁ గాక. సైరింపరాదు. ఊఱడుము.

సులోచన:—జనకా! అతఁ డెట్టివాఁడైనను నాకుఁ బతి. పతివ్రతలకుఁ బత్యనుగమనము విహితకార్యము. నా కాజ్ఞ యిమ్ము. నాపతితోడ సహగమన మొనరించెదను.

లక్ష్మణుఁడు:—సహగమనము ధర్మవిహిత మని నే సమ్మతింపఁ జాలను. ఆత్మహత్య గలిగించుకొనుట యొకప్పుడు పాపకరమును మఱొకప్పుడు గాక పోవుటయునా? సులోచనా! ప్రకృతికిఁ జచ్చినవాఁ డయ్యు నీభర్త నీకు సర్వవేళలఁ దోఁచుచుండుఁ గాక. ఆదిశేషునిపుత్రిక వగు నీకు వైధవ్యము కలుగునే?

సులోచన:—నీ వాయాదిశేషుఁడవు గావా? తండ్రీ! నీయనుగ్రహ మగణ్యము. ఇఁక నేను నాగలోకమున కేగెద.

(అందఱు నాశ్చర్యపడుదురు.)

(యవనిక పడును)

శ్రీ

# శ్రీరామపట్టాభిషేకనాటకము.

## చతుర్థాంకము



### ప్రథమస్థలకము.

[ప్రదేశము యుద్ధభూమి.]

[రంభానలకూబరులు ప్రవేశించుచున్నారు.]

రంభ:—నాకేమో భయ మగుచున్నది చూడు మాకుఁగ్రుఁడెట్లు కన్నుల నిప్పులు రాల విభీషణుని మీఁదకుఁ బోవుచున్నాఁడో?

నలకూబరుఁడు:—రావణుఁడు కుమారు నింద్రజిత్తును జంపెను నని విభీషణు నిందించుచున్నాఁడు. భీతిలకుము.

రంభ:—వాఁడే చూడుము లక్ష్మణుఁడు విభీషణుని వెనుకకుఁ ద్రోఁచికొని వచ్చి రావణుని డీకొనుచున్నాఁడు.

(తెరలో లక్ష్మణుఁడు)

ఓరీ! చోరచక్రవర్తీ! మాయండఁజేరిన మావిభీషణుని మేము జీవించియుండఁగనే శక్తివైచి చంపఁ జూచితివా? మా మేనులఁ బ్రాణము లుండునందాఁక నాపని కొంజాలదు సుమా?

రంభ:—నాథా! వింటివా లక్ష్మణునిపలుకులు. ఆపన్నజనరక్షకులు సుమా దశరథనందనులు.

(తెరలో రావణుఁడు)

లక్ష్మణా! ఊరక చావకుము. విభీషణుని విడుము. లేకున్న నీరావణశక్తి నిన్నుఁ బ్రాణములతో విడువదు.

నలకూబరుఁడు:—చూడు చూడు లక్ష్మణుఁడు రావణుని మార్కొనుచున్నాఁడు.

రంభ:—ఆహా! శక్తి వైచినాఁ డీక్రూరాత్ముఁడు లక్ష్మణకుమారునిమీఁద—హా! రాజకుమారుఁడు నేలఁబడెను.

నలకూబరుఁడు:—అకటా! ఎంత పుట్టెను—వాఁడే రామచంద్రుఁడు క్రోధమూర్తియై రావణుని పైకిఁ బోవుచున్నాఁడు—అదే వానిని బాణముల ముంచినాఁడు.

రంభ:—రావణుఁడు చేయార్ప లేకున్నాఁడు చూడుము.

(తెరలో రావణుఁడు)

తే. గీ. పట్టపగటింటిభాస్కరుఁ బగిది రాముఁ
డుగ్రమూర్తియై వెలుఁగొందుచున్నవాఁడు
చండదీధితి చీఁకటుల్ చెండునట్లు
చెండు నన్నింక నీతఁడు గండు మిగిలి.

ఇప్పటికి లంకకు మరలి వెడలి వైశ్వానరు నారాధించి దివ్యము లగురథమును నాయుధంబులను బడసి వచ్చి వీరి మార్కొనుటే లెస్స. అదియే పోలినపని.

నలకూబరుఁడు:—ప్రియా! ప్రియా! వాఁడే నవైరియగు నారావణహతకుఁడు పరువిడుచున్నాఁడు. చూడుము. చూడుము.

రంభ:—ఆహాహా! అడిబీరపుఁదులువ శ్రీరాముని గెలువఁ గలుగునా?—అదే చూడుము శ్రీరాముని తమ్ముకడకు వడివడిఁ బోవుచున్నాఁడు. రమ్ము రమ్ము మన మటకుఁ బోదము.

(నిష్క్రమింతురు.)

---

చ తు ర్థాం క ము.

ద్వి తీ య స్థ ల క ము.

ప్రదేశము: యుద్ధభూమి.

(శ్రీరాముండు (మూర్ఛిల్లిన లక్ష్మణునిఁ బట్టి దుఃఖించుచును, విభీషణసుగ్రీవాదులతోఁ బ్రవేశించుచున్నాఁడు.)

శ్రీరాముఁడు:—లక్ష్మణా! నాముద్దులతమ్ముఁడా!

శా. అన్నా లక్ష్మణ నిన్నుఁ బాసి యిఁక నేలా యెట్టిసౌఖ్యంబులో
యన్నా జానకి యేల నాకు నది యేలా నాబహిఃప్రాణమా
నిన్నుం గూలిచి తల్లి కేమనుదురా నీకాంత కే మందురా
నన్నుం గూరిచి ప్రాణము ల్విడిచితే నాసద్గుణాంభోనిధీ.

సుషేణుఁడు:—దేవా! లక్ష్మణదేవునికై యమంగళము చింతింపకుఁడు. ఈ రాకుమారుఁ డించుకంత యు వన్నెమాయక చెన్నుదఱుఁగక యున్నవాఁడు. సన్ననియుచ్ఛ్వాసనిశ్వాసము లతని నాసికనుండి యుప్పతిల్లుచున్నవి. అదే యాతనియెద యించుకంత క్రిందికి మీఁదికిఁ దేలుచున్నయది. ఊరక యమంగళము శంకింపఁజనదు. నాడు లెట్లు చలనము గలిగియున్నవో చూడుఁడు. ఈతనికి రవి యుదయింపకముస్నే చికిత్స యొనరించిన మే లగును.

శ్రీరాముఁడు:—(చూచి) సుషేణా! నీ వద్వితీయమేధానిధివి. ద్వితీయధన్వంతరివి. నాముద్దులయ్య నెట్లయిన నాకు బ్రదికించియిచ్చి నాజీవము నిల్పుమా.

సుషేణుఁడు:—హనుమంతా! మున్ను మేఘనాదుఁడు బ్రహ్మాస్త్రముఁ బ్రయోగించిననాఁడు తెచ్చితివే యాద్రోణగిరి కరిగి యందు వెలుఁగొందుచుండు సంధానకరణి సంజీవకరణి విశల్యకరణి సౌవర్ణ్యకరణి యను నాలుగోషధులఁ గొనితెమ్ము. రవి యుదయించులోన రావలయు. నీవు రాకుండ సూర్యుఁ డుదయించెనా పని చెడును. నీశ్రమమ్ము వమ్మగును.

శ్రీరాముఁడు:—వత్సా! హనుమంతా!

క. పొమ్మా పవనకుమారక
తెమ్మా యోషధుల నేఁడు తెలవాఱక ముం
రమ్మా వేగమె ప్రాణము
లిమ్మా తమ్మునకుఁ జీవ మిమ్మా నాకుం.

హనుమంతుఁడు:—

క. ఇదె పోయెద నోషధులను
నిదె తెచ్చెద మాటలోన నేగి మరలి నే
నిదె వచ్చెదఁ గొండనె కొని
ముదమున దీవింపుమయ్య పోయెద రామా.

(నమస్కరించును.)

శ్రీరాముఁడు:—వత్సా! కార్యసిద్ధి యగుఁ గాక. పోయి రమ్ము.

హనుమంతుఁడు:—

'రామ రామ రామ రామ రామ రామ రాఘవా'

(అని కీర్తించుచుఁ బరుగున నిష్క్రమించును.)

యవనిక పడును.

---

## చతుర్థాంకము.

### తృతీయస్థలకము.

[ప్రదేశము—కాలనేమి మందిరము.]

[కాలనేమి, రావణుఁడు ప్రవేశించుచున్నారు.]

కాలనేమి:—రాక్షసచక్రవర్తీ! నన్ను రమ్మన్న నేను రానైతినా? ఒంటిమెయి నిశీథమున భృత్యు నింటికి రాఁ గారణ మేమి? నేఁడు నాయెడ నేల యిట్టి యనుగ్రహము జనించెను?

రావణుఁడు:—మారీచపుత్రా! కాలనేమీ! నీతో నాకు నేఁ డొక్కపని గలిగె. కాదనక చేయవలయును. ఎన్నఁడును నేను నిన్ను నిట్లర్థించినవాఁడఁ గాను.

కాలనేమి:—(స్వగతము) ఈ దురాత్ముఁడు మరల నేమి పూని యున్నాఁడో. ఇట్టిమాటలే చెప్పి మాయయ్య మారీచుని వనంబుల మునివృత్తి నుండినవానిని మృగరూపంబునఁ బంపి చావఁ జేసినవాఁడు. నేఁడు నా కేమియో కానున్నది. (ప్రకాశముగ) దానవేశ్వరా! నీ విట్లడుగు కొనవలయునే. నీవు కాలఁ జెప్పపని నేను దలతోఁ జేయువాఁడను గానా. ఆనతిమ్ము.

రావణుఁడు:—ఇప్పు డేను శక్తిని వైచి రామునితమ్ముని లక్ష్మణుని మరణమూర్ఛ నొందించితిని. సూర్యుఁ డుదయించులోనఁ జికిత్సచేయకున్న నిక్కముగఁ జావఁగలఁడు. అతఁడు చచ్చెనేని రాముఁడు తద్వ్యసనకర్శితుఁడై యెట్లును నాచేత సులభముగ వధ్యుఁడు కాఁగలఁడు. ఇప్పు డటనుండి మనచారు లరుదెంచి హనుమంతుఁడు మందులు గొనితేర ద్రోణాద్రికిఁ బయనమైనట్లు తెల్పిరి. నీ విప్పుడ పోయి ద్రోణాద్రిత్రోవను నెల్లసత్త్వముల మ్రింగివైచు నమ్మహామకర ముండుకొలనిగట్టున కపటమునివై యాశ్రమం బొందు గల్పించుకొని యాహనుమంతునికార్యమున కెట్టు లేని విఘ్నము కల్గింపవలయును. అతని నెట్లైన నమ్మహాసరసిని డిగఁ జేయుము. ఆమకరమే పట్టి దిగమ్రింగివైచును. ఈకార్య మెట్లును నీవు నెఱవేర్పవలయు. ఇప్పట్టున నాకు నీకంటెఁ జేయఁగలయాప్తుఁడు వేఱొక్కఁడు లేఁడు. నా కెట్లైన నుపకరింపుము. నిన్ను వేఁడువాఁడను.

కాలనేమి:—దానవసార్వభౌమా! నామాట యింత వైకొందువా. నీకు మేలగు తెన్నెఱిఁగించెదను. మాయయ్యను రాముఁడు కూల్చిననాఁటనుండి యారామునిపేరన్న నా కాపాదమస్తకము గంప మెత్తును. నీ కేల యీభ్రాంతి. నీతమ్ముఁడు జగదేకవీరుఁ డగు కుంభకర్ణుఁడు మడిసెను. జగజ్జేత లగు నీపుత్రులు మేఘనాదాతికాయులు నీల్గిరి. ఇంకను నీ కేటి వైర మా రామునితోడ. ఆరాముఁడు కేవలుఁడు గాఁడు. దుష్టశాసనం బొనర్ప నావిర్భవించిన యాదినారాయణుఁడు. అమ్మహామహు నాశ్రయించి నీతమ్ముఁ డగు విభీషణుఁడు మేలుపడినవాఁడు. లంక నాతని నేల నిమ్ము.

మ. తగ దయ్యా యిటువంటి దుష్టమతి యోర్వైశ్యైశ యుద్ధంబునం
దెగఁ జూచు న్నిను రాముఁ డస్త్రములచే న్నీ కబ్బ దారామునిం
దెగఁ జూడంగను సీత నిచ్చి సతితో న్నీ వేగి పెన్గానలం
దగుబుద్ధిం గొని మౌనివై మనఁగదే న్గాష్ట్యంబు మానంగదే.

రావణుఁడు:—(కోపమున) చాలు నీహితబోధము. నీహిత మేను వినరానైతి. నీ వెట్లును బోవనే వలయును. ఈపని చేయనే వలయును. లే దేని నాకరవాలంబున నిప్పుడే నీతల...

కాలనేమి:—దేవా! ఇదె వెడలెదను (స్వగతము) ఈ పాపాత్మునిచే నేల చావవలయును. రామునిచేఁ గాకున్నను దద్భక్తుఁ డగు హనుమంతునిచే నైనను జచ్చెదఁ గాక. యుద్ధమరణ మెట్లును వీరస్వర్గము గల్గించుఁ గదా.

రావణుఁడు:—ఏ మాలోచించుచు నిటనే యున్నాఁడవు.

కాలనేమి:—ఇదే పోవుచున్నాఁడను. (నిష్క్రమించును)

రావణుఁడు:—ఇంక నే నేగి యిటమీఁదిపని చూచెదఁ గాక.

(నిష్క్రమించును.)

## చతుర్థాంకము.

### చతుర్థస్థలకము.

[ప్రదేశము—(కపటమునియైన) కాలనేమి యాశ్రమము.]

[కాలనేమి (కపటతపము చేయుచు) ప్రవేశించుచున్నాఁడు.]

(అప్పు డాకాశమార్గమున హనుమంతుఁడు ప్రవేశించును.)

హనుమంతుఁడు:—(అంతటను గలయఁ జూచి) (తనలో) నే నేమి మార్గము దప్పితినా.

చ. మదికిని సందియం బొదవెఁ దన్మార్గ మిదో యిది కాదొ మున్ను నా
పదమున నిట్టి యాశ్రమము గాన్పడ దయ్యెను జూడ నింతలో
నొదవెనొ యీమునీంద్రుఁ డెవఁడో యిది మాయయొ సత్యమో మదిం
గదురదు నిశ్చయం బితనిఁ గన్గొని కార్యము నిర్ణయించెదన్.

ఇతనినే యడిగి నిక్కువ మ్మెఱిఁగి పోయెదఁ గాక. (దిగి యాతనికడకుఁ బోయి) మునిచంద్రమా! మరుత్కుమారుఁడ హనుమంతుఁడ నమస్కరించువాఁడ.

(నమస్కరించి లేచి నిలుచును.)

కాలనేమి:—అంజనాతనయా!

మ. హనుమా నిన్నెఱుంగుదుం బవనదేవాంశంబునం దుద్భవిం
చినకీర్త్యుత్తముఁ డీవు లక్ష్మణుఁడు సంజీవింప రాముండు ని
న్ననుపన్ ద్రోణగిరిన్ వరౌషధుల నింపారంగఁ దేఁ బోవు దిం
తను జక్కం గనుఁ గొంటి దివ్యమతిఁ దధ్యం బే కదా చెప్పుమా.

హనుమంతుఁడు:—మునిచంద్రమా! నిక్కము! నిక్కము! మునివరహృదయంబులకుఁ దెలియరాని పరమార్థ ముండునే. నే నిప్పుడు మునిజనులకును దేవతలకును గడుంగడు హితుఁడగు రామదేవుని కార్యంబునకై యేగుచున్నవాఁడను. తెరువు దప్పితి నని భ్రమసితిని. రామహితం బెల్లవారికి నడపఁ దగినది గాన నన్ను దయఁ జూచి ద్రోణగిరిమార్గము దెలుపుఁడు. మిమ్ము వేఁడువాఁడ.

కాలనేమి:—మహాబలనందనా! నిశ్చయము చెప్పితివి. రామకార్య మెల్లవారికిని నిశ్చయముగ నడపఁ దగినదే. రామకార్యము వేఱుగా మాకార్యము వేఱుగా మేము చూడము. మాబోఁటి మునిజనంబులకు హితము లగు కార్యములు చేయు నా మహాత్ముఁ డొనరించు కార్యము లన్నియు మమ్ముఁ గూర్చినట్టివే. కాఁబట్టి యాతని కార్యము లన్నియు మాకార్యములే. మాకార్యము లన్నియు నాతని కార్యములే. హనుమంతా! నీవు మిక్కిలియును ధన్యుఁడవు గావా. ఆ రామునకు నీవు నమ్మిన బంటవు. నీ వెప్పుడు ను నారామునెడ భక్తి గలిగి యాతని పని యన్నఁ దల ధరించి చేయుచుండుదువు. నిన్నుఁ బోలిన రామభక్తుఁడు లేఁడు సుమా. నీవు రామభక్తుఁడ వన్నంతయే కావు నేర్పరివి. సమర్థుఁడవు. నిన్నెఱిఁగియే యిట్టిపనుల కెల్ల నారాముఁడు

నిన్నుఁ బంపుచుండును. చూడుము సీతాదేవిని వెదకుటకై యెందఱు వానరుల నెన్ని దిక్కులకుఁ బంపఁడాయెనా సుగ్రీవుఁడు. రాముఁ డందఱిలోనను నిన్నేర్పఱచి యాదేవికై సందేశమునీతోఁ జెప్పిపంపెను! వేఱెవ్వరితోనైనఁ జెప్పెనా. ఆంజనేయా! నిక్కముగ నీవంటిమహాబలశాలి వేఱెవ్వఁడును లేఁడు సుమా! లేఁ డన్న లేఁడు. నిక్కముగ లేఁడు. నీవెనువెంట జాంబవదంగదాదు లెందఱు రారైరి.

హనుమంతుఁడు:- —మునిచంద్రా! నాప్రశంసన మిపు డేల?

కాలనేమి:—కాదు కాదు. పొగడ్త గాదు. నిన్నుఁ బొగడ నాకేపురుషార్థము లభింపఁగలదు? నిక్కముగ నాఁడు నీతోడ నెందఱు రారైరి. వారిలో నెవరైన నంబుధిని లంఘించి పోఁగలిగిరా? తుదకు జాంబవంతుఁడు ను నేదో యొక్కవంకమాట చెప్పి నిన్నే ముందునకుఁ ద్రోచెను. నీవు కదా లంక కేగి సీతాదేవిని జూచితివి! వేఱెవ్వరైనఁ జూడఁగల్గిరా. చూచి సది చాలక వైరికిఁ బరాభవంబు గల్గింపఁ దలఁచి యాలంకపురిలో నగ్గి వెట్టితివే. వాయునందనా! చెప్పుమా యగ్ని యిప్పటికైన నాఱినదేమో. సీతావృత్తాంతము దెలియక కుంది కుంది చావనున్న యారామునకు నీవె కావా యామె వృత్తాంత మెఱింగించి యాతనిప్రాణములు నిల్పితివి. నిక్కముగ నీవే నిల్పితివి.

హనుమంతుఁడు:—వానరమాత్రుండ నగు నేనా యామహాత్మునిప్రాణములు నిల్పఁగల్గుట.

కాలనేమి:—ఏమి! ఏమి! నీవా వానరమాత్రుఁడవు. చూచుటకు వానరాకృతివి గాని నిశ్చయముగ నీవు లయకాలరుద్రుఁడవు సుమా. కావున్న సీత నుంచిన యాయశోకవనము నాశము నొందించి తద్వనపాలకులఁ జంపి రావణునిముద్దుకొడుకు ను బహుపరాక్రమశాలియు నైన యక్షకుమారునిఁ జంపి విక్రమించితివే. నాఁడు నీవు నిక్కంబుగ లయకాలరుద్రునివలెనే యైతివి సుమా! ఆంజనేయా! నీవు గాక వేఱెవ్వఁ డేని రావణుని సింహాసనమునకంటె నున్నతముగ నాతనియెదుటఁ గూర్చుండి మాటలాడి ప్రాణములతోఁ బయటఁ బడ్డవాఁ డున్నాఁడా? ఇది యెల్ల నిక్కమా, కాదా, నీవే చెప్పుము. మా కొక్కరియెడను బక్షపాతబుద్ధి యించుకంతయు నుండదు. మా కొక్కరిని బొగడ నవసరములేదు. మే మెన్నఁడును ధర్మపక్షావలంబులము. ధర్మ మెక్కడ నుండునో, యక్కడ మాబుద్ధి నిలుచును. మాబుద్ధి యెక్కడ నిలుచునో, యక్కడ జయము గలుగును. అట్టిమేము నిన్నుఁ బొగడితి మంటివే. ఎంత యయ్యు నీమర్కటచాపలము మానవైతివి నీవు. నీ వేమి చేయుదువు. అది నీనైసర్గికవృత్తి.

హనుముంతుడు: —మునితిలకమా! ప్రొద్దు పోవుచున్నది.

కాలనేమి:—ఏ మట్లు తీవరించెదవు. నీకు వలసినమందు లెల్ల నిక్కడనే యున్నవి. నీ వా ద్రోణాచలమునకుఁ బోవఁ బనిలేదు. నీ కాశ్రమ యేల వలదు. నే నిచ్చెదను నీ కామందులను. పాపము చాలఁ గష్టపడితివి. ఈ వనమున నుండు నీఫలముల నారగించి నాకమండలూదకంబులఁ గడుపారఁ గ్రోలి యీరాత్రి యిక్కడ సుఖసుప్తిఁ జేసి తెలవకడయ వెడలుదువు గాని లెమ్ము.

హనుమంతుఁడు: —మునీంద్రా! అట్లు గాదు. సూర్యుఁ డుదయించుటకు మునుపే నేను లంక కేగి లక్ష్మణున కామందు లీవలయును. సూర్యుఁ డుదయించెనా, నాప్రయాస మెల్ల వ్యర్థము. లక్ష్మణుఁడు జీవింపఁడు.

కాలనేమి:—అట్లయిన నీకొకమంత్ర ముపదేశింతును. ఆమంత్రబలమున నీకా యోషధులు తమంతనే సులభముగఁ జిక్కును. ఆమంత్రము జపించినవా రెప్పుడును యుద్ధంబుల నోటు వడక విరోధివిజయంబు గొని సంతసించుచుందురు. కపీంద్రా! నీవు మిక్కిలియు నలసినయట్లున్నాఁడవు. నీ వెన్నఁ డీవంకలకు వత్తువు! ఎన్నఁడు మావాంఛల నెఱవేర్తువు? రాకరాక వచ్చిన నీయట్టి పరమాప్తునకు వలచినయట్టు లాతిథ్యము సలుపక పంపుటకు నే నంతటిమూఢుఁడనా. మరున్నందనా! నేఁడు నాయొసఁగు నాతిథేయసత్కారంబు నాదరించి యీవన్యఫలములఁ గడుపారఁ దిని మత్కమండలూదకంబుల నింపారఁ గ్రోలి యీరాత్రి యిట మదీయాశ్రమంబున నేద దేర్చికొనియే పోవలయుసుమా నీవు.

హనుమంతుఁడు:—(స్వగతము) నేఁ డి దెట్లు వచ్చె నాకు. కా దనిన, మునీంద్రుఁ డలిగి శాప మిచ్చునేమో? ఇంత యేటి కీతఁడు నన్నుఁ బట్టుపఱచుచున్నాఁడు. ఇతనికోర్కి యేమైయుండును. ''ప్రయోజనమనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే'' యను సామెత ననుసరించి యితఁ డేదేని నావలన నభిలషించి యుండునా? సర్వసంగములఁ ద్యజియించి వనంబులఁ దపంబులొనర్చుకొనుచుండు మునులకు వలసిన దేముండును. తపస్సంపన్నుం డగు నీతని కోరుల వలనఁ గాఁదగిన దేది గలుగును. అట్టి దేదియు నుండదు. పరోపకారమతియే కారణమై యుండును. ఈతఁడు నిక్కముగ రామభక్తుఁడే యయి యుండును. అట్లు గాకున్నఁ గోరకున్నను రామకార్యసాఫల్యమునకై మంత్ర ముపదేశింతు నని చెప్పునా? నే నేమియు నెఱుంగఁ జాల కున్నాఁడను. ఇది రావణమాయ యగునా! మత్కార్య విఘ్నము గల్గింపవాఁ డీపన్నాగముఁ బన్ని యుండునా. ఉండఁడు. తొలుత నేను మంగలకై బయలుదేఱినది వాఁ డెటు తెలిసియుండఁగలఁడు. అగ్రరాత్రవ్యాపార మెట్లాతని కెవ్వరైనఁ జెప్పియుండఁ గలరు! చెప్పిరనియే యనుకొందము కాక. నేను బయలుదేరి కొన్ని గడియలైనఁ గాలేదు. ఈలోన నేను బయలువెడలిన దెఱింగి నాకంటె మున్నుగ నింతదూరము వచ్చి యీవేష మూని యుండునా! ఇది యెన్నఁడైనఁ బొసఁగునా—కాదు. ఇది మాయ కాదు. మోసము కాదు. ఈతఁడు నిక్కముగా మునియే యగును.

కాలనేమి:—ఏమి హనుమంతా! యోజించుచున్నాఁడవు?

హనుమంతుఁడు:—(స్వగతము) ఏమి చేయుదు నింక నేను. (ప్రకాశము) మునిచంద్రమా! లక్ష్మణుఁడు రావణప్రయుక్తశక్తివేదనమున మరణకల్పస్థితి నుండ రాముఁడు తమ్ముఁగుఱ్ఱికై యెంతయుఁ బరితాపము నొందుచుండ సుగ్రీవాదికపిముఖ్యు లెల్లరు రామునితోఁబాటుగ నేకమనస్కులై యాందోళనము చెందుచుండ నామది కే సంతోషము గల్గియున్న దని యిక్కడ నిల్చి మీకు విందనై విందారగించువాఁడను? నేఁటికి క్షమియింపుఁడు. ఈయుద్ధావసానంబున మీకోరికిఁ దీర్చువాఁడను.

కాలనేమి:—అయిన నీయిష్టము. ఇంత పానీయమైనఁ గ్రోలక పోవఁ జూచుచున్నాఁడవు. నే నేమనఁ గలవాఁడను. నాప్రాప్త మింతయే కదా యని యూరకుండువాఁడ.

హనుమంతుఁడు:—మునినాథా! మీ రట్లు మనస్సు చిన్నపుచ్చికొనిన, నే నేమి సేయువాఁడ. ప్రకృతము నాకును దప్పి యెత్తి యున్నయది. మీకమండలువులోనిజలముల నాయంగిలియుఁ

దడియదు. నాయెడ దయసూపి భవదాశ్రమప్రాంతముల సరోవర మొండున్నఁ జూపుఁడు. దప్పిదీఱ నీరు గ్రోలి వత్తును.

కాలనేమి:—తండ్రీ! పావనీ! నీకు దప్పి యగుచుండ నేను సరోవరము సూపనా. అదె తూరుపునఁ గూఁతవ్రేఁటుదూరమున నాచెట్లనడుమ నొక్కరమణీయకాసారము గలదు. అందలి యుదకంబు లమృతతుల్యంబులు. అట కేగి నీదప్పి దీర్చికొని వేగమే యిక్కడకే రావలయుఁ జుమా. నేను మంత్ర ముపదేశింతును. ఉపదేశము గొనిన పిమ్మట యథేచ్ఛను జనుము. అంజనాతనయా! మఱొక్క మాట. ఆనీళులలో నానావిధము లగు వింతవస్తువు లున్నవి. వానియెడ మక్కువపడఁబోయెదవు సుమా? నామంత్రము నిరాశునకుఁ దప్ప లాఁతివానికిఁ బనిచేయదు. నీ వావస్తువులఁ గనిన నెట్టులైనను బుద్ధి చలియింపఁగలదు. నీ వొక్కటి చేయుము. కన్నులు మూసికొని యాకాసారములోనికి దిగి జలపానము సేసి వెడలివచ్చి గట్టెక్కినపిదపఁ గన్నులు తెఱువుము. అదియే పోలినతెఱఁగు. పోయి రమ్ము. హనుమంతా! నావాక్యములను మఱవక కన్నులు మూసికొనుము. లేకయున్న మంత్రము పనిచేయదు. జాగ్రత జాగ్రత. ప్రమాదమున నైనఁ గన్నులు తెఱవకుము. పొమ్ము.

హనుమంతుఁడు:—భాగ్యము. (నిష్క్రమించును)

కాలనేమి:—(స్వగతము) పొమ్ము. కాసారమున మకరమువాతఁ బడి దానిగర్భములో నాద్రోణాచల మెక్కడ నున్నదో వెదకఁబొమ్ము. నే నిక్కడనే యుండి యే మగునో చూచుచుండెదఁగాక.

(ఆశ్రమమున వేదికమీఁదినుండి హనుమ యేగినదెస మెడ సాఁచి చాఁచి చూచుచుండును.)

యవనిక పడును.

---

## చతుర్థాంకము.

### పంచమస్థలకము.

[ప్రదేశము—కాసారము.]

[హనుమంతుఁడు (మకరముచేఁ గాల్వట్టికొనఁబడి) ప్రవేశించుచున్నాఁడు.]

హనుమంతుఁడు:—రామచంద్రా! ఏమి చేయుదు నింక. నన్నీమకరము ఘోరభంగిఁ గబళించుచున్నది. నాబల మంతయుఁ బుచ్చుచున్నది. నేను బుట్టినదాదిగ నిట్టి సత్త్వము నెందును గానను—హా! ఇదేమి ము న్నేను వారిధిని దాఁటునపుడు ఛాయాగ్రాహిణి యగు సాసింహ

కవలెఁ గబళింపఁ బూనినది—ఆసింహికను జంపినట్లే సూక్ష్మరూపంబున దీనియుదరము సొచ్చి యటఁ బెరిఁగి దీనిప్రేవులు ద్రెంచి యుదరము సించికొని వెడలివచ్చెదఁ గాక.

(అట్లు చేయును)

(అప్పుడు మకరరూపమునుండి యొక్కయప్సరఃకాంత వెడలివచ్చును.)

అప్సర:—ఆంజనేయా! నేను ధాన్యమాలిని యను నప్సరఃకాంతను. రావణకృతదోషమున శాండిల్యమహామునిచే శపియింపఁబడి నీవలన నేఁడు శాపము దీఱి మకరరూపమునుండి మోక్షణంబు వడసితిని. నిన్నిక్కడకు నీరు ద్రావ నంపినవాఁడు నిక్కంపుముని కాఁడు. వాఁడు, మాయావి యగు మారీచునికొడుకు కాలనేమి యనువాఁడు. రావణప్రేరణమున నీపాపాత్ముఁడు నీకార్యవిఘ్నము గల్గించి నిన్నివిధమునఁ జంపఁ జూచినవాఁడు. ఈదురాత్ము వధించి ద్రోణగిరి కేగుము. నీవు దారి తప్పలేదు. రామచంద్రుకృప గలుగ నీకుఁ జేయరాని దేది గలదు. తడయక పోయి లక్ష్మణుని బ్రదికింపుము. ఇఁక నే నేగెద.

(ఆకసమున నిష్క్రమించును)

హనుమంతుఁడు:—పాపాత్మా! కాలనేమీ! నిన్నిదే మీయయ్యకడ కంపెద నుండుము.

(నిష్క్రమించును.)

(యవనిక పడును.)

---

## చతుర్థాంకము.

## షష్ఠస్థలకము.

[ప్రదేశము—కాలనేమియొక్క యాశ్రమము.]

[కాలనేమి ప్రవేశించు చున్నాఁడు.]

కాలనేమి:—(స్వగతము) ఏమి యీవింత! ఈతఁ డెట్లీమకరినిఁ దప్పకొనివచ్చుచున్నాఁడు! ఆమొసలి నిద్రించుచున్నదా. మహాసత్త్వముల నెన్నింటినో యవలీల ద్రింగివయిచినదాని కీతఁడు వెగటయ్యెనా. కాలుఁడు నేఁడు వలదనెనా. దూతలు కాదనిరా.

[హనుమంతుఁడుప్రవేశించుచున్నాఁడు.]

హనుమంతా! వచ్చితివా నీదప్పి దీఱెనా? ఇప్పుడు స్వస్థుఁడ వైతివా? ఇంక మంత్రోపదేశముగొనుము. నాకు మంచి గురుదక్షిణ యీవలయును జుమా.

హనుమంతుఁడు:—మునివరా! కాదు. గురువరా! మీయట్టి మహాశయులకడ విద్య గొనుటకు మున్నే గురుదక్షిణ యీవలయును. పిమ్మట నైనచో నామంత్రము పనిచేయదు—దురాత్మా! గురుదక్షి

ణయా? (గ్రుద్దుచు) పాపము! మీతండ్రి నీకై యమాలయమున మిగులఁ బరితపించుచున్న వాఁడఁట. పొమ్ము. (అని క్రిందఁ గెడప నాతఁడు తన్నుకొనును.)

(యవనిక పడును.)

---

## చతుర్థాంకము.

### సప్తమస్థలకము.

[ప్రదేశము—ద్రోణగిరి.]

[హనుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

హనుమంతుఁడు:—ఆహా! ఏమి యీద్రోణాద్రి సొగసుసొంపు. ఇక్కడిమార్గములు సింహములు గోళులఁ జీల్పఁగా నేనుఁగులకుంభస్థలములనుండి రాలిన మౌక్తికంబులచేత నెంతయు సుందరంబులుగఁ బొడకట్టుచున్నయవి. ఈమార్గముల నెయ్యెడలను సుషేణుఁడు చెప్పినమందులు గానరాకయున్నయవి.—ఆహా! ఇయ్యెడఁ గిన్నరదంపతులు క్రీడార్థముగ నలవరించిన పూసెజ్జల గుబులొక్కనువాసన లెల్లయెడలను గుబాళించుచున్నవి.—ఇయ్యెడను నామందులు గానరాకున్నవి.—ఆహా! ఇది యేమి యీచరియలబంగరువన్నెలు దళుకొత్తుచుండెడి! అత్తేజము మహౌషధులదే యయియుండును. పోయి కనుఁగొందుఁ గాక. (పోయి చూచి) అక్కటా! ఇవి యామౌషధులు గావు. మెఱపుఁదీఁగలవంటి కాంచనలతలు.—అక్కడనే మాపాటలచ్ఛాయ! (పోయి చూచి) అక్కటా! ఇవ్వియును నామౌషధులు గావు. ఇది మణిమయధాతుపరాగముల రమణీయపాటలకాంతి—ఆహా! అయ్యెడ నేమి యానక్షత్రదీప్తి? అద్దియే యౌషధ! (చేరఁ బోఁగా నక్కడికాంతి మఱఁగిపోవును.) ఆహా! ఏమాశ్చర్య మిది. నేను జూచినయాదీప్తి యున్నట్టులుండి మఱఁగిపోయెను. నిక్కముగ నిది యామౌషధియే. ఆమౌషధ నేను డాయఁగనే తన కాంతిని మ్రింగివైచుకొన్నది. ఈమొక్కల నోషధ యిది యని యెట్లు వేర్పఱుపఁగలను.—అదిగో యయ్యెడను నట్టి కాంతియే పుట్టుచున్నది. తెలియకుండఁ బ్రాఁకికొని పోయి యాకాంతిమంతం బగు లతను గొనియెదఁ గాక. (అని ప్రాఁకికొని దానిచెంత కరుగునంత కది మఱఁగిపోవును) ఆహా! ఇం కేది గతి. ఇదియుఁ జేఁజిక్కక మఱఁగెను ఈమౌషధుల వేఁడికొందుఁ గాక.

చం. జనముల కెల్లవేళల రుజ ల్నశియింపఁగఁ జేయువారు మీ
ననసి సమస్తలోకముల నెప్పుడుఁ బ్రోవఁగఁ బూనియుండువా
రనఘము లీరు రామవిభుఁ డంపెను మిమ్ములఁ దేర నన్ను ల
క్ష్మణవిభుజీవము ల్నిలుపఁ జయ్యన మీర లనుగ్రహింపరే.

(అని నమస్కరించును.)

అక్కటా! ఈయోషధులు గనికరింపవయ్యె. ఏమి చేయువాఁడ. జాంబవంతుఁ డంపినయప్పటి భంగి నీకొండ నే పెకలించుకొనిపోవుదునా-కాని యీపర్వతము నే వేఁడికొందును. మందుల నీకున్న నాపనియే యుచితము. గిరిరాజమా!

చం. అనిపినవాఁడు దాశరథి | యర్మిలిఁదమ్ముని యార్తిఁ దీర్పఁగా
మనమున నెంచి నీకడకు | మందులఁ దేరఁగ నన్ను నిప్పుడో
యనఘ ననుం దయాం దలఁచి | యల్లన యోషధు లిచ్చి పంపుమా
యినుఁ డుదయించునంతకును | నేఁ జనకున్నను దప్పుఁ గార్యముల్.

(నమస్కరించును.)

ఏమి యిది! ఈగిరిరాజు నన్నుఁ గీటునఁ బుచ్చె! శిలాకర్కశహృదయంబు లగుకొండలు కులిశములకుఁ గాక ప్రార్థనాపూర్వకము లగు తీయనిమాటలకు మెత్తవడునా. ఇంకఁ దడసినఁ గార్యము దప్పును. కొండనే కొనిపోదుఁ గాక. సుషేణుఁడే యీమందులఁ గొనుఁగాక.

“రామ రామ రామ రామ రామ రామ రాఘవా.”

(తోఁక పెంచి గిరిని జుట్టికట్టి పెకల్చి యెత్తికొని యాకసంబున కెగసి నిష్క్రమించుచున్నాఁడు.)

---

## చతుర్థాంకము.

### అష్టమస్థలకము.

[ప్రదేశము—నందిగ్రామము.]

[భరతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భరతుఁడు:—అక్కటా!

కం. మున్నీగతి దుస్స్వప్నం
బెన్నఁడు నేఁ గాంచి యెఱుఁగ | నిప్పుడు ధాత్రీ
భృన్నుతులకు సోదరులకు
నెన్నఁగ వదినెకును సేమ | మే యగుఁగాతన్.

వసిష్ఠసంయమీంద్రునివాక్యములు రిత్త లగునా. మాయన్నయగు శ్రీరామభద్రుఁడు నిర్జరద్వేషి యగు నారావణు నాజి వధించి యాచంద్రార్కస్థాయి జగత్ప్రసిద్ధకీర్తి వహించి సేమంబుగ జానకీలక్ష్మణులతోడ నయోధ్య కచిరంబున నే రాఁగలఁ డని వచియించియున్నవాఁడు. శ్రీరామచంద్రా! నేను నిక్కముగఁ బదునేనవయేఁటితొలిదినంబున నీవు రాకున్న నగ్నిప్రవేశముఁ

జేయుదుఁ జుమా. ఆహా! లక్ష్మణా! నీవు సుమా నిజంబుగ భాగ్యవంతుఁడవు. అన్నను ననుగమించితివి. పాపిష్ఠ యగు కైకగర్భంబునఁ బుట్టినకారణమున నా కాభాగ్యము లభింప దయ్యె. భరతా! నీవు వ్యర్థుఁడవు. నీకై కదా కైక రామచంద్రు నడవులకుఁ బో నడఁచె. నీజన్మ మేటికి? అగ్రజన్మున కాపద పొరయించిన నీవు మనుష్యుఁడవా?

[హనుమ యాకాశమార్గమునఁ గొండతోఁ బ్రవేశించు చున్నాఁడు.]

కం. సోదరుల కకట నాకయి
తా దాఁపురమయ్యె సిలుగు ధరపై నింకన్
నాదుర్జీవన మేటికి
ఖేదం బారు లెన్నఁ డిట్టిక్రియఁ గాంచి రొకో.

హనుమంతుఁడు:—(చూచి) ఏ మిది మారామచంద్రుఁ డేల యిక్కడ నున్నవాఁడు. ఒంటిమెయినున్నవాఁడు. సుగ్రీవప్రముఖు లెక్కడఁ బోయిరి. విభీషణుఁ డెక్కడ! అక్కటా! నేను వేళకు మందులు దే నని యు లక్ష్మణదేవుఁ డింక జీవింపఁ డనియు మదిని నిరాశఁ జెంది విభీషణుని సుగ్రీవాదిహరీశ్వరులను వీడ్కొని వనముల నివసింపవచ్చినాఁడు. (పరిశీలించి చూచి) ఆహా! నేను బొరవడితిని. కాఁడు-కాఁడు. ఈతఁడు మా రామవిభుఁడు గాఁడు. ఈతఁ డెవ్వఁడో శ్రీరామచంద్రునిఁ బోలిన యొక్కమునినాథుఁడు. నే నితనిమూర్తివిశేషముఁ గని యూరక యాసీతాపతియే యని భ్రమఁ జెందితిని. సీతావిభుఁ డగు నా శ్రీరామదేవుఁడు రావణుని జంపక సీతాదేవినిఁ బరిగ్రహింపక విభీషణుని లంకలోఁ బ్రతిష్ఠింపక యూరక కొఱగానివానివలె నడవులఁ జొర నంత భీరుఁడా? ఆత్రిలోకప్రభుఁడు నిక్కముగ నలిగెనా, యీచరాచరజగం బంతయు నశియించుఁగదా. అట్టిప్రభున కిట్టి బుద్ధి పుట్టునా. ఇతఁడు మారామచంద్రుఁడు గాఁడు. ముమ్మాటికిఁ గాఁడు.

భరతుఁడు:—హా! రామచంద్రా! నీ కెన్నికష్టములు ప్రాప్తించె!

హనుమంతుఁడు:—ఏ మిది. ఈతఁ డారామచంద్రునకై చింతిల్లుచున్నవాఁడు ఈతఁ డెవ్వఁడో యొక రామభక్తుఁడు. ఆదేవునకై యనుతపించుచున్నవాఁడు—ఇది రాక్షసమాయగ నుండదు గదా. మరల నామార్గనిరోధము ఘటియింపఁ జేసి వేళ కొఱవ కుండఁ జేయ రావణుఁ డంపిన కాలనేమినిఁ బోలిన మఱొక్కరాక్షసుఁడు కాఁడు కదా యితఁడు. అట్లే యయిన వానిగతియే వీనికిఁ బట్టుఁగాక.

భరతుఁడు:—(స్వగతము) అక్కటా! వసిష్ఠమునీంద్రుఁ డేల యిట్లు జాగొనరించుచున్నవాఁడు నాకయిన దుస్స్వప్నదోషనివారణంబునకై శాంత్యాదుల నెఱవేర్పఁ బిలిపించితిఁ గదా! ఏల తడయుచున్నవాఁడు. ఆహా! ఇ దెక్కడి దీవెలుఁగు. ఇ దెవ్వరినీడ. (మీఁదు చూచి) ఆహా! ఈవానరుఁ డెవ్వఁడు? ప్రకాశమానమగు నొకకొండఁ గొని దక్షిణాభిముఖుండై యరుగుచున్నవాఁడు. ఇది యేదో రాక్షసమాయ. కానున్న వానరమాత్రుఁ డొక్కఁడు కొండఁ గొని యాకసమునఁ బోవ నోపునా? మా రామచంద్రున కెగ్గాచరింప నెవ్వఁడో యొక్కరాక్షసుఁ డిట్లు దక్షిణాభిముఖుండై యరుగుచున్నాఁడు గావలయు. దుస్స్వప్నమునకుఁ దోడుగా నిప్పుడీవానరదర్శన మయ్యెను నాకు. ఈసత్త్వమెట్టి దైన నగుఁగాక. వీనిని నాశరమునఁ బడవై

చెద (విల్లెక్కిడి బాణమేయును. బాణము రామ రామ యని ఘోషించుచుఁ బోవును.)

హనుమంతుఁడు:— (స్వగతము.) ఆహా! ఈబాణము త్రోవ నెల్ల రామనామము ఘోషించుచు వచ్చుచున్నది. ఈతఁడు రాక్షసుఁడు గాఁడు. రామభక్తశిఖామణి. (గ్రుచ్చికొన్న బాణము ను జూచి) ఈబాణము సయితము రామనామాంకితమై యున్నది. ఈభక్తశిఖామణి యెవ్వఁ డో చూచి పోయెదఁ గాక. (అని బాణవేదనము నొందినవాఁడు వోలె బాధ నభినయించు చుఁ గొండతోడ నేల వ్రాలుచున్నాఁడు.)

భరతుఁడు:— (చెంత కేగి చూచి) (స్వగతము) ఇతఁడు మద్బాణహతుఁడు గాకున్నాఁడు. ఎవ్వఁడో తెలిసికొందుఁ గాక (ప్రకాశము) ఓవానరవ్యక్తీ! నీ వెవ్వఁడవు. కొండను గొని యెక్కడి కేగుచున్నవాఁడవు? నిక్కము వచియింపవైతి వేని యీభరతుఁడు నిన్నుఁ బ్రాణములతో విడువఁడు సుమా.

హనుమంతుఁడు:—శ్రీరామదేవునిఁ గన్న యాదశరథేశ్వరునికుమారుఁడగు భరతుఁడవా తండ్రీ నీవు.

భరతుఁడు:—అవు నాతఁడనే. దశరథేశ్వరునిపుత్రుఁడను. శ్రీరామదేవునితమ్ముఁడను. భరతుఁడను. మఱి నీ వెవ్వఁడవు?

హనుమంతుఁడు: —(స్వగతము) ఈతనిమది మాప్రభునియం దెట్లున్నదో యరసెదఁ గాక. (ప్రకాశము - శరపాతబాధ నభినయించుచు) హా! భరతరాజకుమారా! నీబాణము నాయెదను వచ్చి తీవ్రవేదనము గల్గించుచున్నది—హా! రామచంద్రా! రామచంద్రా!—నే నింక జీవింపఁ జాల. ప్రాణములు నిలుచునట్లు తోఁచుట లేదు. హా! రామచంద్రా! రామచంద్రా! అసువుల! భరింపఁజాల! అయ్యో! భరతరాజకుమారా! లక్ష్మణదేవుఁ డింకెట్లు జీవించును?

భరతుఁడు:—ఏమీ! ఏమీ! లక్ష్మణున కేమాయెను? లక్ష్మణున కేమాయెను?

హనుమంతుఁడు:—క్రూరాత్ముఁ డగు రావణుఁ డాకుమారునిపై శక్తివైచి మరణమూర్ఛ నొందించి నాఁడు. శ్రీరామచంద్రుఁ డాతనికై యౌషధులు గొనితేర నన్ను ద్రోణగిరి కంపెను. ఇదియే యాద్రోణగిరి. ఈపర్వతమున నోషధులు గల వని వానరధన్వంతరి సుషేణుఁ డెఱింగించి నాఁడు. రవి యుదయించులోన నే చికిత్సచేయకున్న లక్ష్మణుఁడు జీవింపఁ డఁట—హా! హా! నేను మనఁజాల. మనఁజాల—హా! రామచంద్రా! ఈయాంజనేయుఁడు సముద్రమును లంఘించినట్టివాఁడు. క్షణమాత్రకాలమున నోషధులఁ దేఁగలఁ డని తలంచితివే—అయ్యో! అయ్యో! ఇం కెక్కడిహనుమంతుఁడు. హా! రామచంద్రా! హా! లక్ష్మణకుమారా! (మూర్ఛ నభినయించుచున్నాఁడు.)

భరతుఁడు:—(విసుఁగున) హా! దురాత్మా! భరతా! నీవు దీనికయియే జీవించితివా—కటకటా! నీవర ములు నేఁటి కిక్ష్వాకుకులవినాశమునే కలిగించెఁ గదా—అక్కటా! హనుమంతా! మా యన్నకుఁ బరమభక్తుఁడ వగు నిన్నుఁ జేతులారఁ గోలుపోయితినే. వసిష్ఠభగవానుఁడు నీ వృత్తాంతము చెప్ప విని విని సంతసించి సంతసించి నీ కెట్లో సత్కార మొనరింపఁ దలంచి తినే. అక్కటా! ఇదియా నే నెంచిన యాసత్కారము. క్రూరాత్మా! భరతా! నీ వేల జన్మించితివి.

[వసిష్ఠుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వసిష్ఠుఁడు:—భరతరాజకుమారా! (అని సమీపించి) ఏ మిది! ఇతఁ డేల యిట్లు పడియున్నాఁడు?

భరతుఁడు:—వసిష్ఠమునిచంద్రమా! నే నేమి చెప్పఁగలవాఁడ. ఈతఁ డాపవనసూతి హనుమంతుఁడు. తమ్ముఁడు లక్ష్మణుఁడు రావణునిశక్తిచే మూర్ఛ నొందినాఁడఁట. అతనిచికిత్సకై యన్న రామభద్రుఁ డీతని నోషధులకై ద్రోణగిరి కంపె నఁట. ఇదే యాగిరి. ఇతఁ డీగిరిని గొని లంకాభిముఖుఁడై యరుగుచుండఁ బాపిష్ఠుఁడ నేను జూచి బాణ మేసితిని.

వసిష్ఠుఁడు:—ఆహా! ఎంత తప్పు చేసితివి!

భరతుఁడు:—సూర్యుఁ డుదయించినంత నే తమ్ముఁడు జీవింపఁ డఁట - ఋషిచూడామణీ! లక్ష్మణుఁడు జీవింపకున్న నారాముఁడు జీవింపఁడు. ఆతఁడు లేకున్న నీభరతుఁడు మనఁగలఁడా? శత్రుఘ్నుఁడు మనఁగలఁడా?—ఆహా! పావనేక్ష్వాకువంశమునకు నేఁడు నామూలమున విచ్ఛేదంబు పొరసెఁగదా—ఆహా! ఈకైకవరము లెంతపని వచ్చెఁ జూచితివా!—ఊరక కైక నేల యనవలయును. నాజన్మమే యింతకును గారణము.

సీ. దశరథు వరములు దగఁ గైక యడుగంగ,
నేనె కా కారణంబైనవాఁడ
రాజ్యభోగము వీడి రాముఁడు వని కేగ,
నేనె కా కారణంబైనవాఁడఁ
బుత్రార్తి నరపతి పొగులుచు మరణింప,
నేనె కా కారణంబైన వాఁడఁ
బావనేక్ష్వాకులభవ్యతేజము బ్రుంగ
నేనె కా కారణంబైనవాఁడ

తే. గీ. నిన్నిటికిఁ గారణం బయి యెసఁగి యిపుడు
హనుమఁ బడవైచి లక్ష్మణుఁ డంతరింప
నతని వెనువెంట నినవంశ మంతరింప
నక్కటా నేనె కారణంబైనవాఁడ.

తే. గీ. వంశనాశకుఁ డగువాఁడు భరతుఁ డనుచు
నెఱిఁగి తండ్రి నన్జంపక యేల విడిచెఁ
బుట్టినప్పుడె యే నేల గిట్టనైతి
నిలను మనియుండు టేలొకో యిట్టి నేను.

వసిష్ఠుఁడు:—రాజకుమారా! ధీరుఁ డగునీయట్టివాని కిట్లు చింతింపఁ దగునా?

భరతుఁడు:—గురువరేణ్యా! జగత్ప్రభుఁడును నాకుఁ బితృసముండును నగ్రజుండును నగు నారామచంద్రున కింతటికష్టము గలిగించిన నేను మన నగునా? ఈరాత్రి యీయోషధులు చేరి చికిత్స చేయఁబడకున్న నాతమ్ముఁగుఱ్ఱ లక్ష్మణుఁడు జీవింపఁడు—ఏమి చేయఁగలను! ఆరామ

భద్రున కెగ్గు చేసితిని. ఎంతటికృతఘ్నుఁడను. ఎంతటిపితృహంతను—హా! భరతా! నీ వేల పుట్టితివి. చావుము కులాంతకా! (అని కరవాలమునఁ బొడిచికొనఁ జూచుచున్నాఁడు.)

వసిష్ఠుఁడు:—(చేయిపట్టియాఁగుచు) ఇది ధైర్యరహితులపని. ధీరుఁడు ను శూరుఁడు ను వీరుఁడు ను నగు నీయట్టివానికిది దగదు. ఎన్నఁడు ను దగదు. గతమునకు వగచిన ఫలమేమి గలుగును! కార్యభాగమూరయుము.

భరతుఁడు:—నా కేమియుఁ దోఁపకున్నది. భ్రాతృద్రోహినైతిని

హనుమంతుఁడు:—(స్వగతము) ఆహా! ఈరాకుమారునకు రామవిభునెడ నెంత భక్తి గలదు!

భరతుఁడు:—(స్మృతి నభినయించి) హనుమంతా! నాయపకృతి మదిఁ దలఁపక యొక్క కార్యము నన్ను మన్నించి చేయుదువా!

హనుమంతుఁడు:—భరతరాజేంద్రా! ఏమి చేయు మనెదవు. నే నీరాత్రి లంకకుఁ బోవలయు. నీవు నడుమ నన్ను నీశరమునఁ బడవైచితివి.

భరతుఁడు:—ఇదే నీవు కొండతోడ నీ నాశరము నెక్కుము. నిన్నీక్షణము లంకలో రాముని కడ వ్రాలఁ జిమ్మెదను.

వసిష్ఠుఁడు:—ఇది గదా వీరపురుషోచితకార్యము.

హనుమంతుఁడు:—అయ్యా! భరతదేవా! ఆశ్రీరామునకై యనుతాపపడునీ వెవ్వఁడవో యని చూడ నెంచితిని. నీచేత విడువఁబడినశరము సహితము "రామ రామ" యనుచు ఘోషించుచు వచ్చుచుండ నట్టిశరముఁ బ్రయోగించినరామభక్తుఁ డెవ్వఁడో యని చూడ నెంచితిని. చూచితిని. సంతోషించితిని. ఆయన్నకుఁ దగిన తమ్ముఁడ వీవు. నీబాణము నాకు బాధ గల్గింపలేదు. నిన్నుఁ జూడఁ గారణం బొక్కటి యాతీరునఁ గల్పించుకొనుటకై లేనిబాధ నభినయించితిని. నీ దగురామభక్తికి నే నెంతయు మెచ్చితిని. ఆవిభుని నమ్ముము. నీకు మేలగును. ఆజగత్ప్రభుఁ డగు శ్రీరామవిభునెడ భక్తితత్పరుఁ డగువాని నెన్నఁడు నాపద లంటవు. నీకు నన్ను లంకలో రామచంద్రునికడకు శరముతోఁ బడఁ జిమ్మవలసిన శ్రమ మక్కఱ లేదు. నేనే యేగెదను.

"రామ రామ రామ రామ రామ రామ రాఘవా"

[హనుమంతుఁ డెగసిపోవును.]

[భరతాదు లతనిపోయినవలను సూచుచుండ యవనిక వ్రాలును.]

---

# చ తు ర్థాం క ము.

## నవమస్థలకము.

[ప్రదేశము—యుద్ధభూమి.]

[రామాదులు ప్రవేశించుచున్నారు.]

శ్రీరాముఁడు:—

చ. తడ వగుచెంచె నేమిటికిఁ దాఁ జనుదేరఁడొ యంజనాసుతుం
డెడ రది యేమి మూఁడెనొ యహీనబలాఢ్యున కాగిరీంద్రముం
బడసెనొ యోషధు ల్వెదకి పట్టెనొ యేగతి యేమి యయ్యెనో
యెడఁద దలిర్ప లక్ష్మణున కింకను నీయిల జీవ ముండునో.

సుగ్రీవుఁడు:—దేవా! ఆహనుమంతుఁ డింతకు వచ్చుచునే యుండును. ఇప్పుడే కదా నాల్గవయామ మారంభ మయ్యె. వేళకు రాఁగలఁడు ఊరకేల చింతించెదవు.

శ్రీరాముఁడు:—సుగ్రీవా! నా కేటికో మది నిలువకున్నది. నాముద్దులతమ్ముఁడు, నాచక్కనయ్య, నాలక్ష్మణుఁ డెలమిఁ గాంచి లేచునంతకు నామది కుదురుకొనదు—ఆహా! అ దేమా వెలుఁగు! అక్కటా! హనుమంతుఁడు రాకుండఁగనే లక్ష్మణుఁడు స్మృతి గనకుండఁగనే మదన్వయ కరుండయ్యు నీసూర్యుఁడు వేళ గాకుండియు నుదయించుచున్నాఁడు.

తే. గీ. అస్మదన్వయకరుఁ డయ్యు నహిమకరుఁడు
తనదురాకను మన్నించుఁ దమ్ముఁ డనియు
నాత్మఁ దలఁపక యుదయింపఁ నయ్యె నితనిఁ
గూల్చి రాక్షసలోకంబుఁ గూల్తుఁ గాక.

(శరము దొడుగును)

సుషేణుఁడు:—దేవా! దేవా!(అఁగుచు)హనుమ హనుమ. అతఁడు సూర్యుఁడు గాఁడు.

ఆ. వె. వలదు వలదు దేవ వదలంగ బాణము
నినుఁడు గాఁడు హనుమ యేగుదెంచె,
ద్రోణగిరిని నోషధులనుండి వెలువడు
కాంతి యద్ది యినుని కాంతి గాదు.

అదియు నుత్తరమున.

శ్రీరాముఁడు:—(చూచి శరము నుపసంహరించును.)

సుగ్రీవుఁడు:—అదే యాహనుమంతుఁడే వచ్చుచున్నాఁడు.

హనుమంతుఁడు:—తెచ్చితి తెచ్చితి (అని ప్రవేశించి రాముసకు నమస్కరించి లేచి) దేవా! భవత్కృపను ద్రోణగిరి కరిగి యక్కడ నోషధులు నన్నుఁ గని మఱఁగికొన నాశైలమే కొని తెచ్చితిని.

సుషేణుఁడు:—నేఁ డెచ్చెదఁ జూడు మాయోషధుల. (నిష్క్రమించును)

శ్రీరాముఁడు:—హనుమంతా! ని న్నేను సూర్యుఁ డని భ్రమఁ జెంద యింతలోననే యుదయించెనని కోపమున బాణ మేయఁ జూచితిని సుమా.

హనుమంతుఁడు:—(స్వగతము) వీ రిరువు రన్నదమ్ములు నొక్కరూపువారె. తమ్ముఁడు నాపై బాణ మేసెను. అన్న యేయఁబూనెను.

సుషేణుఁడు:—(మూలికలు గొనివచ్చి లక్ష్మణునకు మే నెల్లఁ దడవి వాసన చూపించును.)

లక్ష్మణుఁడు:—(లేచి) నిలు నిలు దురాత్మా! రావణా! నీపని తీర్చెదను.

శ్రీరాముఁడు:—(లక్ష్మణుని నిలిపి) నాయనా! రావణుఁడు పాఱిపోయెను—వత్సా! హనుమంతా (హనుమంతు నాలింగనము చేసికొని)

ఆ. వె. తండ్రి నేఁడు నాదు తమ్ముని జీవంబు
లిచ్చి నన్నుఁ గరుణ నేలితయ్య!
నీదు సాయమునకు మోదంబు చేకూర
నేమి చేయఁ గలనొ యెఱుఁగ నేను!

హనుమంతుఁడు:—దేవా! నీ దాసుఁడను.

సుషేణుఁడు:—దేవా! ఓషధుల ప్రభావము గనుఁడు. యుద్ధమున మరణించినమన వానరు లెల్ల నా యోషధుల గాలి తాఁకుటతోడనే పునర్జీవితులైరి.

శ్రీరాముఁడు:—(మెచ్చి) ఇది యీ హనుమంతుని కరుణ!

(తెరలో వానరుల సింహనాదము.)

శ్రీరాముఁడు:—రాక్షసుఁ డొక్కఁడైనను బ్రదుకఁడేమి!

విభీషణుఁడు:—సముద్రమునఁ బడియున్నారు దేవా మృతరాక్షసులు.

సుగ్రీవుఁడు:—అది రావణుని రాజనీతి.

సుషేణుఁడు:—హనుమంతా! ద్రోణగిరి నెప్పటట్ల యుంచి రావలయును జుమా.

హనుమంతుఁడు:—అ దెంతపని. (నిష్క్రమించును.)

(యవనిక పడును)

# శ్రీరామపట్టాభిషేకనాటకము.

## పంచమాంకము



### ప్రథమస్థలకము.

[ప్రదేశము:—రావణు నంతఃపురము.]

[మందోదరి(దుఃఖమున), రావణుఁడు భార్య నూఱడించుచుఁ బ్రవేశించుచున్నారు.]

మందోదరి:—అక్కటా! నాథా! నాముద్దుమేఘనాదునిపాలిటి మారి లక్ష్మణుఁడు చావఁడు. నా గతియిటయ్యె. నీకన్నులయెదుర నే పరాభవింపఁబడితిని. ఏమి చేయుదు నింక!

చం. ఘనుఁ డగు నమ్మయాసురునకుం గాదిలికూఁతురనై జనించి పా
వన మగుబ్రహ్మవంశమునకుం బ్రవిరిఁ జొచ్చి త్రిలోకజేత రా
వణునకు భార్యనై విమతవంద్యులఁ బుత్రులఁ గాంచి యెంతయుఁ
ఘనతఁ జెలంగి హా! తుదినిఁ గట్టిఁడివానరుచేతఁ జిక్కితిన్.

రావణుఁడు:—ప్రేయసీ! ఊఱడుము. ఆయంగదహంతకుని నేలఁ బడఁగొట్టితిని గదా. ఇంక నా గురాత్ముఁ డగు రాముని దగటార్చి యంగదుచే నాయజ్ఞమునకు భంగ మొందింపఁజేసిన పాప ఫల మనుభవింపఁజేసెదను. ఆహీనవానరునిఁ బొలియింతును. నీ వూఱడుము. నిన్నుఁ జెనఁకిన యాదుష్టుఁడు మహేశ్వరుఁడే యగుఁ గాక. వానిని మన నిత్తునా! ఇదె రణమునఁ గేగి వానరసైన్యంబునంతయు నేలకుఁ దెచ్చి రామలక్ష్మణులఁ బొలియించి నీయార్తిఁ దీర్తు నూఱడుము.

మందోదరి:—నాథా! నా కేవిధమునను నూఱట గలుగదు. నీ కింకను నారామునిపైఁ బగ యేల! అతనితో సంధి సేసికొని యైన నుండరాదా.

రావణుఁడు:—మందోదరీ! నీ కేమి వెఱ్ఱిపట్టెనా? నాబల మెఱిఁగియు నిట్లాడుదువే? ఇదె రణమున నాహీనమానవునిఁ ద్రుంచివైచెదను జూడుము. మూఁడులోకములలోనిసురాసురయక్షకిన్నరుల నెవ్వరి నైనను జీరికిఁ గొనని నేనా యీనరమాత్రుఁ డగురామునితో సంధి చేసికొన వలయు! ఎంతటిచేలవు! నాకుఁ బత్ని వగుట వీరపత్నివియు నింద్రజిదాదులమాత వగుట వీరమాతవు నగు నీ కిట్టిపిఱికితన మెట్లు పట్టువడెను. అబలా! నీమనస్సున నింత యోపిక పట్టుము. ఆరాము నిప్పుడే వధియించి వచ్చెదను.

కం. నాకొలఁది యెఱుఁగ కిప్పుడు
నీ కీగతిఁ బలుక నయ్యెఁ నీరజనయనా,

డీకొని రాముని రణమున
నాకాలుని కతిథిగాఁగ నంపెదఁ గనుమా.

మందోదరి:—వల్లభా! ఊరక కేల యిట్లు పట్టు పట్టెదవు? రామునిఁ జంపివైచెద నని విక్రమింపఁ జూచితివి.

ఉ. వచ్చినవాఁడు కేవలుఁడె వల్లభ నీమది నెన్నవైతి వీ
వచ్చినవాఁడు వెన్నుఁడు సురపక్షులు నీచలపాదిచేఁతలన్
హెచ్చుగ నార్తి వేఁడఁగను నీగతి నిన్నునిఁ జంపి వారలన్
మచ్చికఁ బ్రోవఁగాఁ దివిరి మాన్గొన వచ్చినవాఁడు చూడఁగన్.

సీ॥ మత్స్యమై సోమకు మ్రందించి వేదంబు
లెలమి బ్రహ్మకు నిచ్చె నితఁడు కాఁడె
కూర్మమై వెన్నునఁ గొండ యెత్తి సురాలి
కింపుగ సుధ యిచ్చె నితఁడు కాఁడె
ఘోణియై కనకాక్షుఁ గూలిచి ధర నెత్తి
యిలకు సేమం బిచ్చె నితఁడు కాఁడె
నరహరియై హిరణ్యకశిపుఁ జీల్చి త
త్సుతునకుఁ బ్రాపిచ్చె నితఁడు కాఁడె.

తే. గీ. వామనుం డయి బలిఁ గట్టి స్వర్గవిభుత
నేపుతో వాసవున కిచ్చె నితఁడు కాఁడె
పరశురాముఁడై రాజులఁ బట్టి చంపి
యిలను బ్రాహ్మణులకు నిచ్చె నితఁడు కాఁడె.

మనోనాయకా! అట్టిలీలామానుషవేషుని జయింప నీ కలవి యగునా? నీ కెట్లును నాతని శరములవ్రాతి నిక్కము.

రావణుఁడు:—తరుణీమణీ! నీచెప్పిన దెల్ల నేనును నెఱుంగుదును. తొల్లి దిగ్విజయము సేయుచు నే నిక్ష్వాకువులపై నెత్తిపోయితిని. అప్పు డనరణ్యుం డనురాజేలుచుండెను. కయ్యంబున నాత నిఁ గ్రిందఁ గెడపి యాతనికుత్తుక నుత్తరింపఁ బూనితిని. అప్పట్టున నాయనరణ్యుం డెంతయు నాపైఁ గనలి తనవంశంబునఁ బుట్టినవానిచేత నే నాకు మరణంబుగావుత మని బిట్టు శపియించెను. నేను బరమేష్ఠినిఁ బ్రత్యక్షీకరించుకొని వరము లడుగువేళ నెల్లసత్త్వములచేతను నవధ్యత్వము గోరితిని గాని నరవానరులచేతియవధ్యత్వము గోర నయితిని.

అలివేణీ! ఇంకొక్క రహస్యవృత్తాంత మెఱిఁగించెద వినుము. దిగ్విజయమువేళ నొక్కనాఁ డేను గపిలమునీంద్రునాశ్రమమున కరిగితిని. అప్పు డామునీశ్వరుఁడు నాకు విశ్వరూపముఁ జూపించెను. నేనును నాతేజస్స్వరూపముఁ జూడఁజాలక వెఱఁగుపడితిని. అంత నాదేవుఁడు నాకుఁ దనచేత నే మరణం బని వ్రాక్రుచ్చెను. ఆరూప మిప్పుడు నాకన్నులఁ గట్టిన ట్లున్నది.

మందోదరీ! వేయేల! ఆకపిలమహామునీశ్వరుఁడే శ్రీమన్నారాయణుఁడు. ఆనారాయణుఁడే యీశ్రీరామచంద్రుఁడు. మున్ను నాకు బ్రహ్మయిచ్చిన వరము లమోఘములు గానీకుండ వానరులను దోడుచేసికొని నరరూపమున ననరణ్యునిశాపోక్తులు ఫలియింప నాతని వంశంబున నానారాయణుఁడే తనచేలిమరణము నాకుఁ గలిగింప శ్రీరాముఁ డన్నపేర నవతరించి యిప్పుడు నాపై నెత్తి వచ్చి నన్ను సమయింప నున్నవాఁడు.

చం. ఎఱుఁగుదు మున్నె రామవిభుఁ డీ డెన్నఁగ వెన్నుఁ డటంచు నిర్జరు
ల్మఱిమఱి నన్నుఁ జంప బతిమాలఁగ నీగతి వచ్చె నంచు న
త్తెఱఁ గది యెల్ల నావిభుని దేవిని దొంగిలి తెచ్చినాఁడ ని
త్తఱి ననుఁ జంప వేగముగఁ దాఁ జనుదెంచు నటంచుఁ గాంతరో.

కాంతామణీ! నేను బుట్టినదాదిగఁ జేసినపాపకార్యము లెన్నియో కలవు. అవి యెల్ల నన్నలయించి పాలియింపకుండు నా.

చం. చెఱిచితి జన్నముల్ విబుధశేఖరపాళిని భంగపెట్టితిం
జెఱఁగొనితిం బతివ్రతలఁ జేడ్పడఁ జేసితి మానులన్ సతీ
యెఱుక దొఱంగి పేర్చి యలయించితి లోకము లెల్లవేళ ని
త్తెఱఁగున హింసలే చలిపితిన్ మఱి మే లెటు నాకుఁ జేకుఱున్.

ఎట్లును నా కారామచంద్రునిచేతఁ జావఁగలపుణ్య మబ్బిన దని సంతోషపడువాఁడ. నీకును నాకును నేఁటితో నెల్లసంబంధములు వీడె. ఇంక నేను రణరంగమున కేఁగెదను. సంతుష్టమతివై నన్నంపుము.

మందోదరి:—హృదయేశ్వరా! నే నేమి చేయుదాన. నాకు మామయ్య జరామరణంబులు గలుగ కుండునట్లు వర మిచ్చియున్నవాఁడు. ఆవరము కారణముగ నీతోడ నేను సహగమన మొనరఁ జేయరాకుండుటఁ జేసి యింక నాగతి దుర్గతి యయ్యె. నీతమ్ముఁడు విభీషణుం డింక నీరాక్షసరాజ్యంబు నేలఁగా నా కాతనిదేవిని సరమ నాశ్రయించి బ్రదుకనయియున్నయది.

తే. గీ. సంతతంబును వేవు రప్సరస లెనసి
భక్తి సేవింప నింపుమైఁ బరఁగునాకు
నకట యేరాలియాజ్ఞల నడఁగి మడఁగి
గాసిపడి సేవ చేయంగఁ గాల మయ్యె.

(దుఃఖించును.)

రావణుఁడు:—మానినీ! నీ వెల్లను నెఱుంగుదువు. ఊరక యిట్లు దుఃఖించిన నేమి ప్రయోజనము?

(ఓదార్చుచుండును.)

(తెర వ్రాలును.)

# పంచమాంకము.

## ద్వితీయస్థలకము.

[ప్రదేశము: యుద్ధరంగము]

[రాముఁడు (ధనుర్ధరుఁడై) లక్ష్మణసుగ్రీవాదులతోఁ బ్రవేశించుచున్నాఁడు.]

రాముఁడు:—అంగదా! ఏఁడీ యారావణుఁ డింకను రాఁ డేమి?

అంగదుఁడు:—దేవా! ఇంతకు వచ్చుచునే యుండును. యుద్ధసన్నద్ధుండై రా నించుక వేళ యగుచుండును.

హనుమంతుఁడు:—ఇంకను నేమి సన్నాహము. ఆదుష్టుఁ డాచరించుచుండినపాతాళహోమము పాడుచేసితిమి గదా. రానిమ్ము. ఈపరి వానిమరణము నిశ్చయము.

రాముఁడు:—అది యెట్లు?

హనుమంతుఁడు:—ఏకార్యముచే వాఁడు బ్రదుక నెంచియుండెనో, యది భంగము నొందెను. ఇంకెట్లు వాఁడు మనఁగలఁడు. దేవర తేజోగ్నిచేతనే వాఁడు దగ్ధుఁడు గాకుండునా!

రాముఁడు:—లక్ష్మణా! లక్ష్మణా! ఆదివ్యరథమును జూచితివా. ఆహా! అది మనచేరువకే వచ్చుచున్నది—దీని నెక్కడనో చూచిన ట్లున్నది.

జాంబవంతుఁడు:—(చూచి) దేవా! అది దేవేంద్రునిరథము.

రాముఁడు:—అవు నవును. నేను దీనిని మున్ను శరభంగమునినాథునియాశ్రమమునొద్దఁ జూచియుంటిని. దీనియందుఁ గూర్చుండివచ్చియుండిన యాదివ్యపురుషుఁడు దేవేంద్రుఁ డని యామునిగ్రామణి నాకుఁ జెప్పియుండెను.

లక్ష్మణుఁడు:—ఇప్పు డాదేవేంద్రుఁ డిందు లేఁడు.

రాముఁడు:—లేఁడు. ఇదేల యీరథ మిట్లు రథికుఁడు లేక వచ్చుచున్నది.

హనుమంతుఁడు:—దేవా! దేవా! అటు చూడుము. ఆకసముననుండి యింతవఱకును నిజతేజంబును సూర్యునట్లు నల్దెసలకుఁ బఱపె యిప్పు డాతేరు నేలకు దిగినది.

సుగ్రీవుఁడు:—అది మనచెంతకే వచ్చుచున్నది.

జాంబవంతుఁడు:—వాఁడె మాతలి యాతేరు దోలికొని యిట్లె వచ్చుచున్నాఁడు.

(ఉక్తరీతిని మాతలి ప్రవేశించి తేరు దిగి రాముని డకు వచ్చి నమస్కరించి)

మాతలి:—దేవా! నేను సురేంద్రునిరథచోదకుఁడను. మాతలియనువాఁడను. అతనిపంపున దేవర సన్నిధి కరుదెంచినాఁడ.

రాముఁడు.—సురేంద్రునకు సేమమా?

మాతలి:—భవన్నిరుపమానకరుణారసార్ద్రదృష్టిప్రసారంబునను, వైరిపక్షకంఠదళనచణతావకీన మహావీర్యంబునను నాదేవేంద్రుని కింక నిక్కముగ సేమమే.

రాముఁడు:—మాతలీ! ఆదేవవిభుఁడు ని న్నేల నాకడ కిట్లు తేరితోఁ బంపియున్నవాఁడు?

మాతలి:—రాజన్యచూడామణీ! దేవరకును రావణునకును నిప్పుడు పొసఁగ నున్నమహాయుద్ధంబున రిపుఁడు రథస్థుఁడై యుండ దేవర భూతలస్థితులై యుద్ధ మాచరించుట సమరభంగి గా దని దేవరకై సురేంద్రుఁడు దివ్యధనుశ్శరములును శస్త్రాద్యాయుధనికరంబును దివ్యకవచంబును నీరథంబును నంపియున్నాఁడు. ఈరథమున నే కదా యామహేంద్రుఁ డాసీనుఁడై పాకబల జంభాదిపూర్వగీర్వాణులగర్వంబు పోవఁ జంపియున్నవాఁడు. ఏ నెల్లప్పుడు నాతనిసారథినై యుండుటకతన నీరథమాహాత్మ్య మింత యెఱిఁగియున్నవాఁడను.

రాముఁడు:—మాతలీ! నిరుపమానము గదా దేవవిభునికరుణ నాయెడ. నిక్కంబుగ నీయుపకర ణంబులసాహాయ్యంబున నాకు వైరివిజయము సుకరము సుమా.

కం. తే రది దేవేంద్రుని దఁట
సారథియును మాతలి యఁట సమరాయుధముల్
వారక యింద్రుని వే యఁట
వైరిని నాశ్చర్యమగు నె కపటు నేయంగన్

మాతలి:—భవదప్రమేయశౌర్యంబున కిది యేమి పెద్ద. ఇనకులేంద్రుఁ డీయుద్ధసమయమున నీయుప కరణంబు లుపయోగింపఁ దగు నని సురేంద్రునిచ్ఛ.

రాముఁడు:—అవశ్యముగ ననుష్ఠేయము గదా దేవవల్లభునియానతి యెల్లవారికిని. కావున నమరేం ద్రునాజ్ఞమై నడచువాఁడను.

మాతలి:—వాఁడే త్రిలోకకంటకుఁ డగు రావణుఁడు వచ్చుచున్నవాఁడు. దేవర యింక రథ మెక్కవలయును.

రాముఁడు:—ఇదే యెక్కుచున్నాఁడ. (తే రెక్కును.)

(రావణుఁడు రథ మెక్కి ప్రవేశించుచున్నాఁడు.)

రావణుఁడు:—రామా! నీవును నొక్క వీరుఁడవా? స్త్రీల నేడ్పించి తేర నాజ్ఞాపించితివి గదా.
అంగదుఁడు:—ఓరీ! ఊరక రామచంద్రు నేల గర్హించెదవు?

కం. పతిచెంత లేనితఱి ద
త్సతి దొంగిలి తెచ్చు టేమిశౌర్యం బని నీ,
సతి నీవు చూచుచుండఁగ
నతిశూరత నీడ్చినాఁడె యనఘమనిశాటా!

ఇప్పుడు నీ వాడినయాధర్మము లన్నియు నీవు సీతాదేవిని ముచ్చిలించికొనివచ్చిననాఁ డేమి యయ్యెను. పరోపదేశమునఁ బండితశేఖరుఁడవే నీవు.

రాముఁడు:—నే నెట్లు వీరుఁడ నగుదును. మగలు దగ్గఱ లేనప్పుడు మగువల నేకపటసన్యాసిగనో మోసపుచ్చి చెఱఁబట్టుటే వీరపురుషోచితకార్యము.

రావణుఁడు:—(స్వగతము) ఈతఁ డెట్లు రథి యయ్యె. (చూచి) ఓహో! ఇది సురేంద్రునిరథము. వాఁడె మాతలి సారథ్యము చేయుచున్నవాఁడు. (ప్రకాశము) ఇంద్రునిరథ మెక్కినంత నే

వింత పౌరుషము కలుగు ననుకొంటివో. ఇదే నిన్నుఁ జంపి నీ కీరథము నెఱ విచ్చినయాయెుఁ! గ్రుని పని తీర్చెద నుండుము. ఇంతలో నే మయ్యెను. ఈ కూర్రా స్త్రము పాలు గాకుండఁ గాపాడుకొనుము.

(ప్రయోగించుట నభినయించును. చీఁకటు లగును. సూర్యుఁడు కాంతి లేక తోఁకచుక్కతోఁ గూడఁ గనఁబడును. వానరులు హా! రామా! హా! రామా! యని యాక్రందింతురు.)

(యవనిక పడును.)

---

## పంచమాంకము

### తృతీయస్థలకము

[ప్రదేశము:—యుద్ధభూమి (ఆకాశమార్గము.)]

[రంభానలకూబరులు ప్రవేశించుచున్నారు.]

రంభ:—నా కేమో భయ మగుచున్నది. అఖిలుఁడు రావణుఁడే జయించున ట్లున్నది.

నలకూబరుఁడు:—గోలా! భీతిల్లకుము. అదే వినుము. వానరులసింహనాదము. శ్రీరాముఁడు రావణు నిపై నెట్లు శరవర్షము గురియించుచున్నాఁడో చూడుము.

రంభ:—ఆహాహా! ఆకూర్రుఁడదే రామదేవునిపై శూలముఁ బ్రయోగించుచున్నాఁడు.

నలకూబరుఁడు:—అదే చూడు. రాజపుత్రుఁడాశూలము నింద్రశక్తి వైచి విఱుగఁ గొట్టివేసెను.

(తెరలో రాముఁడు)

రాముఁడు:—రాక్షసాధమా! చూచితివా! నీశూలమున కేమి గతిపట్టెనో. జానకి వనమునఁ గూయి లేక యొంటి నుండ దొంగవై యపహరించి తెచ్చితివే. దీన నీ కేమి యశము కలిగెరా దుర్మతీ. నీ యీచౌర్యము ఘనకార్యముగఁ జెప్పికొని నిన్ను నీవే యగ్గించుకొనుచు శూరుల యెుగుట నేను శూరవరుఁడ నని మీసలు దువ్వుచుఁ దిరుగ నీకు సిగ్గు లేదఁటరా శూరం మన్యా. శూరవరుఁ డగు కుబేరునితమ్ముఁడవు! నీవు బలిష్ఠుఁడగుటకు నీవు పెద్దలు కొనియాడఁ దగినయట్టిపనియే చేసితివి. బుద్ధిమద్వరిష్ఠుఁడవు. ఈసీతాహరణకరణము నాసన్నిధినిఁ జేయ వైతివి. అట్లె యుండిన నాఁడే నిన్ను ఖరదూషణాదిజనస్థానరాక్షసులకుఁ దోడుగఁ బంపి యుండుదును. ఇప్పు డేమయ్యె. ఎట్లును నేఁడు నాయెదుటఁ బడితివి. ఇం కెందుఁ బోఁ గలవు. నీమునుపటియాట లింక నిక్కడ సాగిరావు.

స్రగ్ధర. ఓరీ రాత్రించరా నీయురము నిదె మదీయోగ్రబాణాళి చీల్పన్
సారంపుస్నేత్రువాఁకల్బవి యెసఁగఁగ నాస్వాదముం జేయుచున్నీ
క్రూరాంగవ్రాతమందుం గుములుగుములుగంగూయుచున్నాఁగి పక్షుల్
చీరంగా నీద్భుతం జెచ్చెర నురగములంజీల్చుతాత్త్వాళి నాఁగన్.

నలకూబరుఁడు:—రంభా! అదే నిన్ను భంగపెట్టినయానిశాటాధముఁడు మూర్ఛిల్లినాఁడు చూడుము.

(తెరలో వానరులసింహనాదము.)

రంభ:—చూడుము వానరు లెట్లు గంతు లిడుచున్నవారలో. అదే వానరు లొకరి నొకరు మోచికొని యెగురులాడుచున్నారు. ఆహాహా! (నవ్వును.)

నలకూబరుఁడు:—ప్రియా! చూడుము. రావణునిసారథి తేరు మరలించుకొని పోవుచున్నాఁడు. రమ్ము రమ్ము. మన మక్కడికిఁ బోదము. (నిష్క్రమింతురు.)

---

పంచమాంకము.

చతుర్థస్థలకము.

[ప్రదేశము—అదే యుద్ధభూమి.]

[అగస్త్యుఁడు, రాముఁడును ప్రవేశించుచున్నారు.]

అగస్త్యుఁడు:—దేవా! ఆదిత్యహృదయము ముమ్మారు పఠించితివి గదా. ఆసూర్యదేవు నింకఁ జక్కఁగఁ బ్రార్థించుకొనుము. అతఁడు నీకుఁ బ్రసన్నుఁడై వైరివిజయము గల్గించువాఁడు. ఎట్టివేళల నైన నాదేవుఁ డీస్తోత్రమునకుఁ బరమప్రీతుండై యెట్టిసంకటముల నైనఁ బోకార్చి యభీష్టములఁ గూర్చువాఁడు. అతనినిఁ జక్కఁగ వేఁడుకొనుము.

శ్రీరాముఁడు:—

కం. అరివధ మొనరింపఁగ నర
హరిరూపం బెత్తినట్టియనఘుని నఘసం
హరు నఖిలయజ్ఞరూపుని
బరమగతిని నిన్ను వేఁడువాఁడ ననంతా.

ఆ. వె. మూఁడుమూర్తులకును మూలంపుటిక్కవు
కర్మసాక్షి వయ్య కమలమిత్ర
వేఁడువాఁడ వైరివిజయం బొసంగి న
న్నేలు హంసరూపహృదయ మలర.

(నమస్కరించును.)

(రవిమండలమున రవి మూర్తీభవించి రాముని గాంచి)

సూర్యుఁడు:—వత్సా! రామచంద్రా! నీవు నాకులమువాఁడ వన్నంతయే కాదు. నాకులమునే కాక యెల్లలోకములను నన్నుఁబోలె ననఘతేజంబునఁ బవిత్రీకరింప నవతరించిన నామూర్తివే నీవు. మర్త్యలోకసహజగుణ మగు సందేహము నొందకుము. లోకకంటకుఁడగు దశకంఠుని శీఘ్రమే సంహరించి సర్వలోకహితము గల్గింపుము.

రాముఁడు:—దేవదేవా! నీదర్శన మిచ్చి నన్నుఁ గృతార్థుఁ జేసితివి. నీయమోఘాశీర్వాదప్రభావమున నీ వానతిచ్చినట్లే చేసెద. (నమస్కరించును. సూర్యుఁ డంతర్ధానము నొందును.)

అగస్త్యుఁడు:—రామచంద్రా! అదే రావణుఁడు వచ్చుచున్నాఁడు. జయింపుము.

(నిష్క్రమించును.)

రాముఁడు:—(చూచి రథ మెక్కి) మాతలీ, చూచితివా.

తే. గీ. రావణాధముకాంచనరథము మరల
భూరివేగముతోడుతఁ ఘోరభంగి
వచ్చుచున్నది వాఁ డాత్మవధముకొఱకు
నిట్లు వడివడిఁ బఱతెంచినట్లు దోఁచు.

కం. పగ్గములు వదలు మించుక
గ్రొగ్గతిలఁగ నీకు తురగములరయమునఁ దే
రగ్గలికఁ దోలుమా నీ
వెగ్గతి హృదయంబు చెదర నీకుము సూతా!

మాతలీ! ఇట్లు నీకుఁ గఱపితి నని నాపైఁ గోపగింపకుము. నీ వింద్రునంతటివానికి రథము గడపుమహాత్ముఁడవు! నీకు నేను జెప్పవలయునా. వైరివధమునకుఁ దీవరించు బుద్ధితోఁ జెప్పితిని. తప్పుగాఁ బట్టకుము.

మాతలి:—దేవా! అట్లెన్నఁడు నెన్నకుము. నీయిష్టానుసార మాచరించువాఁడను. ఈసేవకుని నీ యిచ్చవొప్పనఁ బనిగొనుము.

(తేరు దోలికొని పోవును.)

# పంచమాంకము.

## పంచమస్థలకము.

[ప్రదేశము—అదే రణరంగము.]

[ఒండొరుల నెదుర్కొనుచు శరముల నేయుచు రథస్థులై

రామరావణులు ప్రవేశించుచున్నారు.]

రావణుఁడు:—రామా! అన్నియు నాయెఁ గదా. ఇంకే శస్త్రాస్త్రములఁ బ్రయోగింతువు. నన్ను డీకొని మననేర్తువా. కానిమ్ము నేఁటితో భూమికి నీబరువు దీర్చెదను.

రాముఁడు:—(స్వగతము) ఆహా! ఏమి చేయుదు నింక. ఎన్ని మాఱు లుత్తరించినను వీనితలలు మరల మరల మొలచుచున్నవి. నాబాణములసత్త్వమింతయే యగునా. అక్కటా!

కం. ఖరునిన్ దూషణుఁ ద్రిశిరుని
హరివరుని విరాధు నెట్టియమ్ములనేఁ జె
చ్చెర నిర్జించితి నిపు డా
శరములు రావణునియెడ నస్సారము లగునే.

రావణుఁడు:—ఏ మూరకైతివి. నేను వృద్ధాంగన యగుతాటకను గాను సుమా.—ఇదే నీపని తీర్చెద. (శరము లేయును.)

మాతలి:—(జనాంతికముగ) దేవా! ఇది యేల యిట్లెఱుఁగనివానియట్లూరక యోజించుచున్నాఁడవు! వీఁడు బ్రహ్మాస్త్రమునఁ గాని చావఁడు. ఆమహనీయాస్త్రము నాలస్యం బొనరింపక వీనిపైఁ బ్రయోగింపుము.

రాముఁడు:—మహాత్మా! లెస్సగ జ్ఞప్తి సేసితివి.

(బ్రహ్మాస్త్రము దొడుగును. దిక్కులన్నిటను భీకరధ్వనులు పుట్టును. చీఁకటు లగును)

రావణా! సీతాపహరణపాపఫల మిదే యనుభవింపుము. (ప్రయోగము నభినయించును. రావణుఁ డాక్రందించుచు నేలపైఁబడి మరణబాధనొందుచుఁ బొరలాడును. వానరు లెల్లరు జయజయ నాదములతో శ్రీరాముని చెంత కేగుదురు.)

(విభీషణుఁడు హా! రాక్షసచక్రవర్తీ. అని యన్నకడ కేడ్చుచుఁ బోవుచున్నాఁడు)

విభీషణుఁడు:—అన్నా! నామాటలన్నియు గీటునఁబుచ్చితివే. ఇప్పుడేమి ఫలము గంటివి. అపారమహిమోపేతుఁడైనరఘురామునితోడివైరము వలదు వల దని మఱిమఱి చెవి నిల్లుగట్టుకొని చెప్పితిని. విన వైతివే.అన్నా! నేఁటితో నీలోకమున నీతోడ శూరపద మస్తమించెనా?

మ. వల దన్నా రఘురాముతోడ నిటు లీ వైరంబు నీ కంచు మై
థిలి నారాముని కిమ్మటంచును ధరిత్రీజాతపై మోహముఁ
దాలఁగం బెట్టు మటంచు నేవిధములన్ ద్రొవ్వఁగాఁ బల్కనా
పలుకు ల్మ్రొల్కులు వోలెఁ దోఁచె నిపు డీ పాటుగతి౯ సైతువో.

ఆ. వె. కడిమి మెఱయ ముజ్జగంబుల నోర్చిన
శూరవరుఁడ విట్లు ఘోరభంగి
బవరమందు నేఁడు పడియుండుటను గాంచి
యెట్టు లోర్తు నయ్య యింక నేను.

రావణుఁడు:—వత్సా! ఊఱడుము. శూరునకు యుద్ధమరణము ప్రశస్తము. రణముఖమున జయాపజయములు దైవాధీనములు. శూరవరేణ్యుఁడును, గోదండగురుఁడును, సింహసంహననుఁడును, ధీరోదాత్తుఁడును నగు నమ్మహావిష్ణుఁడే రామాకారత నన్నుఁ గెడపియుండుటంజేసి నీ వించుకంతయు నాకై చింత నొందకుము. తమ్ముఁడా! విభీషణా! భగవంతుఁ డగు శ్రీరామచంద్రుని మఱుఁగుసొచ్చితివి. నీకుఁ దండ్రియైనను నన్నయైనను గురుఁడైనను దైవమైనను నాతఁడే—రామచంద్రా! నే నీకుఁ జెప్పఁదగిన దేదియు లేదు. నీవు సర్వవిదుఁడవు. ఈవిభీషణుఁడు నీకు భక్తుఁడు. వీని నెట్లు ప్రోచెదవో. నీతోడిపోరాటంబునంజేసి నేఁడు నాశూరత్వము సార్థకత గాంచెను.

రాముఁడు:—దానవేశ్వరా! అట్లు కాదు. త్రిలోకవిజయి వగు నీతోడఁ బోరి జయంబు గనుట నీచేత నాశూరత్వము సార్థకత గాంచెను. ఇంక నీ కీప్రాపంచికచింతలతోఁ బని యేమి!

రావణుఁడు:—రామచంద్రా! నీకృపాగుణ మగణ్యము. వేళకు లెస్స జ్ఞప్తి చేసితివి. దీనికైకదా యింత చేసితిని. విభీషణా! న న్నింత యెత్తిపట్టుకొనుము. (విభీషణుఁ డట్లు చేయ రావణుఁ డంజలిపట్టి ధ్యానతత్పరుఁ డగుచున్నాఁడు.)

**యవనికపడును.**

---

పంచమాంకము.

షష్ఠస్థలకము.

[ప్రదేశము—లంకాపురి వెలుపటి బయలు.]

[శ్రీరామవిభీషణులు ప్రవేశింతురు.]

రాముఁడు:—విభీషణా! సమరమున మరణించుట శూరసమ్మతమైన కార్యము. రణమునఁ జచ్చిన రాజు శోచ్యుఁడు గాఁడు. అనంతరకర్తవ్యము విచారింపుము.

విభీషణుఁడు:—దేవా! ఈతఁడు సాధుజనగర్హితుఁడు. ధర్మదూరుఁడు. సాధుజనులను మునిజనంబులను నెల్లవేళల హింసించుచుండినట్టివాఁడు. ఈఘోరకర్ముఁడు నాకు భ్రాతృరూపశత్రుఁడు. అఖిలలోకాహితుఁడు. గౌరవానర్హుఁడు. వీనికి నే నపరకర్మంబు లొనర్చుట నాకు సమ్మతంబు గాదు. లోకులు తొలుత నన్ను మూర్ఖుఁ డని నిందించినను నీతనిదౌరాత్మ్య మంతయు విని నన్నుఁ బరమసుకృతి యని మన్నింతురు.

రాముఁడు:—విభీషణా! నాకుఁ బ్రియమైనది నీకుఁ జేయఁదగినది. నీకు హితము గూర్చునది నాచేత నీ కుపదేశింపఁదగినది. ఈరావణసంస్కారంబు నాకుఁ బ్రియమును నీకు హితమును గలుగఁ జేయునట్టిది. నీ విప్పు డాడినదుర్గుణము లెల్ల నీతనియెడ నున్నను నీతఁడు మహాబలిష్ఠుఁడు. రణశూరుఁడు. మహాత్ముఁడు. సురేంద్రాదిదిక్పాలకులతోడఁ బోరి పరాజయ మన్న నెట్టిదియో యెఱుంగనివాఁడు. మిత్రమా! స్నేహవిషయమున నీతఁడు నీ కెట్టివాఁడో నాకును నట్టివాఁడే యగును. వైరములు మరణాంతములు కావున నాపలుకులు మన్నించి యీతని యౌర్ధ్వదైహికక్రియలు నిర్వర్తింపుము.

విభీషణుఁడు:—దేవా! నీయానతిమెయి నడచువాఁడను గదా! నీయిచ్చచొప్పున నట్లే కావింతును.

(నిష్క్రమింతురు.)

---

## పంచమాంకము.

### సప్తమస్థలకము.

[ప్రదేశము—యుద్ధభూమి.]

[శ్రీరామాదులు (తిరస్కరిణి వహించి రంభానలకూబరులు) ప్రవేశించుచున్నారు.]

విభీషణుఁడు:—(రాజవేషమునఁ బ్రవేశించి) వానరులారా! ఎడ గలుగ నిలిచి జానకీదేవి యెక్కివచ్చుచున్నరత్నయానమునకుఁ ద్రోవ యిండు. ఒత్తగిలుఁ డొత్తగిలుఁడు. (అని వారల నొత్తగిలఁ జేయుచున్నాఁడు.)

శ్రీరాముఁడు:—లంకాధిపా! విభీషణా! వానరుల నేల గాసిపఱచెదవు. వీరు మాకు స్వజనము సుమా! వారిని జెంతలనే యుండనిమ్ము. అంతియేకాక పరిణయమునందును వ్యసనములందును యజ్ఞమునందును స్వయంవరమునందును యుద్ధమునందును గృచ్ఛ్రములందును భర్తయెదుటను సతిదర్శనము దూష్యము గాదు. ఈవనిత యుద్ధగత. కృచ్ఛ్రగత. వ్యసనసంగత. మదభ్యాశగత. కావున జానకి కుండుతెరమఱుఁగు నెడలించి కొనిరమ్ము. ఎల్లరును జానకినిఁ గందురు గాక. తద్దర్శనంబునందు దోస మింతయు లేదు సుమా.

(విభీషణుఁడు నిష్క్రమించును.)

హనుమంతుఁడు:—(స్వగతము) ఏమి రామదేవుఁ డిట్లు పలుకుచున్నాఁడు!

సుగ్రీవుఁడు:—(స్వగతము) రామప్రభున కింతలో భార్యాపేక్ష తగ్గెనా యేమి?

లక్ష్మణుఁడు:—(స్వగతము) అగ్రజునకు సీతాదేవియందుఁ బ్రియ మేమైనఁ గొఱవడెనా?

[విభీషణునితో సీతాదేవి ప్రవేశించుచున్నది.]

సీత:—(స్నిగ్ధన మేను సంకుచితము చేసి రామునిఁ గాంచి) ఆర్యపుత్రా! (అని నమస్కరించి లేచి మోమునఁ బట మొత్తికొని రోదనముచేసి యించుకవడికి నోదారి) (స్వగతము) నేఁడు గదా సుదినము. సౌమ్యమూర్తి రామమూర్తి దర్శనము లభించినది.

శ్రీరాముఁడు:— జానకీ! యుద్ధభూమిని శత్రువును దెగటార్చి నిన్నుఁ జెఱ విడిపించి నాపౌరుషము చెల్లించితిని. నాచిత్తమున నాఁటినుండిన వైరికృతావమానమును విషాదమును బోనడంచి యెంతయును గృతార్థుఁడ నైతిని సుమా.

కం. పౌరుషము తెలియ నయ్యెను
సారసముఖి నాదుశ్రమము సఫలతఁ గాంచెం
దీక్షించితి నాదువ్రానికి
ధారిణిలో నేను బరమధన్యుఁడ నైతిన్.

వనితా! ఏను జెంత లేనపుడు చలచిత్తుఁ డగు నీరావణుఁడు నిన్ను ద్రుచ్చిలించి కొనితెచ్చెను. నాపౌరుషశక్తిచే వానిని జయించి దైవకృత్యమగు దీనిని గెలిచితిని. ముల్లోకములను జేరు గాంచితిని. జనకపుత్త్రీ,

సీ. హనుమంతు నబ్ధిలంఘన మాది యగుపరి
శ్రమ మెల్ల నేఁడె పో సఫలమయ్యె
వానరసైన్యసంధానాదిసుగ్రీవ
కార్యముల్ నేఁడె పో గణన కెక్కె
శరణుఁ జొచ్చినవిభీషణునిసామ్రాజ్యంపుఁ
గోర్కియు నేఁడె పో కూడ నయ్యె
భూరిశౌర్యంబునఁ బోరినతరుచర
బృందము నేఁడె పో వినుతి కెక్కె

తే. గీ. లక్ష్మణా సమశౌర్యంబుకలలి వహించె
నస్మదీయవిక్రమము నుసార్థమయ్యె
భువనకంటకుఁ డైన యీపాలసుదిండి
కదనమున నేఁడు కూలినకారణమున.

కాంతా! ఇందఱి యీశ్రమ మెల్ల నీకై కా దని లెస్సగ నెఱుంగుము.

మ. తనచేపట్టినయింతి ద్రుచ్చిలినయాదైత్యాధముగ్ గెల్వ నో
పనివాఁ డీతఁ డటంచు లోకులు ననుం బ్రలీతులం బల్క నీ

కనితో మత్ప్రిబలారినిం దునిమి శౌర్యం బెక్కఁగాఁ జేసితిన్
వనితా నీకయి కాదు నమ్ము మిది డెందంబందుఁ బూర్ణంబుగన్.

తే. గీ. అతివ నీతోడ మాకుఁ గార్యంబు లేదు
సక్తి లేదు నీపై ననురక్తి లేదు
పల్కు లేటికి నే నొల్లఁ బడఁతి నిన్ను
నరుగుమా యిచ్చవచ్చినయట్టు లెల్ల.

జనకపుత్త్రి! ఆత్మపోషణార్థము పుత్రతుల్యు లగుభరతలక్ష్మణసుగ్రీవవిభీషణులలో నీ యిచ్చవచ్చినవానిఁ జేపట్టుము.

సీత:—(ఆపాదమస్తకము వడఁకుచున్నది.)

శ్రీరాముఁడు:—

మదనుఁడు దుర్నివారుఁడు సుకామా మఱి నీమహనీయరూపసం
పద యది యద్వితీయము తుషారమారహితుం డలపక్త్రికంఠుఁడున్
సుదతులసిగ్గులన్ బలిమిఁ జూఱల నాడెడుదోసకారి యి
ట్లాదవుటఁ జేసి యే నెటులకయొప్పుదు గైకొన నిన్ను జానకీ.

సీత:—(స్వగతము.)

క. మన్నన సేయు నటంచును
సన్నుతగతి లాలనంబు సలిపెడు నం చే
నెన్నితిని గాని రాముం
డెన్నఁడు నిట్లాడు నంచు నే నెంచితినే.

అక్కటా! నేఁడు నాపాడుచెవుల నేమి వినుచున్నదానను. భువనకంటకుం డగురావణుని మరణంబుతో నాయాపద లన్నియుఁ దీఱె ననుకొంటినే. నాహృదయేశ్వరుఁడు దుష్టకాంతల ప్రచారము లారసి స్త్రీజాతి యెల్ల నట్టిదే యని నన్ను నో నాడుచున్నాఁడు. (ప్రకాశము) మనోనాయకా! న న్నేటి కిట్లు వినరానికఠినవాక్యము లాడెదవు. ఇట్టిమాటలు నీ వనుటకును నే వినుటకును ననర్హములు సుమా! ఏను నీ వెన్నినట్టిదుర్జాతను గాఁజాలను. వీడుము. నీకు నాయందుఁ గలిగినయాశంక వీడుము—దేవా! చిరకాలముగ నొక్కచోట మెలఁగితిమి. ఒక్కటిగ వసియించితిమి. ఒక్కటిగ ముచ్చటలాడుకొనుచుంటిమి. ఒక్కటిగ నాటలాడుకొనుచుంటిమి. అక్కటా! ఇట్లయ్యును నామనోభావం బెఱుఁగవైతివే. హా! నీ విట్లాడుటకతన నేను హత నయితిని. ఇంతటియనుమానము నాయందుఁ బొడమియుండిన నాఁటికినాఁడే యేల నన్ను విసర్జింపవైతివి? నాకుశల మారసి రమ్మని హనుమంతు నేల పనిచితివి? అప్పటి నాయెల్లవృత్తాంతమును నతం డెఱిఁగియున్నవాఁడు. నీకు నావలనియొల్లమి యెఱింగియుండిన నే నప్పుడే ప్రాణత్యాగము సేసికొనియుందును గదా. ఇంతకాలమును నీవియోగబాధ నాకు లేకుండియుండును గదా. నీకును బ్రాణసంశయకరం బైన యీవ్యర్థయుద్ధశ్రమ యుండి

యుండదు గదా. నీసఖులైనసుగ్రీవాదులకు సయితము నీవ్యగ్రక్లేశము గలిగియుండదుగదా. అక్కటా! నీవు కేవల స్త్రీత్వమే పురస్కరించుకొని క్రోధము ప్రకటించితివి గాని నాశీలము పరికింపవైతివి. భూగర్భంబుననుండి యేను బుట్టుటయును బాల్యముననుండి యెసకమెసఁగిన నాచరిత్రమును విచారింపవైతివి. నాశీలమును, నీయెడఁ గలభక్తియు సర్వమును వెనుకకుఁ ద్రోచితివి. క్రోధము నొక్కటినే పాటించితివి—అక్కటా! ప్రాణనాథుఁడ వగు నీవే న న్నిట్టు లెరవు సేసిన నిప్పుడు న న్నెవ్వరు తేర్చువారు, నావెత పోకార్చువారు, నాకుఁ దుష్టి చేకూర్చువారు. (అని పరిక్రమించి లక్ష్మణునిఁజూచి) అన్నా! లక్ష్మణా! ప్రాణవిభునిచేత మిథ్యాపవాదము నొందిన నే నింక జీవింప నేర్తునా! ఈవ్యసనమున కే మందు? నాకుందు దీర్చుట కేది మందు? పేర్చుము. నాకుఁ గా నొకచితిఁ గూర్పుము. ఏ నిప్పుడే యెల్లరయెదుట నాయెడఁ బ్రీతి నొందక నన్ను విడనాడినభర్తయెదుటఁ బ్రమాణార్థమైనదీప్తపావకజ్వాలలఁ జొచ్చి శంకాదూషిత మగు మత్కళేబరము పవిత్రీకరింతుఁగాక.

(లక్ష్మణుఁ డన్న మొగము చూచును. రాముఁ డంగీకారము సూచించును.)

లక్ష్మణుడు:—(చింతించి) వానరవీరులారా! మాతల్లియభీష్టము. నెఱవేర్పుఁడు (వానరులు హా! యని దీనమనంబులతో నట్లు చేయుదురు. లక్ష్మణుఁడు వెల్గించును.)

సీత:—(రామునకుఁ బ్రదక్షిణము సేసి నమస్కరించి యగ్నిని సమీపించి ప్రదక్షిణనమస్కారములు సేసి యంజలి నోడించి)

ఉ. మానసమం దనాతరము ♦ మారఘురాము స్మరింతు నేని నా
దైనచరిత్ర మేయఘము ♦ నంటక దీప్తి వహించు నేని వా
జ్మానసకాయకర్మములఁ ♦ గాంతునిఁయిచ్చఁ జరింతు నేని స
న్మానముతోడ రక్షణము ♦ మా కొనరింపుము హవ్యవాహనా.

(అని యగ్గి నుఱుకును. వానరు లెల్లగు హాహానినాదము లొనర్తురు. అప్పు డాకసమునుండి యింద్రయమవరుణధనదులు, విధిశంకరులు పృథ్వి కవతరింతురు. రాముఁ డెల్లరకు నమస్కరించును.)

బ్రహ్మ:—నిలువరింపుము. నిలువరింపుము. (జానకీదేవిని పరిక్రమించి చితివంకఁ జూచి హా యని రామునివంకకుఁ దిరిగి) శ్రీరామచంద్రా! సర్వవ్యాపివి త్రిలోకైకరక్షాపరుండవు ను సర్వలోకజనకుండవు ను శ్రీమన్నారాయణుండవు ను నగు నీవే ప్రాకృతునిభంగి ని ట్లాచరించిన నే మనఁ గలవాఁడను. రావణవధంబుతోడ భువనక్షేమము చేకూరె. శేషించినకార్యములును దీర్చి స్వస్థానమునకు వేంచేయు నాదిదేవుఁడవు. వారే చూడుము శంకరసురేంద్రాదినిలింపులు నిన్నుఁ గొలువవచ్చినారు.

శ్రీరాముఁడు:—(పునఃప్రణామములు సేయును.)

(చితినుండి యగ్నిహోత్రుఁడు సీతను రామున కర్పించును.)

అగ్ని:—రామచంద్రా! ఈజానకీదేవి సాధ్వీమతల్లి. మనోవాక్కాయకర్మముల నిన్నుఁ దక్క లాతివాని నెన్నఁడు నెన్ననిది. రావణునిసామదానభేదదండంబుల కెంతయుఁ దరలనిది. రాక్షసాం

గనలతర్జనభర్జనోక్తులకు వెగడనిది. నావచనము పాటించి ప్రవిమలచిత్తయుఁ బతివ్రతాసాధ్వియు నగు నీజానకీదేవిని బరిగ్రహింపుము.

బ్రహ్మాదులు:—రామచంద్రా! ఈవైశ్వానరునివచనములు మన్నింపుము.

శ్రీరాముఁడు:—సర్వగీర్వాణులారా! జానకి పవిత్రచరిత్ర యని యెఱిఁగినవాఁడ నయ్యును శోధన చేయకయే స్త్రీలోలుఁడై రాముఁడు పరునియింట నుండిన తపపడఁతిని మరలఁ జేకొనియె నని లోకులు నన్ను ధిక్కరింతు రని యెంచి జానకి పవిత్రచరిత్ర యని వెల్లడింప నిప్పు డింత చేసితిని. లోకులును భవాదృశలోకపాలకులును నెల్లరు విలోకించుచుండ నీనాహృదయేశ్వరి తనశుచిత్వము తెల్లముచేసికొనెను. ఇదె హుతాశనునివాక్యంబుల నాయిల్లాలిని బ్రతిగ్రహించుచున్నాఁడను.—దేవీ, మన్నింపుము. (పరిగ్రహించును.)

శంకరుఁడు:—రామచంద్రా! ఇప్పుడు మా కందఱకును సంతోష మయ్యె. నీ వింక నయోధ్య కరిగి రాజ్యము గొని యేలుచు వంశకరు లగుపుత్రులను బడసి యశ్వమేధయాగము సేసి యప్రమేయకీర్తి గడించి స్వస్థానంబునకు వేంచేయుదువు గాక.

(అప్పు డాకసమునుండి విమానమున దశరథుఁడు దిగుచున్నాఁడు.)

శంకరుఁడు:—రామచంద్రా! అదే సురలోకమునుండి మీయయ్య దశరథాధీశ్వరుండు విమానారూఢుఁడై నిన్ను సంభావింపఁ జనుదెంచినవాఁడు. ఈరాజమార్తండునకు భక్తి యొనర్పుము. (అని మాపును. సీతారామలక్ష్మణులు నమస్కరింతురు.)

దశరథుఁడు:—వత్సలారా! లెండు (అని లేవఁదీసి రామలక్ష్మణుల నాలింగనముసేసికొని) వత్సా! రామచంద్రా,

తే. గీ. నిన్ను వీడుట స్వర్గంబు॥నిర్జరపతి
మైత్రి యును దేవమానిస॥త్స్థానములును
నెలమి గొలుపక యున్నవి॥హృదయమునకు
నిజము పల్కితి నందనా॥నిజము నిజము.

తనయా! నాఁడు నీకై నే నెన్నినపట్టాభిషేకకార్యమునకు దశకంఠవధము కారణముగ దేవతలచేత విఘ్నము ఘటింపఁబడె నని యిప్పు డెఱిఁగితిని. అరణ్యమునుండి మరలి పురిఁ జేరి పట్టాభిషిక్తుండవయిన నిన్నుఁ గాంచి కౌసల్య ధన్య యగు. పురిలోనివార లెల్లరు నీపట్టాభిషేకమునఁ గడుంగడు సుప్రీతిఁ గలరు. తండ్రీ! సీతాలక్ష్మణసహితుండ వైన నీచేతఁ బదునాల్గువత్సరములు పరిమితి వహించినయరణ్యవాసము చక్కగ నెఱపఁబడియె. నీప్రతిజ్ఞ చెల్లె. పితృవాక్యపరిపాలనంబున నాకు ధన్యత చేకూర్చితివి. రావణవధ మొనర్చి సురహిత మొనర్చితివి. ఇంక నయోధ్య కరిగి సామ్రాజ్యమ్ము గొని యనుజసహితంబుగ దీర్ఘాయుష్మంతుఁడవై సుఖింపుము.

శ్రీరాముఁడు:—(అంజలి పట్టి) మహాత్మా! నీకు నాయందుఁగల వాత్సల్యము భరతునియందును బ్రకటింపఁ జేయుము. తొల్లి మాయమ్మ యగు కైకేయీదేవితోడ సపుత్ర వైన నిన్నుఁ బరిత్య

జింతు నని కోపమున నాడిన యాఘోరశాపోక్తు లమ్మహాదేవిని జెందకుండ నను గ్రహింపుము. నిన్నుఁ బ్రార్థించువాఁడ.

దశరథుఁడు:—తండ్రీ! అట్లే యగుఁ గాత. నీయిచ్చ యెట్లో యట్ల చేయుదువు గాక—వత్సా! లక్ష్మణా! మీయన్న యగు రామచంద్రుని నతిభక్తి మెయి సేవించితివి. కావున నాకు సంతోషమును నీకు ధర్మఫలమును బరమయశమును సంప్రాప్తము లయ్యె. కంటివి కదా! యింద్రాదిదిక్పతు లెట్లు రామభద్రు నుతులొనర్చిరో! ఎల్లవేళల సేవ సేసి యుచితభంగి నడచుకొనుచు నీయెడ నితనిఁ బ్రసన్నునిఁ గావించుకొనుచుండుము. నీవు నీయన్నను వనంబుల కనుగమించువేళ నీతల్లి "రాముఁడే దశరథుఁ డనియు, సీత మాయమ్మ యనియు నడవి యయోధ్య యనియు నెంచికొని సుఖాత్ముండవు గ"మ్మని యాడిన పలుకు లింత స్మరింపుము. నిక్కముగఁ బక్షివాహనారూఢుఁ డగు నమ్మహావిష్ణుఁడే రాముఁడు. అట్టియాతనియెడ భక్తి చేసి నీయశము జగముల నింపుము—జనకనందనే!

తే. అంబ లోకాపవాదభయంబునకును
దలరి రాముఁడు నిన్నుఁ బూనితగ నొనర్పఁ
బూని కఠినోక్తు లాడెనుగాని మదిని
వేఱువిధమైన యట్లు భావింపఁ బోకు.

రాముని కన్ని వెంటలను ననుకూలవై యామహాత్ముని భక్తితో భజించి చిరయశం బుపార్జింపుము. తనయులారా! నే నింక నామంత్రణంబు గొందును.

(సీతారామలక్ష్మణులు నమస్కరించుచుండ విమాన మెక్కి నిష్క్రమించును)

ఇంద్రుఁడు:—రామచంద్రా! రావణవధం బొనరించి మా కెల్లరకు నిండారుసంతోషము చేకూర్చితివి. వలసిన వర మడుగు మిచ్చెద.

రాముఁడు:—అమరేంద్రా! నీకు నాయెడ దయ గలదేని నాకై యాంద్రు బిడ్డలఁ బాసి నాతోడియే కార్యులై లెగువ మెయి నరుదెంచి యీమహారణాంగణమునఁ బగఱచే వెన్నక వారిచే నిహతులైన వానరు లెవ్వ రెవ్వరు గలరో వారెల్లరు యుద్ధయాత్ర వెడలిననాఁటిభుజవిక్రమములును దేజములును ధైర్యములును బలములును గలిగి విశల్యులై తనరున ట్లనుగ్రహింపుము. ఈశూరవానరోత్తములు వసించువనము లెల్ల సంతతముఁ గందమూలఫలాదులతో నొలయునట్లు ప్రసాదింతువు గాక.

ఇంద్రుఁడు:—మహాత్మా! త్రిలోకకంటకుం డగు దశకంఠునిఁ బరిమార్చి లోకమునకు హితము గూర్చి యధర్మోన్మూలన మాచరించి ధర్మసంస్థాపనమును శిష్టపోషణమును వ్రతములుగాఁ బూని యొనర్చుచు విశ్వజనీనచరిత్రుండవై యొసఁగు నీకోరిక దీర్చుటకంటె నాకుఁ బరమార్థ మొం డుండునే! నీకోరినయట్లు యగుఁగాక.—అవె మాండుము చెదరినయంగము లన్నియు నలఁతి తునియలఁ గాహాళి యతుకునట్లు మొండెముల నతికికొని సజీవంబులై సబలంబులై సతేజంబులై నీవానరబలములు మురియుచు నెట్లు లేచుచున్నవో. నిద్రనుండి యిప్పుడే మేల్కనినట్లు తోఁచుఁ గదా.

శ్రీరాముఁడు:—(చూచి) నిర్జరేంద్రా! నిన్న రథ మంపి విజయము గల్గించి నేఁడు వానరవీరుల బ్రదికించినాకు మిగుల నుపకరించి న న్నానందవార్ధి ముంచితివి. నీయాదర మగణ్యము! (వానరులు సింహనాద మొనర్తురు. శ్రీరాముఁడు నమస్కరించుచుండ దేవత లదృశ్యులగుదురు.)

(యవనిక పడును.)

---

# పంచమాంకము.

## అష్టమస్థలకము.

[ప్రదేశము—ఆకాశపథము.]

[అగస్త్యుఁడు, రంభానలకూబరులు ప్రవేశించుచున్నారు.]

రంభ:—యక్షరాజనందనా! రామచంద్రుఁ డెంతటిపరాక్రమవంతుఁడు! నాకసి దీర రావణహతకునిఁ జంపి నా కెంతయు హితముఁ గూర్చినాఁడు.

అగస్త్యుఁడు:—చేలా! ప్రపంచ మంతయు నీకై యే యేర్పడిన ట్లెంచుచున్నదానవు. శ్రీరామచంద్రుఁడు శ్రీమన్నారాయణుఁడు. ఆపరమపురుషుఁడు లోకహితము గూర్చుటకై ధర్మమునకు గ్లాని గలిగినపు డెల్ల నాధర్మము నెలకొల్పుటకై యవతరించుచుండువాఁడు. శిష్టపీడన మాచరించుచుండిన దుష్టాత్ముని రావణుని సంహరించి సర్వలోకహితము చేకూర్చినవాఁడు. ఆపరమపురుషునకు సర్వప్రాణులు నొక్క రూప. ఇప్పు డీతని కార్యము సుధర్మాధ్యక్షుం డగు నింద్రుఁడు మున్నగు దేవవర్గమునకును సుధర్మాసక్తులగు మునిలోకంబునకును సర్వజగత్సంతానమునకును మిక్కిలి యు మేలు చేకూర్చినది. ఆ పురుషుఁ డెల్లప్పుడును ధర్మకర్త యు ధర్మభర్తయు ధర్మభోక్త యు నై నట్టివాఁడు. ఆధర్మమయుని యీధర్మసంస్థాపనకార్యము మహేంద్రుఁడు తనకు నిండారినసంతోషము కలిగింపఁగా నెంతయు నుత్సాహంబున నుత్సవము సేయఁబోయి యున్నాఁడు. ఈసమయము సర్వలోకములకు నుత్సాహము గూర్చినట్టిది. పొమ్ము పొమ్ము. అమరావతి కేగి యందలి యీశ్రీరామవిజయమహోత్సవమునఁ బాల్గొని నీ గాంధర్వవిద్య సఫలీకరింపఁ జేసికొనుము.

రంభ:—మహాత్మా! నీహితోపదేశమున నాయజ్ఞానము మాసెను. భగవదాజ్ఞానుసారము మహేంద్రుకొలువున కిదే పోవుచానను.

అగస్త్యుఁడు:—పొమ్ము నలకూబరా! ఈసర్వదేవోత్సవమున నీవును నవాఙ్మానసగోచరం బగు నానంద మనుభవింపఁబొమ్ము.

నలకూబరుఁడు:—మహాత్మా! అట్లే యాచరించెదను.

అగస్త్యుఁడు:—మీ రింకఁ బొండు. వసిష్ఠాదిమహర్షులతోడ నేను శ్రీరామపట్టాభిషేకమహోత్సవముఁ జూచి యానందింప నయోధ్య కేగెదను. ఆపరమపురుషుఁడు లోకమున కెల్ల నాదర్శప్రాయుఁడు గాఁడా. లోకమున నిట్లు లీలామానుషవేషము గొని ధర్మమార్గమునఁ దాను మెలంగుచు లోకము నట్ల నడపించుచు జగన్నాటకమునకు సూత్రధారుఁ డైనవాఁడు. ఇఁక మన మెల్లఁ బోవుదము.

(రంభానలకూబరు లమరావతిమార్గమునను, నగస్త్యుఁ డయోధ్యాపురము మార్గమునను నిష్క్రమింతురు.)

---

## పంచమాంకము.

### నవమస్థలకము.

[ప్రదేశము—నందిగ్రామము.]

[భరతుఁడు శత్రుఘ్నుఁడు వసిష్ఠాదిమునులు ప్రవేశించుచున్నారు.]

శత్రుఘ్నుఁడు:—అన్నా! ఊర కేల యిట్లు పట్టుపట్టెదవు? ఇంచుకంత యోపిక పట్టుము. నేఁడు గాకున్న రేపైన రామచంద్రాదులు తప్పక రాఁగలరు.

భరతుఁడు:—శత్రుఘ్నా! నన్నాఁగకు.

గీ. కడచెఁ బదునాలుగేఁడుల ♦ గడువు నిన్న
తోడనే రామదేవుఁడు ♦ తోఁపఁ డయ్యె
నన్న లేకున్న జీవనం ♦ బున్నె నాకు
నగ్గిఁ జొచ్చెదఁ దమ్ముఁడా ♦ యాఁగవలదు.

చిత్రకూటగిరిని బాదుకలిచ్చిననాఁడే యీపదునాల్గేఁడులపరిమితి తీరినమఱునటిదినమే నేను దప్పకవచ్చువాఁడ నని శ్రీరాముఁడు నాతోఁ జెప్పియుండె. ఏ నప్పుడు పరిమితి గడచిన మఱునాఁ డాతఁడు తోఁపకున్న నగ్గిఁ జొచ్చువాఁడ నని చెప్పియుంటిని. నీవును నెఱుంగుదువు గదా. ఇంక నన్నాఁగకుము. (అగ్ని చెంతకు వచ్చి యంజలి నేసి)

ఆ. వె. రామదేవుఁ డింకను ♦ రాఁ డయ్యె వీటికి
నడవులందు నుండు ♦ నిష్ఫు దీరె
నతని వీడి యిలను ♦ నక్కటా మన నోప
నావరింపు నన్ను ♦ నగ్నిహోత్ర.

(అని యగ్నికి మూఁడుమారులు ప్రదక్షిణము చేయును.)

హనుమంతుఁడు:—(తెరలో నుండి) ఆఁగుము భరతా! ఆఁగుము. (అని ప్రవేశించి భరతునికేలు పట్టుకొని) వచ్చినాఁడు-వచ్చినాఁడు రామదేవుఁడు.

భరతుఁడు:—(నలుదెసలఁ జూచి) హనుమంతా! ఊరక నన్నేటి కాఁగెదవు. ఏఁడీ మా రామదేవుఁడు?

హనుమంతుఁడు:—దశకంఠునిఁ గుమమాడి విభీషణుని లంకలో నభిషేకించి యానందంబునఁ దమ్ముఁడును సతియుఁ దన్నుఁ గొల్చుచుండ సుగ్రీవవిభీషణులు నిజసైన్యంబులతోఁ బరి

వేష్టించి కొలిచియుండఁ గుబేరపుష్పకమ్మున సుఖాసీనుఁడై యిక్కడకు వచ్చువాఁడు భరద్వాజమునీశ్వరుపంపున నాతనియాతిథేయసత్కారంబు గొన శ్రీరామదేవుఁ డించుకంత నిలిచినాఁడు. నీ విట్టియవగడ మొనరింతు వని శంకించి యాదేవుఁడు నిన్నుఁ దేర్ప మున్ను నన్నుఁ బంపె. (తెరలో విమానఘోషము.) వాఁగె చూడుము రామాదులు వచ్చుచున్నారు.

(పుష్పకమునుండి రామాదులు దిగుచున్నారు. ఎల్లవారును వెఱఁగంది చూచున్నారు. భరతశత్రుఘ్నులు నమస్కరించుచున్నారు.)

శ్రీరాముఁడు:—(వారిని గ్రుచ్చి యెత్తి) తమ్ములారా! (అని యాలింగనముసేసి కన్నీరు విడుచును. భరతాదులును గన్నీరు విడుతురు. రామాదులు వసిష్ఠాదులకు నమస్కరింతురు.)

హనుమంతుఁడు:—దేవా! నే నించుక తప్పుచుండినఁ గార్యము దప్పుచుండెను. నేను దేవరయానతిని శృంగిబేరపురమున నిషాదనాయకుఁ డగు గుహునితోఁ దమరాక యెఱింగించి యీయెడకు వచ్చునంతకు భరతకుమారుఁడు వహ్నిఁ జొచ్చుచుండెను.

భరతుఁడు:—ఇమ్మరుత్కుమారుఁడు నన్నుఁ దప్పించెను.

శ్రీరాముఁడు:—అవ్యాజమైనది సుమా హనుమంతునికరుణ మనయెడల. నాఁడు లక్ష్మణుని, నేఁడు నిన్ను రక్షించి మనవంశము నే నిలువఁబెట్టినవాఁడు.

హనుమంతుఁడు:—దేవా! నీభటుఁడ నగు న న్నేల యిట్లగ్గించెదవు. భవదప్రమేయకరుణావిశేషమునఁ గాక మర్కటమాత్రుఁడ నగు నేఁ జేసిన దేమి కలదు.

(గుహుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

గుహుఁడు:—(ఎల్లరకు నమస్కరించి) రామదేవా! నేఁడు మిమ్మెల్లరఁ గాంచుటచే నే ధన్యుఁడను

శ్రీరాముఁడు:—(కౌఁగిలించుకొని) నిషాదనాయకా! కుశలమా నీకు ను నీబంధుగులకును.

గుహుఁడు:—దేవా! భవదాశీర్వచనంబున నెల్లరకుఁ గుశలము.

భరతుఁడు:—నిషాదనాయకా! నా దొక్కమనవి గలదు. నీ విక్కడనే యుండి రామదేవునిపట్టాభిషేకమహోత్సవము నిర్వర్తించి మా కానందము గల్గింపవలయు నని నాప్రార్థన.

గుహుఁడు:—భరతరాజకుమారా! ఇంతకంటెఁ గావలసిన దేమి గలదు. అవశ్య మట్లులే కానిమ్ము.

భరతుఁడు:—అన్నా! ఏవీ! భవచ్చరణము లిటుచాఁపుము. (అని కాళులకుఁబాదుకలుదొడిగి) దేవా ఇదె నీరాజ్యము. వీరెనీప్రజలు. ఇంక నాభారము తీరెను. (అనినమస్కరించును.)

వసిష్ఠుఁడు:—సాధు! భరతా! సాధు!-రామచంద్రా! భరతునిప్రార్థన మంగీకరింపుము.

శ్రీరాముఁడు:—సంయమీంద్రా! మీయందఱవచనముల శిరసా వహించువాఁడను

సుగ్రీవుఁడు:—హనుమంతా! నీపరిచరులతోడ నేగి నాల్గుసంద్రములజలములఁ గొనితెమ్ము. శ్రీరామచంద్రున కభిషేకింపవలయును. (హనుమదాదులు నిష్క్రమింతురు.)

వసిష్ఠుఁడు:—ఇంక మన మయోధ్య కేగుదము రండు.

సుమంత్రుఁడు:—ఆయుష్మంతుఁడా! నా కొక్కవర మీవలయు ననుగ్రహింపుము.

శ్రీరాముఁడు:—సుమంత్రా! నీ విట్లు వేఁడవలయునే. అడుగుము.

సుమంత్రుఁడు:—నాఁడు నిన్నుఁ దే రెక్కించుకొనివచ్చి యడవుల విడిచితి నని నన్నెల్లపౌరులు దూఱిరి. నా కాదూఱు తప్పునట్లు నన్నెల్లరు మెచ్చునట్లాయుష్మంతుఁ డిప్పుడు నే సారథ్యము చేయ రాజరథము నారోహించి పురప్రవేశము చేయ వేఁడెదను.

శ్రీరాముఁడు:—నీయిచ్ఛ మెయిఁ గానిమ్ము. (అందఱు నిష్క్రమింతురు.)

---

## పంచమాంకము.

## దశమస్థలకము.

[ప్రదేశము-అయోధ్య, పట్టాభిషేకమండపము]

[శ్రీరాముఁడు భార్యతో సింహాసనాసీనుఁడై యుండ వసిష్ఠుఁడు కిరీటమును జేతులఁ గొని నిలిచియుండ భరతాదిసోదరబృందము కొలిచియుండ సుగ్రీవవిభీషణాది మిత్రబృందమును బరివారంబును సేవించుచుండ మహోత్సవ సందర్శనాగత ముని రాడ్బృందము యథోచితవ్యాపారముల నుండఁ దెరయెత్తఁబడును.]

వసిష్ఠుఁడు:—సదస్యులారా! మీరెల్లరుసంపూర్ణ మనోభీష్టంబుల మయిని వహ్నిసాక్షిక మిత్రీకృత సుగ్రీవుండును మహానుభావుండును లంకాసామ్రాజ్యప్రదానపరిపూరితమనోరథవిభీషణుండును సాధులోక తోషణుండును దశకంఠముఖదివిషద్ద్వేషత్కులవిలుంఠనపరితోషితాఖిలజేంద్రుండును ధర్మాచరణనిష్ఠుండును రవికులకలశవారాంనిధపూర్ణిమాచంద్రుండును శరణాగత పరిత్రాణైకయశోరుంద్రుండును నగు శ్రీరామచంద్రునిపట్టాభిషేకంబునకు ననుమతించిన వారలే కదా!

అందఱు:—సమ్మతించినవారము. సంపూర్ణంబుగ సమ్మతించినవారము.

వసిష్ఠుఁడు:—ఏరత్నశోభితకిరీటరాజము బ్రహ్మనిర్మితమో యేదివ్యకిరీటశ్రేష్ఠము మనువు మొదలుగఁ దదన్వయసంభవరాజన్యులయుత్తమాంగంబులఁ గ్రమంబున రాజ్యాభిషేకములఁ గాంచి మించెనో యాయీ కిరీటవతంసము శ్రీరామచంద్రునియుత్తమాంగ మలంకరించుఁ గాక. (అని శ్రీరామచంద్రునిశిరంబునఁ గిరీట మిడి యభిషేకించును. వసిష్ఠనియమితు లగు మునులాఁ గొందఱును శ్రీరామునిఁగలశోదకంబులతో నభిషేకింతురు. సభాస్తారులు జయజయ నాదములు సలుపుదురు. అప్పుడుదివమునుండి సీతారాములపైఁ బుష్పవృష్టికురియును.

(శ్రీరామచంద్రసార్వభౌమ! విజయీ భవ! దిగ్విజయీ భవ! యని యాకసమునుండి ధ్వని వినఁబడును.)

వసిష్ఠుఁడు:—ఓహో! దేవతలజయనాదము.

(అప్పుడు సభాస్తారు లెల్లరు వెఱఁగందిచూచుచుండఁ బైనుండి యొక్క దివ్య ముక్తాహారము క్రిందికి దిగి శ్రీరామచంద్రునికంఠ మలంకరించుచున్నది. బోరన గాలి వీచిన శబ్దము నగుచున్నది.)

అందఱు:—ఏ మీయద్భుతము! ఎవ్వరును గానరారు. ఇది యెట్లు వచ్చెను!

వసిష్ఠుఁడు:—రామభద్రా!—దేవా!

శ్రీరాముఁడు:—బ్రహ్మర్షి పుంగవా! మీ రట్లు పిలుచుటచే నాకు సంతోషము. నాకు దశరథరాజేంద్రుండును మీరును నొక్కరూప

హనుమంతుఁడు:—ఓహో రామదేవునివినయగాంభీర్యము!

వసిష్ఠుఁడు:—రాజేంద్రా! బృందారకులు నీయందు భక్తితత్పరహృదయులై రని యెల్లరకుఁ దెలిపి కృతజ్ఞత సూచించుచు వాయుదేవుఁ డీ దివ్యముక్తాహారముచే నీకంఠ మలంకరింపించి యున్నాఁడు. దీనిచేత నిస్తులతేజోభిరాముఁడవైతివి.

అందఱు:—ఎంత వింత! (అని యాశ్చర్యము చూపుచున్నారు.)

వసిష్ఠుఁడు:—(అక్షతలు గొని యాశీర్వాదమంత్రము చదివి)

గీ. భూరిసారప్రసవలయి ♦ పొల్పు నిర్వ
రకును సద్వంశపద్మలకును ♦ రమణ మెరయ
ధారణీజాతకును భూత ♦ధారిణికిని
జెలువుఁ డగుచును జిరము వ ♦ర్ధిలుఁగదయ్య.

(అని యక్షతలు చల్లును.)

శ్రీరాముఁడు:—విప్రాశీర్వాదము శిరస్సున వహించితిని.—లక్ష్మణా! నీవు యౌవరాజ్యపదమున నిలువవలయుఁ జుమా.

లక్ష్మణుఁడు:—దేవా!పిన్నవాఁడ నీభారము వహింపఁజాలను. నే నెల్లప్పుడు నీకు దాసపదమున నుండుటే నాకు సమ్మతముగాని ప్రభుపదము వలదు. దయమై నీవెంట నగు న న్నేలుము.

శ్రీరాముఁడు:—లక్ష్మణా! నీబుద్ధి కెంతయు మెచ్చితిని. భరతా! నీవు తప్పక యౌవరాజ్యపదము స్వీకరింపవలయును.

భరతుఁడు:—ప్రభునియిచ్చవచ్చినట్లే యగుఁ గాక.

వసిష్ఠుఁడు:—(భరతు నభిషేకించును.) రామచంద్రా! ఇంక నీ కేమి కావలయును.

శ్రీరాముఁడు:—ఎల్లయిచ్చలు కొనసాగె. ఇంక నేమి వలయు. అయిన నిట్లగుఁ గాక.

భరతవాక్యము.

కం. మే లగుతఁ బ్రజల కెప్పుడు
మే లగుతం బ్రభువులకును ♦ మేలగుతను వి
ప్రాలికి నాలుకు నెప్పుడు
మే లగుతక్ లోకములకు మే ♦ లగుఁ గాతక్

వసిష్ఠుఁడు:—తథాస్తు. శాంతిరస్తు.

(యవనిక పడును.)

(శ్రీరామపట్టాభిషేకనాటకము సర్వము సంపూర్ణము.)

# తప్పొప్పుల పట్టిక.



| తప్పు | ఒప్పు | పుట. | బంతి. |
|---|---|---|---|
| జల్లి, | జల్లి | 1 | 12 |
| సుశీలవా, | సుశీలవా! | ... | 13 |
| శ్రీమనోరమణున, | శ్రీమనోరమణున | 2 | 1 |
| దెచ్చినవాఁడు | దెచ్చినవాఁడు. | 3 | 29 |
| మా మొడళ్ల దవదవలగు | మాయొడళ్ల దవదలగు | 5 | 5 |
| శిరసావహించి | శిరస్సులవహించి | ... | 11 |
| క్రోతి | క్రోఁతి | 8 | 5 |
| ఏఁడే! నానాథుఁడు | ఏఁడే నా నాథుఁడు. | ... | 23 |
| భోగంబులుం; | భోగంబులుం | 9 | 23 |
| జింతింతు; వేమంగు నే; | జింతింతు వేమంగు నే | ... | 24 |
| పన్నాగము | పన్నికము | 11 | 19 |
| ను సింహాసంహననుండు | ను సింహాసంహననుండు | 13 | 24 |
| మాల్యవంతుఁడు, మొదలగు | మాల్యవంతునితోను, మంత్రులతోను | 14 | 10 |
| మంత్రులతోను | | ... | 11 |
| సంబధపడని | సంబంధపడని | ... | 25 |
| నామంధ్ర | నాత్రమం | 17 | 14 |
| మోహాయుఁడేఁచిన | మోహాయుఁడేఁచి | 20 | 14 |
| స్త్రైసిగ | స్త్రైసి | ... | 16 |
| సేయ | సేయఁ | 22 | 2 |
| జయముఁ | జయము.( | ... | 24 |
| సుగ్రీవునిఁ | సుగ్రీవుని | 23 | 22 |
| వచ్చుచున్నారు. | వచ్చుచున్నారు | 25 | 25 |
| వలసెనె, | వలసెనె | 27 | 30 |
| చేయుగురు! | చేయుగురు | 30 | 27 |
| రావణుఁడు తిరస్కరిణి వహించుమను. | రావణుఁడు, తిరస్కరిణివహించిన | 32 | 3 |
| బడెనో | బడెనో. | 34 | 17 |
| నా రాముఁడు | యా రాముఁడు. | 36 | 13 |
| సీతమ్ముఁడు | తమ్ముఁడు. | 37 | 12 |
| నిలిపిన | సలిపిన | ... | 20 |
| కొదుగు | కొడవు | ... | 23 |
| నీమదికిఁ | నిమదికిఁగ్ర | ... | 31 |
| యేగితి | వేగితి. | 38 | 15 |
| చరింతము | యాచరింతము. | ... | 29 |

| తప్పు | ఒప్పు | పుట. | బంతి. |
|---|---|---|---|
| హనుమందుదిఁ | హనుమంతునిఁ | 39 | 25 |
| పరమేష్టి | పరమేష్ఠి | ... | 27 |
| వై చెను. | వైచును. | 40 | 8 |
| ఇప్పులుగాకి | ఇప్పలుగాకి | ... | 17 |
| పెట్టనట్టి | పెట్టునట్టి | ... | 19 |
| యిప్పుడ | ఇప్పుడ | ... | 20 |
| చేసి | జేసి | ... | 22 |
| వానిమ్కుకును | వానిముక్కును | 41 | 6 |
| నే వెనువెంట | నీ వెనువెంట | 44 | 3 |
| మూగి | మూఁగి | ... | 10 |
| ప్రాథనము | ప్రార్థనము. | 45 | 1 |
| యిట్లుపట్టిన | యిట్లుపట్టుపట్టిన | ... | 3 |
| నేఁగి | నేగి | ... | 7 |
| యొసఁగెడు | యొసఁగెడు | ... | 18 |
| రక్కసపుమూఁకల | రక్కసమూఁకల | 46 | 16 |
| ధైర్యోత్సాహంబులు | ధైర్యోత్సాహంబులు | ... | 18 |
| పుత్రుఁడగు | సురపుత్రుఁడగు | 54 | 16 |
| నాఁడునా? | నాఁడు | ... | 30 |
| బింకము | బింకములు | 55 | 5 |
| దీర్తునో | తీర్తునో | ... | 17 |
| చున్నది. | చున్నవి. | 57 | 2 |
| (దుఃఖము | (దుఃఖమున) | ... | 13 |
| బవేశించును. | బ్రవేశించును. | 58 | 23 |
| తల | దల | 59 | 6 |
| విడువుము. | విడువుము. (అనియతనిని డాయును) | ... | 15 |
| పన్నాగము | పన్నకము | ... | 16 |
| (అని చెంతకేగి) (ప్రకాశముగ) | (ప్రకాశముగ) | ... | 17 |
| ద్యజియించుట | ద్యజియించుట యా | ... | 25 |
| యన్యజనంబుల | న్యజనంబుల | ... | 26 |
| నాణముగును | నాణెముగును | 60 | 8 |
| గూర్చుచున్నాఁడవె. | గూర్చుచున్నాఁడవు. | ... | 10 |
| ఆహా! | —ఆహా! | 61 | 32 |
| యే ని | యేని | 62 | 6 |
| దుర్మాగ్గుఁడు | దుర్మార్గుఁడు | ... | 15 |
| ధన్వంతిరి | ధన్వంతరి | 64 | 29 |
| తాఘవా | రాఘవా | 65 | 18 |
| నిష్కమించును | నిష్క్రమించును | 66 | 32 |
| లంకపురి | లంకాపురి | 68 | 11 |
| హానుముంతుఁడు | హనుమంతుఁడు | ... | 27 |

| తప్పు | ఒప్పు | పుట. | పంతి. |
|---|---|---|---|
| శ్రమయే | శ్రమమే: | ... | 29 |
| తేపకడ | రేపకడ | ... | 31 |
| కొడకు | కొడుకు | 71 | 8 |
| మఁఱిగి | మఱేఁగి | 72 | 23 |
| రేనసి | రెనసి | ... | 27 |
| సంయమీద్రుని | సంయమీంద్రుని | 73 | 25 |
| సోదరుల | సోదరున | 74 | 6 |
| క్రుచ్చికొన్న | (క్రుచ్చికొన్న | 75 | 3 |
| అసువుల! | అసువుల | ... | 18 |
| విసుఁగున | విసుగున | ... | 28 |
| చేప్ప | చెప్ప | ... | 31 |
| ధైర్య | ధైర్య | 77 | 3 |
| యుద్ధమున | యుద్ధరంగమున | 79 | 18 |
| నీరజనయనా. | నీరజనయనా! | 80 | 27 |
| వరము లమోఘములు | వరముల మోఘములు | 82 | 2 |
| రాముని డకు | రామునికడకు | 83 | 25 |
| నీ, | నీ | 84 | 25 |
| సన్యాసి | సన్న్యాసి | ... | 30 |
| విచిన | విచ్చిన | 85 | 1 |
| రాముఁడు | రాముఁడు | 88 | 8 |
| క్రంద్రించు | క్రందించు | ... | 22 |
| లక్ష్మణా సమ | లక్ష్మణాసమ | 91 | 24 |
| యభీష్టము. | యభీష్టము | 93 | 13 |
| దనాతరము | దనారతము | ... | 17 |
| నిలువరింపుము. (జానకీదేవిని | నిలువరింపుము జానకీదేవిని.( | ... | 24 |
| శిరసా | శిరమున | 98 | 27 |
| గురియును. | గురియును.) | 99 | 25 |
| మెరయ | మెఱయ | 100 | 10 |

